# అరుణతార

సాహిత్య, సాంస్కృతిక మాసపత్రిక 320

సంపుటి: 39 సంచిక: 1 డిశంబరు, 2015 - జనవరి, 2016

పేజీలు: 68 వెల: రు. 15



ప్రాణులు ఉలిక్కిపడిన నా పూలతోటలో
కత్తులు కండ్లు తెరిచిన చప్పుడు
కలలు చెదిరిన సీతాకోక చిలుక
చెల్లాచెదరైన గూటి పక్షి
గాయపడ్డ శ్రామిక చీమలు...

**2015 డిసెంబర్ 18 నుంచి 27 హైదరాబాద్‌లో ప్రొ. జయశంకర్ ప్రాంగణంలో జరిగిన హైదరాబాద్ బుక్ ఫెయిర్‌లో అరుణతార స్టాల్**




















**2016 జనవరి 1 నుంచి 11 చలసాని ప్రసాద్ సాహిత్య వేదికగా విజయవాడలో జరిగిన విజయవాడ బుక్ ఫెయిర్‌లో అరుణతార స్టాల్**










కారణాలను ఇంకా మాట్లాడుకోవల్సిన అఘాయిత్యం ఏర్పడిందంటే అసలు మనం ఏ యుగంలో ఉన్నామో సీరియస్‌గా ఆలోచించాల్సిన అవసరం ఉంది.

ఈ దేశ అగ్రకుల బ్రాహ్మణీయ భూస్వామ్యం వేల సంవత్సరాలుగా దళిత, ఆదివాసీ స్త్రీల సంపదను, శ్రమను దోచుకోవడమే కాక వారిని నిత్యం లైంగికంగా కూడా దోచుకుంటుంది. ప్రత్యేకించి దళిత స్త్రీలను జోగిని, బసివిని, మాతంగి వంటి పేర్లు పెట్టి స్థానిక, దేవుళ్ళతో పెళ్ళి జరిపించి ఊరు ఊరంతా ఉమ్మడి ఆస్థిగా నిత్యం అనుభవిస్తుంది. తమ పిల్లలకు తండ్రి ఎవరో చెప్పుకోలేని దుస్థితి వీరిది. కనీసం ఉపాధి అవకాశాలు కూడా ఉండక దుర్భర జీవనం సాగిస్తున్నారు జోగినులు. అటవీసంపదను దోచుకోవడానికి అడ్డుగా వున్నారనే కుట్రతో ఆదివాసీ స్త్రీలపై పోలీసు సాయుధ బలగాల చేత సామూహిక అత్యాచారాలు, హత్యలు చేస్తున్నాయి అగ్రకుల భూస్వామ్య పాలక వర్గాలు.

ఇవాళ దేశంలో స్త్రీలపై పెరిగిపోతున్న అత్యాచారాలు, హత్యలకు కారణం ఈదేశ బ్రాహ్మణీయ భూస్వామ్య సామాజిక, సాంస్కృతిక దోపిడితో పాటు దేశీయ, సామ్రాజ్యవాదుల ఆర్థిక దోపిడి తీవ్రతరం కావడమే. వీరి జమిలి దోపిడిని కప్పి పుచ్చుకోడానికి దేశంలో వేల సంవత్సరాలుగా కొనసాగుతున్న స్త్రీ, పురుష అసమానతలే కాక స్త్రీల మధ్య కూడా అసమానతలకు కారణమైన కులం, హిందూమతం, పితృస్వామ్యాలను రెచ్చగొడుతు కొత్త కొత్త రూపాలలో వీటిని అమలు చేస్తున్నాయి భారత పాలకవర్గాలు. ఇవికాక సామ్రాజ్యవాద సరుకు సంస్కృతి కూడా తోడయ్యింది. ఈ దేశ మనువాద పితృస్వామ్యం స్త్రీని 'శృంగార సాధనం'గా చూస్తే, సామ్రాజ్యవాద సంస్కృతి 'సరుకు'గా మార్చింది. 1990 వరకు ఈ దేశ సహజ సంపదను , ప్రజల శ్రమను మాత్రమే దోచుకున్న సామ్రాజ్య వాదులు ఇవాళ స్త్రీల శరీరాలను సైతం దోచుకుంటున్నారు. టూరిజం, కాల్‌మనీ, సెక్స్‌రాకెట్ మొదలైన మార్గాల ద్వారా సెక్స్ వ్యాపారం చేస్తూ కోట్ల డాలర్లు గడిస్తున్నారు. ఈ మధ్య వరంగల్ జిల్లాలో మాయమై చంపబడ్డ లంబాడా బాలికలైన భూమిక, ప్రియాంక ఈ సెక్స్‌రాకెట్ వ్యాపారంలో చిక్కుకున్నవారే. ఈ దుర్మార్గమైన వ్యాపారం చేస్తుంది ఏ నేరస్తులో, గూండాలో కాదు. స్వయానా రాజకీయ నాయకులు, పెట్టుబడిదారులు. టిఆర్ఎస్, టిడిపి, బిజెపి పార్టీలు ఈ వ్యాపారంలో ప్రధాన పాత్ర పోషిస్తున్నాయి.

మహిళా సంఘాలు గత దశాబ్దం క్రితం వరకు పీడిత మహిళల సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక హక్కుల కోసం మాట్లాడేవి, పోట్లాడేవి. ఇవాళ ఈ హక్కులు అటకెక్కిపోయి కనీసం స్త్రీలను స్వేచ్ఛగా బతకనివ్వండి అంటు ప్రాథమిక హక్కయిన జీవించే హక్కు కోసం పోరాడాల్సిన దుస్థితి ఏర్పడిందంటే మళ్లీ మనం ఆనాటి శ్రామిక మహిళలవలె 18వ శతాబ్దంలోకి నెట్టివేయబడ్డామన్నమాట! అందుకే ఇప్పుడు మాట్లాడటం, మొక్కుబడి కార్యక్రమాలు చెయ్యడం కాకుండా నాటి శ్రామిక మహిళలు తెగించి పోరాడినట్టు నిరంతరం పోరాడాల్సిన తక్షణ కర్తవ్యం మన ముందుంది. పీడిత మహిళలకు దిక్కు దరి లేకుండా పోయిన నేటి పరిస్థితుల్లో చైతన్య మహిళా సంఘం ఎక్కడికక్కడ మహిళలను ఐక్యం చేసి సంఘటిత పోరాటాలు చెయ్యాల్సిన అవసరం ఎంతైనా ఉంది.




ప్రచురణకర్త : పి.జయ, రాష్ట్ర అధ్యక్షులు చైతన్య మహిళా సంఘం, సెల్ : 9441119519 తేది: 18.02.2016

# అంతర్జాతీయ శ్రామిక మహిళా పోరాట దినం స్ఫూర్తితో

# హిందుత్వ, సామ్రాజ్యవాద కుమ్మక్కుతో పెరుగుతున్న అత్యాచార హత్యలకు వ్యతిరేకంగా పోరాడుదాం

1910వ సంవత్సరం డెన్మార్క్ రాజధాని కోపెన్‌హెగెన్‌లో జర్మనీ కమ్యూనిస్టు నాయకురాలు క్లారాజెట్కిన్ అంతర్జాతీయ శ్రామిక మహిళా పోరాట దినం ప్రకటించారు. యూరప్, అమెరికా దేశాల పరిశ్రమలలో పని చేసే శ్రామిక మహిళలు రోజుకు 15 నుండి 18 గంటలు వెట్టి చాకిరీ చేసేవారు. పరిశ్రమల యజమానులు వారి శ్రమకు తగ్గ వేతనాలు ఇవ్వకపోగా కనీస సౌకర్యాలు కూడా కల్పించేవారు కాదు. ఆ గడ్డు పరిస్థితులలో శ్రామిక మహిళలు యూనియన్లుగా ఐక్యమై అనేక పోరాటాలు, ప్రాణత్యాగాలు చేసి తమ డిమాండ్లను సాధించుకున్నారు. ఆ శ్రామిక మహిళల పోరాట తెగువను గుర్తించిన అక్కడి కమ్యూనిస్టు మహిళలు వారికి మద్దతుగా నిలిచారు. వారిలో క్లారాజెట్కిన్ ముఖ్యులు.ఆనాటి శ్రామిక మహిళల పోరాట స్ఫూర్తిని ప్రపంచ మహిళలందరికి చాటుతు వారి పోరాట వారసత్వాన్ని కొనసాగించడం కోసం ఏర్పాటు చేసిందే అంతర్జాతీయ శ్రామిక మహిళా పోరాట దినం. అంతేకాక ఆ దినాన్ని సంవత్సరానికి ఒకసారి ఆనవాయితీగా, పండగలాగ జరుపుకోవడం కాకుండా నిరంతరం స్త్రీలు ఎదుర్కొంటున్న రకరకాల దోపిడి, అణచివేతలను నెమరువేసుకొని వాటికి పరిష్కారం వెతుక్కుంటు అంతిమంగా సంపూర్ణ విముక్తి, సమసమాజ స్థాపన వైపు పయనించాలని ఆనాడు క్లారాజెట్కిన్ పిలుపునిచ్చారు.

అయితే ఇవాళ ఈ మహిళా దినం ఏర్పడ్డ ఉద్దేశ్యం, లక్ష్యం ప్రపంచ వ్యాప్తంగా వక్రీకరించబడింది. బహుళజాతి కంపెనీలు తామే మహిళా దినాన్ని కనిపెట్టినట్టు ఫోజు పెడుతు తమ సరుకుల ద్వారా (ఫెయిర్ అండ్ లవ్లీ వగైరా) మహిళాదినాన్ని స్పాన్సర్ చేస్తున్నాయి. ఈ దేశంలో 1950 నుండి కమ్యూనిస్టు పార్టీలు, మహిళా సంఘాలు మహిళా దినం జరుపుతున్నప్పటికీ ఇప్పటికీ 99% మహిళలకు మహిళాదినం చరిత్ర తెలియదంటే అతిశయోక్తి కాదు. పాలకవర్గ మహిళా వింగ్‌లు, ఉద్యోగినులు కూడా మహిళాదినం చరిత్రను పట్టించుకోకుండా ఈ దేశ హిందూ సంప్రదాయంలో భాగమైన ముగ్గులు, ఆటలు, పాటలు, వంటలు మొదలైన వాటికి మహిళాదినాన్ని కుదించేసి బొకేలు, స్వీట్లు, షీల్డులు పంచుకుంటు ఆ రోజును ఒక వేడుకగా మార్చేస్తున్నారు. మరి ఈ 105 ఏండ్లలో స్త్రీల సమస్యలు తగ్గిపోయి అసలు అభివృద్ధే జరగలేదా అంటే జరిగింది. దోపిడి వర్గాలు, ఎగువ మధ్యతరగతి, మధ్య తరగతి విద్యా, ఉద్యోగ, వ్యాపార, రాజకీయ రంగాలలో ఎంతో కొంత అభివృద్ధి చెందారు. కానీ 80% వున్న కార్మిక, కర్షక, కూలీ చేసుకునే మహిళల మౌలిక (కూడు, గూడు, గుడ్డ) స్థితిగతులలో ఎలాంటి మార్పు రాకపోగా ఉన్న కొద్దిపాటి ఉపాధి కూడా ఊడిపోయి రోడ్డున పడుతున్నారు. పైగా ఇవాళ వీరి ఉనికికే పెను ప్రమాదం ఏర్పడింది. వయసుతో సంబంధం లేకుండా ఎక్కడ చూసినా అత్యాచారాలు, హత్యలు రాజ్యమేలుతున్నాయి. జనాభాలో సగం అయిన స్త్రీల సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక రంగాలలో జరిగిన అభివృద్ధి, ఇంకా జరగాల్సిన అభివృద్ధి గురించి మాట్లాడు కోవల్సిన నేటి తరుణంలో తరతరాలుగా స్త్రీలపై అమలవుతున్న లైంగిక హింస, పెరుగుతున్న హత్యారూపాలు, రెట్టింపయిన






(320)

సంపుటి : 39 ◆ సంచిక : 1 ◆ డిసెంబర్ 2015 - జనవరి 2016

వర్కింగ్ ఎడిటర్
డి.వి. రామక్రిష్ణారావు
ఎం.ఐ.జి. - 14, ఎ.పి.ఐ.ఐ.సి. కాలనీ,
కార్బైడ్ కంపెనీ ఎదురుగా,
మౌలాలి, హైదరాబాద్ - 500 040.

* కేవలం పోస్ట్, బుక్‌పోస్ట్ ల ద్వారా
రచనలు పై చిరునామాకూ,
ఇ-మెయిల్ ద్వారా
**arunatara1977@gmail.com** కూ
పంపవచ్చు

సంపాదకవర్గం :
ఉజ్వల్, బాసిత్, కూర్మనాథ్

చందాలు పంపాల్సిన చిరునామా -
మేనేజర్
వలేటి అరవింద్ కుమార్
భీమ్‌సేన్‌రావు, 1-9-52/ఎఫ్/2,
ఈ-సేవ దగ్గర, మదర్ హైస్కూల్ ఎదురుగా,
రామ్‌నగర్, హైదరాబాద్ - 500020.
సెల్ : 8142200711
(ఫోన్ చేయాల్సిన సమయం
ఉ.10 గంటల నుండి మ. 1 గంట వరకు)

విరసం కార్యదర్శి చిరునామా
పి. వరలక్ష్మి
5-1820, గీతాశ్రమం వీధి,
ప్రొద్దుటూరు, కడప జిల్లా - 516 360.

డి.టి.పి. అండ్ లే అవుట్
ఆర్. భాగ్యలక్ష్మి

కవర్ డిజైన్ : పి. వరలక్ష్మి,
ఆర్. భాగ్యలక్ష్మి

ఫొటోలు : క్రాంతి, కోడం కుమార్,
పచ్చల కిరణ్‌కుమార్, అరసవిల్లి కృష్ణ

Like Page://arunatara viplava
rachayitala sangham

Virasam website : *www.virasam.in*

ఈ సంచిక వెల : రూ. 15/-

## సంపాదక లేఖ...

మంద్రస్థాయి యుద్ధానికి బహు ముఖాలు ఉన్నాయి. ఇటీవల ఆఫ్ఘన్, ఇరాక్, సిరియా యుద్ధాలకు పాల్పడిన అమెరికా ... వియత్నాం యుద్ధ అనుభవాలతో ప్రపంచ వ్యాప్తంగా మంద్రస్థాయి యుద్ధాన్ని ప్రారంభించింది. అప్పటి నుంచి అనేక సమాజాల్లో ఇది కొనసాగుతున్నది. ఆ దేశాల పాలకవర్గాల ఒరలో మంద్రస్థాయి యుద్ధతంత్రాన్ని చేర్చింది. భారత పాలకవర్గం జాతుల ఉద్యమాలను అణచివేయడానికి ఈ తక్కువ స్థాయి యుద్ధాన్ని ఎలా అమలు చేసిందో మనకు తెలిసిందే.

విప్లవోద్యమాన్ని కూడా దెబ్బతీయడానికి రెండు దశాబ్దాల కిందే ఈ యుద్ధాన్ని ప్రారంభించింది. అనేక రంగాల్లో జరిగే ఈ యుద్ధానికి భావజాల ముఖం తీవ్రమైనది. ఇవాళ అది హిందుత్వ రూపంలో ముందుకు వచ్చింది. భారత పాలక వర్గాలకు ప్రాతినిధ్యం వహిస్తున్న అన్ని బూర్జువా పార్టీలు ఆది నుంచీ హిందుత్వను ఫాసిజంగా పెంచిపోషిస్తున్నాయి. వలస వ్యతిరేక జాతీయోద్యమంలోనే ఈ విష బీజం పడి విస్తరించింది. రాజకీయాల్లో మతం కలగలిసిపోవడం వల్ల సమాజమంతటా హిందుత్వ విస్తరించడం తేలికైంది. నేరుగా హిందుత్వ రాజకీయాలతో బిజేపీ రాజకీయాల్లోకి హిందుత్వను వేగంగా, తీవ్రంగా తీసుకొని రావడం వల్ల పార్లమెంటరీ రాజకీయాలకు మత వర్గ తత్వమే పూర్తి స్థాయి నిర్వచనమైపోయింది.

ఇవాళ అది సమాజపు మారుమూలన్నిటినీ దురాక్రమిస్తోంది. మార్కెట్ ఎలాగైతే చీమలు దూరని చిట్టడవిలోకి విస్తరించిందో, రాజ్య యంత్రాంగం ఎలా మానవ ఆవాసాలన్నిటిలోకి వెళ్లిందో.. అలా హిందుత్వ అన్ని తావులకూ వెళ్లింది. అక్కడ ఉండిన పరంపరాగత ప్రజా జీవన వైవిధ్యాన్ని హిందుత్వ గొడుగు కిందికి తీసుకొని వస్తున్నది. శాస్త్రీయ భావ సంఘర్షణా కేంద్రాలుగా ఉండాల్సిన విశ్వవిద్యాలయాల్లోని అన్ని రకాల ప్రగతిశీల భావధారలను తుద ముట్టించడానికి సంఘపరివార్ ప్రవర్తిస్తున్నది. విశ్వవిద్యాలయాలను బ్రాహ్మణ అగ్రహారాలుగా మార్చివేయాలనుకునే ప్రయత్నం ఇందులో కనిపిస్తుంది.

వాస్తవానికి సంఘపరివార్ లక్ష్యం భావజాల పెత్తనం చేయడం మాత్రమే కాదు. యావత్ సమాజాన్ని సనాతన ధర్మ క్షేత్రంగా మార్చడం మాత్రమే కాదు. ఆర్ఎస్ఎస్ ఆవిర్భావ లక్ష్యంలోని జాతి, జాతీయత అనే వాటికి భారత బూర్జువా వర్గ స్వభావం ఉన్నది. అది చారిత్రకమైనది కూడా. ఆ బూర్జువా వర్గ ప్రయోజనాల కోసమే మతాన్ని, సనాతన ధర్మాన్ని, బ్రాహ్మణ్యాన్ని ఆయుధాలుగా వాడుకుంటున్నది. ఈ ఆయుధాలు అత్యంత ప్రమాదకరమైనవి. బూర్జువావర్గం తన రాజకీయార్థిక విధానంలో భాగంగా స్మార్ట్ సిటీలనూ తయారు చేయగలదు. విశ్వవిద్యాలయాలను వెలివాడలుగానూ మార్చగలదు. ఈ సంక్లిష్టత భారత బూర్జువా వర్గ సహజ లక్షణం.

ఈ వర్గాన్ని వీరోచితంగా ఎదుర్కొంటున్న విప్లవోద్యమాన్ని దెబ్బతీయడానికి, సమాజ ప్రజాస్వామికీకరణలో కీలకంగా ఉండగల పోరాటశక్తులను, భావజాలాలను నిర్మూలించడానికి భారత పాలకవర్గం మంద్రస్థాయి యుద్ధంలో హిందుత్వను ఫాసిజంగా మార్చేసింది. మార్కెట్‌తో, పెట్టుబడితో, శ్రమదోపిడీతో ముడిబడిన వర్గ ప్రయోజనాల కోసం సనాతన ధర్మాన్ని, హిందుత్వను వాడుకొనే వ్యూహం ఇది. దీని పొరలు విప్పిచూపి ప్రతిఘటించడమే ఇవాళ ప్రజల కర్తవ్యం.



## సంచిక - 320


**సంపాదకీయాలు (5-7)**
నిశ్శబ్దాన్ని ఛేదిద్దాం బహిరంగ కార్యాచరణకు సిద్ధపడదాం
- సివిఎస్ఆర్ ప్రసాద్
రోహిత్‌ల కోసం... - పి. వరలక్ష్మి

**పాటలు, కవిత్వం (8-20)**
పులులై గర్జించండి అలలై పోటెత్తండి - పిహెచ్. రమణాచారి
మహిత శృతితో - భూపాల్
ఆవుచ్చ - పాణి
పూలతోట - వడ్డెబోయిన శ్రీనివాస్
శిక్షణ - బాల సుధాకర్
మానవులు - ఎం. రాఘవాచారి
మాటల్ని మింగేస్తున్నాను - వాయుడి శ్రీధర్
ఘర్ వాపసీ - వాగేశ్వర్
జామై ఉస్మానియా రోడ్లలో ఆవు - రివేరా
ధిక్కార రుతువు - కెవరి
నిషిద్ధ మానవులు - కాశీం
ఇదీ ఇవ్వాల్టి యుద్ధ పిలుపు - జనజ్వాల
గుజరాత్‌లో ఓ మృతుని వాఙ్మూలం - మంగలేష్ దబ్రాల్
దువా! - గీతాంజలి
ప్రేమ చిరునామా - శిఖా ఆకాశ్
పావురం.. - కెక్యూబ్‌వర్మ
ఈ పువ్వులు పూశాయి - పద్మకుమారి
"ముజఫర్‌నగర్ బాకీ హై" రోహిత్ వేముల ఆత్మ-హత్య చెప్పిన
చేదు నిజం: స్మృతిబద్ధ హత్య! - వరవరరావు

**కథలు (21-28)**
యూ టర్న్ - రమా సరస్వతి
బొట్టు కుక్క- ఎండ్లూరి మానస
తలా పిడికెడు - బమ్మిడి జగదీశ్వరరావు
భయం, భద్రత? - సాగర్

**వ్యాసాలు (29-48)**
నేను వాళ్ళను క్షమించగలనా?
- బిల్కిస్ బానో, అనువాదం - గీతాంజలి
నరేంద్ర దభోల్కర్ 'ప్రతి రాధేమా' నా తండ్రిని మరల
చంపుతూనే ఉంది - హమీద్ దభోల్కర్, తెలుగు - ఆర్. శశికళ
నా దేశాన్ని కాపాడగలిగాను - కానీ నా కుటుంబాన్ని
కాపాడుకోలేకపోయాను - ఇబ్రహీమ్ షేక్, అనువాదం - గీతాంజలి
డాక్టర్ అస్గర్ అలీ ఇంజనీర్ స్మారకోపన్యాసం :
భారత సమాజం, లౌకికతత్వం - రోమిల్లా థాపర్,
సంక్షిప్త అనువాదం - సివిఎస్ఆర్ ప్రసాద్
మనువు ఆదర్శం - 'రాజ్యం' లక్ష్యం - వల్లూరి రుక్మిణి
న మాంసో మధు పర్కోం భవతి - కారసాల విజయకుమార్
ఎవరిదీ ఈ హిందుత్వ? - బి.ఎస్.రాజు

**సంస్మరణ వ్యాసం (49-51)**
కవిత్వం పోరాట గీతం... - అరసవిల్లి కృష్ణ

**సాహిత్య వ్యాసం (52, 59)**
కాలాన్ని జయించిన ప్రేంచంద్ కథ "ఈద్గా" - మహమూద్

**సీరియల్ (53-55)**
మార్క్స్ పెట్టుబడి - రచనా క్రమం - ఫ్రాన్సిస్ వీన్,
అనువాదం : ముక్తవరం పార్థసారథి

**కరపత్రాలు (56-61)**
- విరసం 25వ మహాసభల ఆహ్వాన సంఘ కరపత్రం
- విప్లవ రచయితల సంఘం 25వ రాష్ట్ర మహాసభలు
- గ్రీన్‌హంట్-3, సల్వాజుడుం-2లను వ్యతిరేకించండి
- కా. కాశీం పై కుట్ర, రాజద్రోహ కేసును వెనక్కి తీసుకోవాలి

**పత్రికా ప్రకటనలు (62-64)**
- ప్రజాకళాకారుడు కోవన్ ను వెంటనే విడుదల చేయాలి...
- ఆహారాన్ని శాంతి భద్రతల సమస్యగా మలచి మతోన్మాద ఫాసిజాన్ని అమలు చేస్తున్న ప్రభుత్వ కుట్రను ఖండిస్తున్నాం
- అద్దేపల్లి రామ్మోహనరావు గారికి విరసం నివాళి
- రోహిత్ మృతికి కారకులను కఠినంగా శిక్షించాలి
- కా. కాశీంపై పెట్టిన అక్రమ కేసును వెనక్కి తీసుకోవాలి

**విరసం వద్ద అమ్మకానికి ఉన్న పుస్తకాల జాబిత (65-66)**


విరసం కరపత్రాలను, స్టేట్‌మెంట్లను, అరుణతార పత్రికలను, విరసం ప్రచురణలను www.virasam.in వెబ్‌సైట్‌లో చూడవచ్చు. సాఫ్ట్‌కాపీలు డౌన్‌లోడ్ చేసుకోవచ్చు.
అలాగే వివిధ సాహిత్య పత్రికల బ్లాగులు, సైట్‌ల లింకులను కూడా చూడవచ్చు.


అరుణతార చదవండి! చదివించండి! చందాదారులు కండి!

చందాలు, బకాయిలు మనియార్డర్, డి.డి.ల రూపంలో మేనేజర్‌కు పంపించండి.
డి.డి.లను వలేటి అరవింద్ కుమార్, హైదరాబాద్ పేర తీయండి.
విడి సంచిక వెల - రు. 15; సంవత్సర చందా - రు. 180;
రెండు సంవత్సరాల చందా - రు. 350; మూడు సంవత్సరాల చందా - రు. 500;
ఐదు సంవత్సరాల చందా - రు. 800; దశాబ్ది చందా - రు. 1600/-

# నిశ్శబ్దాన్ని ఛేదిద్దాం బహిరంగ కార్యాచరణకు సిద్ధపడదాం

సియస్ఆర్ ప్రసాద్

ఇన్ని సంవత్సరాలుగా మనం వదులుకోవలసిన దానికంటే ఎక్కువే వదులుకున్నాం. అడగాల్సినంత అడగనే లేదు. మనం చాలా తక్కువ ప్రశ్నించాం. అవసరమైన దానికంటే చాలా ఎక్కువ కాలం నిశ్శబ్దాన్ని పాటించాం. మనం చాలా కాలంగా నాలుగు గోడల మధ్య గుసగుసలాడుకున్నాం. అందుకే వాడికి కొమ్ములు వచ్చాయి. ఇప్పటికైనా ఆత్మ విమర్శ చేసుకుందాం, వాస్తవాన్ని గుర్తిద్దాం. అడగాల్సినదంతా అడిగేద్దాం. కడగాల్సినదంతా కడిగేద్దాం. ప్రశ్నల జడివాన కురిపిద్దాం. నాలుగు రోడ్ల కూడలిలో జనం మధ్యకు వచ్చి నినదిద్దాం. వాడు బెల్లం కొట్టిన రాయిలా ఉండిపోతాడా, చెవిటివాడిలాగా నటిస్తాడా, తన చుట్టు ఉక్కు గోడ నిర్మించు కుంటాడా, అయినా దేన్నైనా లొంగ దీసుకొనే అంకుశం ఉండనే ఉన్నది. అదే ప్రజా చైతన్యం. అదే క్రియాశీలక కార్యాచరణ. ఆ మార్గం బాటపట్టి నడిబొడ్డులో చెయ్యి పెట్టి మెలిపెడదాం. లొంగి రాడా? అదీ చూద్దాం? ఇలాంటి వాళ్ళల్లో వీడు మొదటి వాడు కాదు, మొనగాడూ కాదూ. ప్రజాగ్రహం ముందు, సమిష్టి బలం ముందు వీడికంటే కొమ్ములు మొలిచిన వాళ్ళు చాలా మంది మట్టి కొట్టుకు పోయారు. వీడి చరిత్రనీ అట్లానే అంతం చేద్దాం. కావాల్సినదల్లా ఒక్కటే! స్పృహను చైతన్యంగా, చైతన్యాన్ని నినాదంగా, నినాదాన్ని ఆచరణగా, ఆచరణని పోరాటంగా మలుచుకోవటం, గుసగుసలు మాని, మనలో మనం కాదనుకొని అందరం కలసి బిగ్గరగా ఆలోచించడం.

మతం పేరుతో వాడు చేస్తున్న, చేయిస్తున్న అనాగరిక చర్యల్ని నిర్హేతుక చర్యల్ని ఎండ గడదాం. వాడి 'గో' రాజకీయం వెనుక ఉన్న రాజకీయార్థిక కుట్రను బహిర్గతం చేద్దాం. హిందువులందరి తరఫున మాట్లాడే హక్కు వాడికి ఎవరూ గుత్తకివ్వలేదని ముఖాన కొట్టినట్లు చెబుదాం. వాడు అమలు పరచాలని చూసే హిందూత్వ, ఈ దేశంలోని హిందువులందరి అభిమతం కాదని, అది కాషాయం తలకెక్కిన వాళ్ళ ఉన్మత్త ప్రేలాపన అని ప్రచారం చేద్దాం. వాణ్ణి సమాజం నుండి దూరం చేద్దాం. అందుకు అవసరమైన వాళ్ళందరితో స్నేహం కలుపుదాం. సమిష్టిలో భాగం అవుదాం. విజయాన్ని సాధిద్దాం.

భావజాలాన్ని భావజాలంతో ఎదుర్కోలేని వాడి భావ దారిద్ర్యాన్ని ఎండగడదాం. మతం పేరిట ఫాసిస్టు నియంతృత్వాన్ని అమలు పరచటానికి వాడు పన్నుతున్న కుట్రలని ఎండగడదాం. సాంస్కృతిక జాతీయవాదం పేరుతో ఇటు సంస్కృతిని, అటు జాతీయతని డొల్ల చేసి బ్రాహ్మణీయ సంస్కృతిని ప్రజలందరి మీద బలవంతంగా వాడు రుద్దుతున్న వైనాన్ని చాటి చెపుదాం. దేశంలోని అన్ని మతాలని తనలో సంలీనం చేసుకోవటానికి వాడు చేస్తున్న కుటిల ప్రయత్నాలని ఎండకడదాం. ఒకే దేవుడు, ఒకే పవిత్ర గ్రంథం, ఒకే జాతి అనే ఏక కేంద్రక సమాజం, బహుళత్వాన్ని, వైవిధ్యాన్ని నాశనం చేసి ఫాసిస్టు రాజ్య స్థాపనకు ఎలా దారి తీస్తుందో, ఆ రాజ్యంలో వాడే రాజ్యాంగం ఎట్లా అయిపోతాడో వివరించి చెపుదాం.

స్వదేశీ నినాదాలు ఇస్తూనే ప్రపంచ సామ్రాజ్యవాద బంటుగా, దళారీగా దేశాన్ని ఎలా తాకట్టు పెడుతున్నాడో, ప్రపంచ పెట్టుబడికి ఈ దేశాన్ని మార్కెట్టుగా ఎలా మార్చుతున్నాడో, అందుకోసం మతోన్మాదాన్ని ఎలా వాడుకుంటున్నాడో, సామ్రాజ్యవాద పెట్టుబడి, మత దురహంకారాల కలయిక ఫలితంగా ఆవిర్భవించబోయే భవిష్యత్ సమాజ వికృత రూపం ఎలా ఉంటుందో విప్పి చూపిద్దాం.

వాదనేగాని ప్రతివాదన ఉండటానికి వీల్లేదని, ధ్వనేగాని, ప్రతిధ్వని వినిపించటానికి అవకాశం ఉండకూడదని, చర్యేగాని ప్రతిచర్యలు ఉండకూడదని శాసిస్తున్న వాడి కండకావరాన్ని ఎదుర్కొందాం. మానవ హక్కుల హననానికి పాల్పడుతున్న అమెరికా నుండి ఇజ్రాయిల్ దాకా సామ్రాజ్యవాద, వాటి తైనాతీ దేశాల చుట్టూ తిరుగుతూ ఈ దేశాన్ని బందిఖానాగా మార్చటానికి వాడు చేస్తున్న దుర్మార్గపు ప్రయత్నాలని ఎదిరిద్దాం.

నవ్విపోదురుగాక నాకేటి సిగ్గు అన్నట్లుగా వాడు ప్రవర్తిస్తుంటే వాడి నిస్సిగ్గుతనాన్ని ఎండకడదాం. ఇవన్నీ సాధ్యం కావాలంటే మనం ఏం చేయాలన్నది ప్రశ్న. భావజాలాల మధ్య జరగవలసిన ఘర్షణను వాడు భౌతిక దాడుల స్థితికి దిగజారుస్తూ ఉంటే మనం చేసుకోవాల్సింది ఆత్మరక్షణే కాదు, ప్రారంభించాల్సింది ఎదురుదాడి. సూచనప్రాయమైన, లాంఛనప్రాయమైన నిరసనలకు కాలం చెల్లింది. అవి వాడిని ఏమాత్రం లొంగదీయవు. కావాల్సింది క్రియాశీలమైన సమిష్టి కార్యాచరణే. వాడికి, వాడి అనుచర గణానికి, ప్రజా సమూహం నుండి ఒక గొప్ప షాక్‌ట్రీట్‌మెంట్ తగలాలి. మన స్వేచ్ఛ కోసం, ప్రతిఘటనా స్వాతంత్రం కోసం, మనకిష్టమైన తిండి తినటం కోసం, మన మనోభావాల్ని, భావజాలాల్ని కాపాడుకోవటం కోసం మనం మరింతగా సంఘటితం కావాలి. (We shall be more assertive and aggressive) దెబ్బకు దెయ్యం కూడా దిగి వస్తుంది. దేనికి తగ్గ ఆయుధం దానికుంటుంది. ఆ ఆయుధాన్ని చేపట్టటమే సమస్యకు పరిష్కారం. అందుకే మౌనాన్ని విడనాడి, నిశ్శబ్దాన్ని ఛేదించి ఐక్యకార్యాచరణకు సిద్ధమౌదాం.



# రోహిత్‌ల కోసం...

## పి వరలక్ష్మి

యూనివర్సిటీల్లో బ్రాహ్మణీయ ఆధిపత్య హంతక సంస్కృతికి వ్యతిరేకంగా పోరాడుదాం

దుఃఖాన్ని వెంటబెట్టుకునే పుట్టాడు రోహిత్. ఒంటరి దుఃఖం తప్ప తలచుకోడానికి బాల్య జ్ఞాపకాలేవీ లేవు. జీవితాన్ని మొదలు పెట్టేందుకు నేనెప్పుడూ తొందరపడుతూనే ఉన్నానని రాశాడు తన చివరి ఉత్తరంలో. ఊహ తెలిసినప్పటినుండీ బహుశా జీవితాన్ని వెతుక్కుంటూనే ఉన్నాడు. సైంటిస్టు కావాలని.. సామాజిక శాస్త్రాలను, సైన్సును మిళితం చేసి కొత్త ఆవిష్కరణల చేయాలని అనుకున్నాడు. జీవితాన్ని మొదలు పెట్టడం అంటే మనిషిగా నిలబడి సామాజిక మానవుడిగా ఎదగడమని. దుర్భరమైన వేదన నుండి రోహిత్ తన జీవితం గురించి మాత్రమే కాదు మానవ సమాజం గురించి ఆలోచించాడు. కలత చెందాడు. తాననుభవించిన బాధల నుండి సామాజాన్ని ద్వేషించలేదు. పుస్తకాల్లో, క్లాసు రూముల్లో కెరీర్ చింతనలో బిగదీసుకుపోయి తన బతుకు తాను చూసుకోలేదు. సైన్సును, ప్రకృతినీ ఎంతగా ప్రేమించాడో మనిషిని అంతగా ప్రేమించాడు. అందుకే మనిషిని మనిషిగా గుర్తించే సమాజం కోసం ఆరాటపడ్డాడు. అంతులేని బాధలను అనుభవించి తనను పెద్దచేసిన అమ్మను గురించి ఆరాటపడినట్టు. మార్పుకోసం నిలబడ్డాడు. ఈ గడ్డు కాలంలో రోహిత్‌లు ఉండడం సమాజానికి ఎంత అవసరం! స్పందనలన్నీ బండబారుతున్న కాలంలో ఎంతో సున్నితంగా స్పందించేవాడు రోహిత్. భూకంపంపాలూ, యుద్ధాలూ, సామ్రాజ్యవాదం.. మనుషులు రాలిపోయే ప్రతి సారి.. గాజా పిల్లల కోసం, సిరియా శరణార్థుల కోసం, సరిహద్దు సైనికుల కోసం బాధపడ్డాడు. దళితుల నెత్తురు నిత్యం కళ్ళజూస్తున్న వ్యవస్థను అంబేడ్కర్ ప్రాపంచిక దృక్పథంతో అర్థం చేసుకున్నాడు. మార్క్సిస్ట్ అంబేడ్కరిస్ట్ అని అతని మిత్రులంటారు. గొప్ప ఆలోచనాపరుడు. సర్టిఫికెట్ల కోసం, డాక్టరేట్ల కోసం కాదు సైన్సును, పరిశోధనను వాటి అసలైన సారంలో అర్థం చేసుకున్నవాడు, కృషి చేస్తున్నవాడు. నిస్సారమైన చదువులకు శిలువేసుకొని, సమాజం నుండి విడివడి, వ్యక్తి సంకుచిత పరిధిలో నిస్తేజంగా తయారవుతున్న యువతకు భిన్నంగా రోహిత్‌లు కూడా ఉండటం సమాజానికి ఎంతో కొంత భరోసా.

రోహిత్‌ను సమాజం కాపాడుకోలేక పోయింది. రోహిత్ చెప్పినట్లు ఈ దేశంలో పుట్టుకే ప్రమాదమైన జీవితాలు ఉంటాయి. ఘనత వహించిన భారతదేశంలో బ్రాహ్మణీయ హిందూ ధర్మం ఇంటి నుండి విశ్వవిద్యాలయం దాకా తన పుట్టుకను పట్టుకు వేధించి, హింసించి సాధించింది. బి.జె.పి, ఎ.బి.వి.పి, ఆరెస్సెస్ పరివారం రోహిత్ చచ్చిపోయినా వదలడం లేదు. రోహిత్ కుల అస్తిత్వాన్ని, అతని వ్యక్తిత్వాన్ని, అతను నమ్మిన విలువలను హత్య చేస్తున్నది. జీవించి ఉన్నపుడూ, చనిపోయాక కూడా వారి ఘర్షణ దానితోనే. అంబేడ్కర్ విద్యార్థి సంఘంతో ఎ.బి.వి.పి. ఘర్షణంతా అదే. మార్క్సునూ, అంబేడ్కర్‌ను అధ్యయనం చేసిన రోహిత్ సమాజాన్ని శాస్త్రీయంగా అర్థం చేసుకుని ఆచరణలోకి వచ్చాడు. సంఘపరివార్‌కు శాస్త్రీయ దృష్టి అంటే పడదు. దానికి అంబేడ్కరిజం, మార్క్సిజం, హేతు చింతన బద్ధ శత్రువులు. శాస్త్రీయ పద్ధతిలో సమాజాన్ని విశ్లేషించి, వారి భావాల్ని ప్రచారం చేసినందుకే నరేంద్ర దెబోల్కర్, గోవింద పన్సారే, కలబుర్గిలను హత్య చేసింది.

ఏ మనిషికైనా ఒకటే విలువ అంటే సంఘపరివార్ ఒప్పుకోదు. అసలు మనిషి ప్రాణం కన్నా ఆవు ప్రాణమే ఎక్కువంటుంది. అంటరాన్నివాడిని చంపడం కన్నా గోహత్యా పాతకమే శిక్షార్హమైన నేరమని సనాతన ధర్మం చెబుతుంది కదా! ఆర్.ఎస్.ఎస్. సాంస్కృతిక పునాది బ్రాహ్మణీయ కులవ్యవస్థ. రాజకీయ, సైద్ధాంతిక పునాది మతోన్మాద ఫాసిజం. రోహిత్ పుట్టుక నుండి, దుర్భర జీవిత సంఘర్షణ నుండి, పొందిన జ్ఞానం నుండి వీటితో ఘర్షణ పడ్డాడు. దాన్ని వ్యక్తీకరించిన రోహిత్ వంటి వారే కాదు, అణచివేతకు గురవుతున్న కుల, మత మైనార్టీ సమూహాలు పడే ఘర్షణ అది. తన హిందూ బ్రాహ్మణీయ ఆధిపత్యాన్ని స్థిరపరచుకునేందుకు ఈ అన్ని సమూహాలతోనూ సంఘపరివార్ హింసోన్మాదంతో ఘర్షణ పడుతున్నది. మనిషి ప్రాణం విలువ తెలుసు గనకనే రోహిత్, అతని సహచరులు యాకూబ్ మెమన్ ఉరిశిక్షను వ్యతిరేకించారు. అన్న దొరక్కపోతే తమ్ముణ్ని ఉరితీయడం ఏమిటని అడిగితే అది దేశద్రోహమైపోయింది. ముస్లింల పద్ధతుల్లో యాకూబ్‌కు నివాళులర్పించడం తీవ్రవాదమైపోయింది. ముస్లింలను తీవ్రవాదులనడం తేలిక కాబట్టి వారి హక్కుల గురించి మాట్లాడిన వాళ్ళనూ నేరస్తులను చేయవచ్చు. గుజరాత్ గురించి మాట్లాడకూడదు, ముజఫర్ నగర్ గురించి అడగకూడదు. ఎందుకంటే నేరం చేయకపోయినా ముస్లిం అయినందుకు ఉరితీయవచ్చు. నేరం చేసినా అది కూడా ముస్లింలనో, దళితులనో చంపడం అయితే వాటికి శిక్షలుండవు. దేశద్రోహమని మీడియా గొంతుచించుకోదు. ఈ తలకిందుల న్యాయాన్ని ప్రశ్నించినందుకు రోహిత్ దేశద్రోహి అయిపోయాడు. నూటపది దేశాలు ఉరిశిక్షలను రద్దు చేశాయి. మన రాజ్యాంగం ఈ అమానవీయ చట్టబద్ధ హత్యను అత్యంత బలహీనులపైన, లాయర్లకు డబ్బులిచ్చుకోలేని, సమాజంలో పరపతిలేని సమూహాలపైనా అమలుచేయడం ఏమిటని పౌరహక్కుల ఉద్యమాలు ప్రశ్నిస్తున్నాయి.

ఇవి అడిగినందుకు రోహిత్ చచ్చిపోయినా సానుభూతి అవసరం లేని దేశద్రోహి అని ప్రచారం చేస్తున్నారు. అతడేమీ అమ్మాయిల వెంటపడి వేధించలేదు. చిల్లరమల్లర తగాదాలు పడలేదు. మెరిట్ స్టూడెంట్. తప్పుడు కేసు పెట్టి వేధించి చావుకు కారణమైన వారు, ఎవరిమీద పడితే వారిమీద పడి దౌర్జన్యం చేసే ఎ.బి.వి.పి., ఆర్.ఎస్.ఎస్., బిజెపి గోబెల్స్ ను మించిపోయి రోహిత్ పై అత్యంత దుర్మార్గమైన దుష్ప్రచారానికి దిగాయి. రోహిత్ ఆత్మహత్యకు దారితీసిన పరిస్థితులన్నీ తేటతెల్లమయ్యాక, అది పరోక్ష హత్య అని కూడా అర్థం అయ్యాక రోహిత్ వ్యక్తిత్వంపై దాడి మొదలయ్యింది. రోహిత్ పోరాటమంతా దళితుడిగానే. వెలివేతకు గురైందీ దళితుడిగానే. అతడు దళితుడే కాదంటుంది బి.జె.పి, ఎ.బి.వి.పి. ప్రభుత్వ ఇంటెలిజెన్స్ రోహిత్ మరణం గురించి కాదు రోహిత్ పుట్టిన కులం, వాళ్ళ తల్లి కులం, తండ్రి కులం గురించి పరిశోధన చేస్తుంది. చావుకు నష్టపరిహారం వెలకట్టి ఇస్తామంటే నిరాకరించి న్యాయం కోసం రోహిత్ తల్లి పోరాడుతుండగా, ఎప్పుడో కుటుంబాన్ని వదిలి వెళ్ళిపోయిన తండ్రిని పట్టుకుని మీడియా ఇంటర్వ్యూ తీసుకుంటుంది. రోహిత్ దళితుడా, కాదా? తల్లి కులమొస్తుందా, తండ్రి కులమొస్తుందా? తల్లి క్యాస్ట్ సర్టిఫికేట్ లో ఏముంది? ఇద్దరు నేరసులైన మంత్రులను, వారి పార్టీ విద్యార్థి సంఘ నాయకులనూ ఎస్.సి., ఎస్.టి. కేసు పెట్టకుండా కాపాడటానికి పోలీసు, ఇంటెలిజెన్సు, మీడియా సర్వశక్తులూ ఒడ్డుతాయి. నిరసన తెలుపుతున్న విద్యార్థులపై పోలీసులు, ఆర్ఎస్ఎస్ గూండాలు కలిసి దాడి చేస్తారు. రోహిత్ అంత్యక్రియల్లో జోక్యం చేసుకొని, మృతదేహాన్ని కూడా పోలీసులు స్వాధీనం చేసుకుని ఆ కుటుంబ సంప్రదాయానికి భిన్నంగా బూడిద చేసిన దగ్గరి నుండి అతని చుట్టూ సంఘటితమవుతున్న ఉద్యమాన్ని, సాటి విద్యార్థుల సానుభూతిని విచ్ఛిన్నం చేయడానికి ప్రయత్నిస్తూనే, ప్రశ్నిస్తున్న వాళ్లందరినీ 'శవరాజకీయాలు' అని మాట్లాడుతున్నారు. శవాన్ని కూడా హత్య చేసే విలువలకు, రోహిత్ నమ్మిన విలువలకు ఘర్షణ జరుగుతున్నది.

అసలు విద్యార్థి రాజకీయాలూ, భావ సంఘర్షణ ఏమిటి? యూనివర్సిటీల్లో జరగాల్సింది పాలకవర్గాలకు అవసరమైన మెదళ్ళను తయారుచేయడం కదా అని ప్రభుత్వాలు చెప్తాయి. విద్యార్థులు చేయవలసింది చదువుకోవడం మాత్రమే, అదీ మేము ముద్రించిన సిలబస్ మాత్రమే (మార్క్సిజం, అంబేద్కరిజం కాదు) అని నిర్దేశిస్తాయి. కెరీరిజం ప్రోత్సహించి యూనివర్సిటీలను మేధోబానిసలను తయారు చేసే ఖార్ఖానాలుగా అవి ఇప్పటికే తయారు చేశాయి. ఇక ఇప్పుడు యూనివర్సిటీల్లో, పరిశోధనా సంస్థల్లో ప్రగతిశీల ఆలోచనల్ని హత్య చేసి ఆర్ఎస్ఎస్ శిబిరాలను తయారు చేసే హిందుత్వ వనరుల అభివృద్ధి శాఖను (వ్యవహారంలో ఇది ఇంకా మానవ వనరుల అభివృద్ధి శాఖ అనే పాత పేరుతో ఉంది.) నరేంద్ర మోడీ ప్రభుత్వం ఏర్పాటు చేసింది. సంఘపరివార్ కు ఆలోచనంటేనే గిట్టదు. ఇక భావ సంఘర్షణకు ఆస్కారమే లేదు. మూఢవిశ్వాసాల మందను తయారు చేయడమే లక్ష్యంగా ఉన్న సంఘపరివారానికి, ప్రగతిశీల భావాలతో ఉన్నది శత్రుపూరిత సంఘర్షణే. మార్క్సిజం, అంబేద్కరిజం వాటి పద్ధతుల్లో అవి సమాజం పట్ల శాస్త్రీయ విశ్లేషణ చేస్తాయి. మార్పు దిశగా సమాజాన్ని పురోగమింపజేసే ఆలోచనా విధానాలను సంఘపరివార్ సహించదు. ఎందుకంటే అది సనాతన భావాల మీద ఆధారపడే పాలక వ్యవస్థలో భాగం కాబట్టి. విద్యార్థి సంఘంగా పేరు పెట్టుకున్న ఎబివిపి కూడా ఏ పార్టీ అధికారంలో ఉందన్నది సంబంధం లేకుండా అది పాలకవర్గంలో భాగం. కనీసం జార్జిరెడ్డి హత్య నుండే అది మనకు అనుభవం. ఇక్కడ అంబేద్కర్ విద్యార్థి సంఘంతోనే కాదు అంబేద్కర్ భావాలతోనే వారిది శత్రుపూరిత వైఖరి. అంబేద్కర్ ఫోటోకు దండ వేయడం దాకా సరే, అంబేద్కర్ భావాలను ప్రచారం చేస్తే సహించం అని అది నేరుగానే చెప్తోంది. అంబేద్కర్ సంఘం అయితే అంబేద్కర్ జయంతులు, వర్ధంతులు జరుపుకోండి. యాకూబ్ మెమన్ గురించి, ముజఫర్ నగర్ గురించి మీకేందుకు అంటుంది.

హెచ్.ఆర్.డి. మంత్రి స్మృతి ఇరానీ ఒక ఆకాశ రామన్న ఉత్తరం ఆధారంగానే మద్రాసు ఐఐటీలో అంబేద్కర్ పెరియార్ స్టడీ సర్కిల్‌ను నిషేధించేలా ఒత్తిడి చేసింది. ఇక హెచ్.సి.యూ విషయంలో స్వయంగా బి.జె.పి మంత్రే ఉత్తరం రాశాడు. అచ్చంగా హిందూ ధర్మమే అమలయ్యింది. దళిత విద్యార్థులకు సాంఘిక బహిష్కరణ. రోహిత్ వంటి వారికి వ్యవస్థతో నిత్యం సంఘర్షణ. దేశంలో సకల ఆధిపత్యాలను పోతపోసుకున్న సంఘపరివార్ తో ఘర్షణ అనివార్యమని రోహిత్ కు తెలుసు. రోహిత్, అతని సహచరులను ఒక సెమిస్టర్ పాటు సస్పెండ్ చేసినప్పుడు 'ఆరెస్సెస్, ఏ.బి.వి.పి బలపరుస్తున్న వ్యవస్థలకు వ్యతిరేకంగా నిలిచిన కారణంగా నేను సస్పెండ్ అయ్యానని చెప్పడానికి సంతోషిస్తున్నాను' అని ఫేస్ బుక్‌లో రాశాడు రోహిత్. ఈ మాత్రం దానికే నేను భయపడను అని కూడా రాశాడు. ఒక్కడిని చుట్టుముట్టి ఎ.బి.వి.పి. గూండాలు బెదిరిస్తే 'అవును నాకు మీ ధర్మం అంటే గిట్టదు. కాషాయం అంటే గిట్టదు అన్నాడు.' రెండో సారి సస్పెండ్ అయినప్పుడు వైస్ ఛాన్సలర్ కు మీ కమిట్‌మెంట్ ముందు తెల్ల జాత్యాహంకారి రోనాల్డ్ ట్రంప్ లిల్లీపుట్ లా కనిపిస్తున్నాడని వ్యంగ్యంగా ఉత్తరం రాశాడు. దళిత విద్యార్థులకు తలా పది గ్రాముల సోడియం అజైడ్ (విషం) ఇప్పించడని, వార్డెన్ కు చెప్పి దళిత విద్యార్థుల గదులకు మంచి ఉరితాళ్ళు ఇప్పించడని రాశాడు. గొప్ప మేధస్సు, సమాజం పట్ల నిబద్ధత, పోరాట స్ఫూర్తి ఉన్న రోహిత్‌ను కోల్పోవడం సామాజిక విషాదం. ఇదిక్కడితో ఆగితుందా? రోహిత్ విషాద మరణం దేశవ్యాప్త కదలికను తీసుకొచ్చింది. యూనివర్సిటీల్లో ఏబీవీపీ గూండాగిరీకి, సంఘపరివార్ జోక్యానికి అడ్డుకట్ట వేయగల సంఘటిత విద్యార్థి ఉద్యమ నిర్మాణం ఈ పరిణామాల నుండైనా జరగాల్సిన అవసరముంది. అది తప్పనిసరిగా పాలకవర్గాలకు వ్యతిరేకంగా జరగాల్సిన పోరాటం. ఎందుకంటే పాలకపక్ష పార్టీలన్నిటిలోనూ, అది బి.జె.పి.యా, కాంగ్రెసా సంబంధలేకుండా సంఘపరివార్ భావజాలమున్నది. దానికి చరిత్ర పొడవునా అనేక ఉదాహరణలు, అనుభవాలున్నాయి. రోహిత్ వంటి వాళ్ళను సమాజం కోల్పోకూడదు. రోహిత్‌లు మరణించకూడదు. నిలిచి పోరాడాలి. పోరాడి గెలవాలి.

*(ఈ సంపాదకీయాన్ని "యూనివర్సిటీల్లో బ్రాహ్మణీయ ఆధిపత్య హంతక సంస్కృతికి వ్యతిరేకంగా పోరాడుదాం" అనే శీర్షికతో విరసం కరపత్రంగా ప్రచురించాం. - సం.)*



పాటలు, కవిత్వం

# పులులై గర్జించండి అలలై పోటెత్తండి

## సిహెచ్. రమణాచారి

రండి రండి దళితులారా
దగాపడిన తమ్ములారా
ఎన్నాళ్ళీ అణిచివేత
ఎన్నాళ్ళీ దారుణాలు
పులులై గర్జించండి
అలలై పోటెత్తండి... ॥రండి॥

గతకాలపు మనువాదపు
కుట్రలింక చెల్లవనీ
అడుగడుగున ఆరాటం
ఆత్మగౌరవ పోరాటం
అనాదిగా సాగుతున్న
అనంత సంగ్రామమిది... ॥రండి॥

ఆత్మనూన్యతలు వద్దు
ఆత్మహత్యలూ వద్దూ
పూవుల వలె రాలిపోయి
వాడిపోతే ఫలమేమి
వీరులవలె యుద్ధభూమి
చావైనా ఘనవిజయమే.... ॥రండి॥

కవిగా మీవెంటనుంట
మీ కలలకు సాక్షినౌత,
నా రక్తం సిరా జేసి
మీ నెత్తురు మరిగిస్తా
నా కలాన్ని ఖడ్గంగా
మీ చేతికి అందిస్తా.... ॥రండి॥

ఎన్నాళ్ళీ అసమానత
ఎన్నాళ్ళీ వివక్షతలు
జీవితమే రణరంగం
పోరాటమే అనివార్యం
సంఘటిత మహాశక్తితోడ
కదలిరండి, కదలిరండి
ప్రతిఘటన పోరాటపు
బావుటాల నెగరేద్దాం... ॥రండి॥

(వేముల రోహిత్‌కు నివాళిగా...)

# మహిత శృతితో

## భూపాల్

ఏ పూలతీగల్లో అల్లుకొని ఉన్నవో
ఏ వెలుగు జాడల్ల పెల్లుబుకుతున్నవో
జోహార్లు అందామా
లాల్ సలామ్ అందామా
మహిత నిన్నేమంటు
కొనియాడుకోమూ!! ॥ఏ పూల॥

తమ్ముడెత్తిన జెండా తలమానికంగా
చిమ్మె విప్లవ జ్యోతులెన్ని తరములకో
నిప్పుడప్పులు మోగ మెప్పు వెల్లువ సాగ
వివేకు విప్లవం వినిపించెనమ్మా! ॥ఏ పూల॥

సాగరుని కెరటాలు ఆగిపోవమ్మా
అన్న నేర్పిన విద్య అల చందమామ
అడవి వెపనుకు పిల్లబాట చూపంగా
నీ దీక్ష ఏ క్షణం బావుటా చిరుగాలి
నీ పాట పదునుతో శృతి కలుపుతాము! ॥ఏ పూల॥

# ఆవుచ్చ

## పాణి

రోజూ పొద్దున్నే గంటెడు ఆవుచ్చ తాగితే సరి..
ముందుగా తల చుట్టూ ముమ్మారు తిప్పి సేవిస్తే
భూగోళం కూడా పవిత్రమవుతుందట... మర్చిపోయేరు

మనకెలాగూ సైన్స్ అంటే పడదు కావట్టి
మూఢ నమ్మకమే కామధేనువు

ఆవు ఎంత గొప్పదో తెలుసా
మనిషికంటే ..
ముక్కోటి దేవతలు నెలవై ఉంటారట
గాడిపాట్లో కట్టేసే వాళ్లకు ఏం తెలుస్తుంది
కడుపు నిండా గడ్డి, కుడితి పెట్టే వాళ్లకేం తెలుసు
ఊయల్లో పాపను చూసుకున్నట్లు
గోముగా కొమ్ము నిమిరి
లాలనగా ముట్టుకొనే వాళ్లకు దాని పవిత్రతేం తెలుసు
తోకతో తలపై తాటించుకునే వాళ్లకే అన్నీ తెలుసు
అమ్మ, ఆవు గురించి చిన్న పిల్లలకేగాక
అందరికీ పాఠాలు చెప్పడానికి ఎన్ని కథలున్నాయి?

మనకు చరిత్ర తెలియకపోవడమే మేలైంది

పురాణాలున్నాయి చాలు
వాటిల్లోంచే భక్తినీ, దేశభక్తినీ ఉల్లేఖించొచ్చు

మోదీగారికి ఏ దేశంపోయినా, ఏం చూసినా
ఆవే కనిపించడం విరోధాభాస ఎంత మాత్రమూ కాదు
ఆవు మహిమే అలాంటిది

ఆవు కళ్లలోకి చూడండి
ఎంత అమాయకంగా కనిపిస్తుందో
భక్తుల కోలాహలాలు, పసుపు కుంకుమలు, ధూప దీపాలు చూసి
గంగవెర్రులెత్తుతోంది
వెర్రిమాలోకం
తన మాయలు తనకే తెలియవు
పేడ వెయ్యడం, ఉచ్చ పొయ్యడం, పండంటి బిడ్డని కని రైతు చేతుల్లో పెట్టడం
పొద్దున్నే చేని గట్ల వెంట షికారు కొట్టి రావడం...

దేశమంతా ఇలా చుట్టి వస్తానని
పార్లమెంట్‌కు కూడా వెళ్లి వస్తానని
చట్టాలను మూపురం మీద అలంకరించుకొని ఊరేగుతానని
అదేమన్నా కలగన్నదా ఏమి?
రైతు చుట్టూ దూడూ.. అనుకుంటూ తిరుగుతున్నా అనుకుందేగాని
తన చుట్టూ రాజకీయాలు తిరుగుతాయని పిచ్చిమొద్దు ఏనాడైనా
అనుకున్నదా?

మన తిక్కగాని..
మనిషిని చంపి
ఆవును పూజించే లోకమిదని అంటే
మనుషులే నమ్మరు .. ఇక దానికేం తెలుసు!

రాముడి ప్రియమైన ఆహారానికి విదేశాల్లోనూ గిరాకే
ఆవు మాంసం అమ్మే కంపెనీలన్నీ మనవే
అయినా ఆవును రోజూ పూజించాల్సిందే
దేశాన్ని మనుషుల కబేళా చేయడానికి సిగ్గు పడేదే లేదు.

## పూలతోట

### వడ్డెబోయిన శ్రీనివాస్

కాశీకి పోయినోడు
కాటికి పోకుండ
మంగళ్‌యాన్‌కు
మనువు ముడివేసినపుడే
ప్రాణులు ఉలిక్కిపడిన
నా పూల తోటలో
కత్తులు కండ్లు తెరిచిన చప్పుడైంది

మొగ్గలేసిన మొక్కను చూస్తేనే
దుఃఖమొస్తోంది
నా ఇంట్లో భూకంపం మొదలైంది
నా పగలు నా రాత్రి వేయిపడగల బుస!
నా నీడ నా మీదే నిఘా వేసినట్టుంది
మతానికి మంత్రదండం దొరికితే
కుక్కకు బొక్క దొరికినట్టే!

నా పూల తోటలో
బెదురు చూపుల కలవరింతల కలకలం
ఆకస్మికంగా
రేపటి ఉదయం బీటలు బార్తున్న చప్పుడు
మూడు సరళ రేఖ తలల పొడవాటి తోకొకటి
వెన్నును చప్పరిస్తున్నట్టుంటుంది
ఖండాల గండపెండేరాలు తొడుక్కుంటూనే
కత్తులకు పగనేర్పుతున్న దృశ్యం

నా పూలతోట నిండా భయం ప్రవహిస్తుంది
ఖడ్గాల్లా సాగిన కండ్లు మీది మీది కొస్తుంటాయి
నా తోట పూల నెత్తుటి వాసనల ఆర్తనాదాలు విస్తరిస్తుంటాయి
కలలు చెదిరిన సీతాకోక చిలుక
చెల్లాచెదరైన గూటి పక్షి
గాయపడ్డ శ్రామిక చీమలు

కమిలిన ఆకులో నా ప్రతిబింబం చెదురుతున్నా
మెదళ్ళను దండగుచ్చే సూదేదో
నా చేతుల్లో ముక్కలవుతుంటుంది

## శిక్షణ

### బాల సుధాకర్

ఎప్పట్లానే
అక్షరాన్ని చేతుల్లోకి తీసుకుని
వాడుపుగా
భుజానికి వేలాడదీసుకోవడమెలానో -
ప్రయత్నంలో ఉన్నాను

దూరంగా
నిలువెత్తు అక్షరం వొకటి
వొరిగింది

అక్షరాలని
నేలకూలుస్తున్నవాళ్లెవరో
తెలిసింతర్వాత..

ఈసారి
అక్షరాన్ని గ్రేనేడ్‌లా మార్చి
శత్రువు మీదికి
సూటిగా విసరడానికే -
శిక్షణ తీసుకుంటున్నాను
(కల్బుర్గికి... )

# మానవులు

## ఎం. రాఘవాచారి

వాళ్ళు
సర్వం సహాధిపత్యంతో
భూమిని చెరబట్టిన
రాజులు కారు
చక్రవర్తులూ కారు
మానవ మాత్రులను
తిరొక్క రూపాలతో వశపరచుకున్న
దేవతా మూర్తులూ కారు
పురాణాలు కథనాలు
ప్రసిద్ధం చేసిన
బలి చక్రవర్తులు కారు
చక్రవర్తుల భుజాల మీంచి
భూమ్యాకాశాలను
గంపగుత్తగా చెరబట్టిన
సుప్రసిద్ధులు
వామనపాదులసలే కారు

వాళ్ళు
భూమి కోసం
అధికారం కోసం
నెత్తుటి యుద్ధాలు చేసిన
హింసై కాత్మ విలుధారులు
రాములు కారు
ప్రతిజోదులు రావణులూ కారు
యుద్ధ గీతా ప్రబోధకులు కృష్ణులు
యుద్ధాన్నే శ్వాసించిన
పాండవులు కౌరవులూ కానే కారు

వాళ్ళు
భూమి ఈ కొసనించి ఆ కొసదాకా
హద్దులు గీసి
రాజ్యాలు సామ్రాజ్యాలు
ప్రకటించుకున్న వాళ్ళు కారు
అశోకులు మగధులు
శాతవాహనులు కాకతీయులు
నిజాములు
పాలెగాండ్లు శోభనాద్రులూ కారు

వాళ్ళు
కంపెనీలు కాదు
కార్పొరేట్లు కాదు
మైనింగ్ రాక్షసులు కానే కాదు

రవి అస్తమించని రాజ్యాల నిర్మాతలో
ప్రపంచాన్ని చెరబట్టిన
ప్రపంచీకరణ సామ్రాజ్యవాద నియంతలో కారు

వాళ్ళు మానవులు
అద్భుత పరిణామ ప్రతిఫలనాలు
గొప్ప పరిణామం
సాధిస్తున్న వాళ్ళు
నిత్య శ్రామికులు
నీటికి మట్టికి
బంధం కనిపెట్టిన వాళ్ళు
మట్టికి విత్తుకు
నీటితో బంధం వేసి
నేలకు పురుడు పోసిన వాళ్ళు

ఆకాశపు కనుపాపలు
మబ్బులు కురిసిన నీళ్ళకు
చారికలు కట్టిన నేలన
కట్టలు పోసి నీటిని నిలిపిన వాళ్ళు
పచ్చగా సింగారించి పుడమిని
పంట కళ్ళాలతో నింపిన వాళ్ళు
రెక్కలు విరిచి పనిముట్లు చేసి
తీసిన గింజల మీద
విలాసాలు చేసుకున్న యజమానుల
పొగరు దింపిన బానిసకు
పాలు తాపిన వాళ్ళు

రాజ్యాలు నిర్మించి
రాజులను విలాసంలో బతికించిన వాళ్ళు
పొగరు తల నిండి విర్రవీగి
రాజులు చేసిన యుద్ధాలలో

రాలిపోయిన వాళ్ళు
రగిలిపోయిన వాళ్ళు
మట్టిపొరలలోంచి
మళ్ళీ మళ్ళీ జ్వలించిన వాళ్ళు

మిధ్యావాదపు లోతులు తవ్వి
పదార్థం పిడికిట పట్టి
చార్వాకం పలికింది వాళ్ళు
బౌద్ధం వాళ్ళు
బౌద్ధాన్ని బతికించింది వాళ్ళు
రాజ్యం మీద శిలువెత్తిన
క్రీస్తు వాళ్ళు
క్రైస్తవానికి దారి దీపం పట్టింది వాళ్ళు
ఎడారులలో ఒయాసిస్సులై
ఖర్జూర పండ్లు పంచింది వాళ్ళు
ఖురాన్‌కు ప్రాణమిచ్చింది వాళ్ళు

కులం కత్తుల మీద
మొలకెత్తిన భక్తి వాళ్ళు
భక్తి ఉద్యమంలో శిరసెత్తిన
ప్రశ్నలు వాళ్ళు
కులం నేరమై
నేరం ఆధిపత్యకులమై
మతం రాజ్యమై
రాజ్యం మతమై
నిలువ నీటి మడుగై
అల్లిన కర్మ సిద్ధాంతంలో
అణగారిపోయిన జీవితాలు వాళ్ళు
నిత్యకర్మతో
దేశాన్ని బతికించింది వాళ్ళు

కొంగ కొంగ గోట్ల పువ్వెయి
పాటలు పాడి
గోరుముద్దలై నిన్నూ నన్నూ
సాకింది వాళ్ళు
సంతరించ్చింది వాళ్ళు

ఏ మట్టిలో మట్టయి
మనకు మనుగడనిచ్చిరో
ఆ మట్టిలో వాళ్ళు రాలిపోతున్నరు
ఏ ఆయుధాలెత్తి ఎంత నెత్తురు చింది
ఏ రాజ్యం తెచ్చిరో
ఆ రాజ్యం చేతిలో వాళ్ళు రాలిపోతున్నరు

ఇప్పుడు
సరికొత్త ధర్మం నడుస్తున్నది
ఎవరి చేత ప్రాణం పోసుకున్నమో
వాళ్ళని చంపటం
ఎవరి రక్తం దేశానికి ప్రాణప్రదమైందో
వాళ్ల రక్తం దేశమంతటా పారించటం
ఒకడు యోగ సాధకుడు
ఒకడు యాగ సాధకుడు
రూపం వేరు సారం వేరు
ధర్మం నాలుగు పాదాల కింద నలుగుతున్నది

భూస్వాములు
ధనస్వాములు
కార్పొరేట్లు
దళారీలు
నిత్య వ్యాపార దాహానికి
మన చేతిలోని ముద్ద
నెత్తుటి ముద్దవుతున్నది

అవసరం సరుకయింది
బతుకు బరువైంది
సేద్యం దుస్తరమైంది
ఆకలి తీర్చని పంటలు
అప్పులు తీర్చని పంటలు
ఆగడాల మార్కెట్లు
అమానవీయ రాజ్యం
రైతు శవయాత్రలో
వ్యాపార క్రీడాడుకుంటున్నది

కుతకుత ఉడుకుతున్న నేలలో
తల్లివేరు కుములుతున్న వాసన
పల్లె వాకిండ్లలో శవాలు రైతులు
దేశమంతటా రైతుల సమాధుల కింద
పుట్లకొద్దీ పండుతున్న దుఃఖం మీద
అగ్గి రాజుకుంటున్నది
మానవీయ మానవావిష్కరణ
యుద్ధం చెలరేగుతున్నది
అడవి సిగలోంచి కొండగాలి
కొత్త ఉదయాన్ని పాడుతున్నది

# మాటల్ని మింగేస్తున్నాను

## నామాడి శ్రీధర్

ఎవరేమి చెబుతున్నా
బుద్ధిమంతుడి వలె ఊకొడుతున్నాను
భయమో సంశయమో
అవును కాదనే గురిని మింగేస్తున్నాను

ఎక్కడేమి జరుగుతున్నా
ప్రేక్షకుడి మల్లే తేరిపార చూస్తున్నాను
ఉపేక్షా నిర్లక్ష్యమూ
నిజం అబద్ధమనే రుజువుని చప్పరిస్తున్నాను

శతాబ్దాల తరబడి
నెత్తురోడ్చే ఊరుల పేర్లనీ
సాటి మనుషులు హతమారిన చిరునామాల్నీ
ఉచ్చరించకుండానే గమ్మున గుటకలేస్తున్నాను

ఆ చిల్లరదొంగ వెంటబడి
ఓ వీధికుక్క మొరుగుతుంది
ఖూనీకోరుల మధ్య నిలబడిన నేను
ఒక పెనుకేకని పుక్కిలించలేకపోతున్నాను

విషగుళికల పలుకుల్ని మింగీ మింగీ
చేదుబారిన గుండెలో జాగా మిగలలేదు
ఇప్పుడిక దాద్రి కలబుర్గి నామధేయాలు
నిప్పు ముద్దలై ఈ గొంతుక దిగడం లేదు

# ఘర్ వాపసీ

## నాగేశ్వర్

పరిక్కంపనీడో
పచ్చని చెట్టు నీడో
నీడున్న చోటుకే కదా వలసపోయేది

వలస ఒక జీవన విధానం
వలస ఒక బతుకు చిత్రం

మతమైనా
మనిషైనా
పుట్టినచోటే ఉంటే ప్రకృతి సూత్రం ఎట్లా అవుతుంది
పోయినోళ్ళు తిరిగి రావలసిందే తప్పదు
వలసపోయిన వాళ్ళను వాపసు తీసుకురావడం ఎలా! ?

కోళ్ళయితే
వాకిట్లో నూకలు పోసి పిలిచేవాళ్ళం
చేపలైతే
ఎరవేసి గుదిగుచ్చుకునే వాళ్ళం
మనుషులు కదా
ఎట్లా వాపసు తీసుకురావడం! ?

అంతరాల దొంతరల
కులం అరుగుమీద కూర్చోలేకనో
మరేదైనా మతం కొమ్మెక్కితే
ఆకలికి ఏదైనా ఆసరా దొరుకుతుందనో
బతుకు తండ్లాట బాటలో వలసెళ్ళిన వాళ్ళను
వాపస్ ఎట్లా తీసుకురావడం! ?

దారితప్పిన వాళ్ళను
ఘర్‌వాపసీ దారి పట్టించాలి తప్పదు
కులగజ్జో
మతపిచ్చో
ఏదో ఒకటి ఎదనిండా ఏపుగా పెంచి
మొండికేస్తే
త్రిలోక్‌పురో
ముజఫర్‌నగరో
ఏదో ఓ దారిలో దారికి తెచ్చుకోవాలి

దారికొచ్చిన వాళ్ళకు దండలేసి
మన దరికి రానివాళ్ళకు దండన విధించి
కుర్చీ మనదే గనుక
నిఖార్సుగా కూర్చొని తీర్పు ప్రకటిద్దాం

ఇంతకీ ఘర్‌వాపసీలను
నిచ్చెనమెట్ల సమాజంలో ఎక్కడ కూర్చోబెడదాం...?

# జామై ఉస్మానియా రోడ్డులో ఆవు

## రివేరా

తిన్న చావు విందు అరగడానికి
రాత్రి చదివింది దించుకోవడానికి
పొద్దున్నే జామై ఉస్మానియా రోడ్డులోకి...

తిందాం తిందాం అంటూ
పెద్దది చక్కిలిగింతలు పెట్టినట్టు
తిన్నది లోపల తంతూ, తరుముతూ...
మంచుకి, ముసురుకి ఒంటరిగా
బేతాళుడు వదిలిపెట్టేసిన చెట్టు

పుర్రె నెర్రెల్లోంచి బొట్టుబొట్టుగా...

తెల్లన్నంలో ఏమేసుకొని తిందామంటూ
పళ్లెం పట్టుకు తిరుగుతున్న పిల్లాడి చుట్టూ కుక్కల గుంపు
ప్రశ్నలు లేని లోకాన్ని
ఆవులింతలతో నిద్ర లేపుతూ
అప్పుడే ఆ రోడ్డులోకి... సూరీడు
పట్టాలను గిట్టల కిందేసి తొక్కేస్తూ
దూరంగా... రైలు దౌడు

# ధిక్కార రుతువు

## కెనరీ

నడినెత్తిన సూరీడు
హోరెత్తిన జడివాన
కటిక చీకటి రేయి
ఎముకలు కొరికే చలిగాలుల్ని ఎదురీదిన
ఆదిమ మట్టి దేహానికి
ఆకులూ అలములే ఆసరా
బొందిలో ఊపిరి నిలిపింది
ఏదో ఒక జంతు మాంసమే
బతుకు ఛిద్రం చేసే ఏ
నిషేధమూ లేదానాడు

కాల గమనాన్ని పెనవేసుకున్న
నాల్గుపడగల పురాతన సర్పం
బుసలు కొడ్తూ గస్తీ కాస్తోంది
తరాల మధ్య అంతరాల్ని సుస్థిరం చేసేందుకు

చరిత్రను పట్టి పీడిస్తున్న తమస్సును
దగ్ధం చేస్తున్న హేతువుపై
మరణశాసనం ప్రకటించిన మనువు
అభద్రతా శూలం కింద
అసహాయ జనం అల్లాడుతుంటే
నిశ్శబ్దంగా రుధిరం నేలను తడుపుతున్నది

దుర్గంధపు మత్తు పల్లకిపై
ఊరేగుతున్న విషప్పురుగులు
బహిరంగంగానే జబ్బలు చరుచుకుంటున్నాయి
దురహంకార వికృత వ్యాఘ్రం ముందు
విన్నపాలు వృథా ప్రయాస

గడ్డకట్టిన అసహనం మౌనరోదనల మీదుగా
నెత్తురు కక్కుకొని నగరాలు

శవాల దిబ్బలు లేవని గ్రామాల కోసం
బాధ్యతగా గొంతును పదునుపెడదాం

# నిషిద్ధ మానవులు

## కాశీం

నిషిద్ధ మానవులు
చావడానికి
ఉరితాళ్లను అందిస్తున్న
ఓ నా దేశమా?

సూర్యుడు ఆరిపోయిన రాత్రి
మరణ వాంగ్మూలం రాయడానికి
నెలవంక వెలుతురును కూడా నిషేధించావా?

అంటరాని రాత్రిలో
ఆకాశం వంక చూస్తే
'నక్షత్ర ధూళి'లో
నడయాడుతున్న నా కలల్ని
హత్య చేయడానికి
చందమామ కింద కూర్చున్న మనిషొకడు
జంధ్యం పోగులతో
ఉరితాళ్లను పేనుతున్నాడు

ఈ రాత్రి
దేశపటానికి వేలాడుతున్న
నిషిద్ధ మానవుడిలా ఉంది

ఉరికంబమా
నిన్ను చూస్తే
చావుకే వణుకు పుట్టించిన
భగత్‌సింగ్ కన్పిస్తున్నాడు

# ఇదీ ఇవ్వాళ్టి యుద్ధ పిలుపు

## జనజ్వాల

ఎన్నిసార్లు
సూర్యుణ్ని మీది ఆకాశ వస్త్రాన్ని తగలబెట్టాలని
మత పక్షుల మృగ రెక్కలై
ఎగురుతారు!

అమీబా పరిణామం
వెన్నముక మీద

మనిషి ముఖం
సత్యం కాలం నాలుకై
విశ్వం మీద గొంతు పెట్టినప్పుడు

ఎన్ని రాళ్లు
ఎన్ని కొండల బండల్ని
అబద్ధాల కూతల్ని విసిరి దుర్మార్గ ఆనంద హోళీ
చేసుకుంటుంది

రొట్టె
అందరి ఆకలి తీర్చాలి
అన్నందుకు అండగా నడిచినందుకు
నడిచిన కాలం మీద శిలువ వేసితిరి

ఏ శకం అయితేనేమి!
ఆకాశానికి వంగిన వీపుల చూపులతో
నడిచే తోవలేని శకం పది అయితేనేమి!
కాలాన్ని వెనకాలకు నడిపించే
పురాణాల పురుగుల బల్లులై
చరిత్ర గాథల్ని కొరుక్కుతింటిరి

కోడి కూతల
పరకాయల అస్త్రమా
చీకటి
హితబోధ చరిత చేసితిరి

చూపు ప్రశ్నిస్తుందని
తల మాట్లాడుతుందని
చూపు చూపుకో కులం
తల తలకో మతం
రాజ్యం శాసనాల రంగు అద్దితిరి

ఏ నీడల కింద ప్రకృతి పరవశించి మాట్లాడుతుందో
మాటల మీద మతక్రౌర్యాన్ని పాలన చేసితిరి

ఎన్ని శతాబ్దాల నడకలు
ఎన్ని యుగాల చూపులు
ఎన్ని పోరాటాల మానవజాతి

జాతి జాతి చరిత్ర అంతా
తడిసి తడిసి రక్త సంద్రం
కొత్తగా పారుతుంది

ఆధిపత్య నిరంకుశం
మతం ఒక కోణం
ఒక కొత్త సృష్టి రాజ్యాధికారం
మతోన్మాద రాజకాంక్షకులారా
సమస్త ప్రకృతి ప్రాణులు
మారు మనిషి ప్రాణులు
అంటే... అదిరి అదిరి పారి పోతున్నవి

చెట్టు మీది నుంచి
రాలిన పండు ముద్దాడిన భూమి
అనాదిగా సత్యం 'సైన్స్' కాంతియై
ప్రశ్నకు పురుడు పోస్తునే ఉంది
ప్రశ్న మనిషి నిలువెత్తు
నడకల వంతెనకు నిదర్శనం
నిజం ప్రకృతి పుట్టుకల నీటి ధార!
మతోన్మాద వాదులారా
ఇప్పుడు కొత్తగా ఒరగ బెట్టింది ఏముంది!
కాలానికి, కత్తుల గుత్తులు... సిరా చుక్కలు...
తుపాకీ తూటల
మళ్ళీ, ఒక వెనకాటి అడుగే కాదా
మారణహోమం!

ఢిల్లీ కోట మీది హిట్లర్ వారస మానస పుత్రులారా
వేయిపడగల హిందూ సర్వ సామ్రాజ్య తలల
విషకూట కుట్రకు లారా
గోధ్రాగాయాల చీమునెత్తురు
ఇంకనూ కారుతూనే ఉంది

శవాలు లెక్కల ఓట్ల జాబితాను
చూసుకుంటూనే ఉన్నవి
ఇప్పుడు భారత్ వంతా! మరుభూమి!

ఇదీ ప్రశ్నించే కాలం మీది నుంచి
తిరుగుబడ్డ గాలుల మీద ప్రయాణిస్తున్న
విప్లవాల కాలమది

కవులు నిరసన నిప్పుల వానలై కురుస్తున్నారు
ప్రశ్న ఎప్పుడూ అగ్ని పునీతంగానే ఉంది
మట్టి బిడ్డలు... దేశభక్తులు... చీమ దండుల
సైన్యంలోనే ఉన్నారు

ఇదీ
చారిత్రత్మాక నడకల గొంతుల
పిలుపు
సమూహంగా చావడమే!

సమూహంగా పిడికిళ్ల అగ్ని ధారలతో
విజయం సాధించడమే!
రండీ..! చరిత చారిత్రాత్మక ఘటనా ఘటనా

పాత్రలోకి...
పిలుపుల పిడుగుల వర్షంలోకి...
మతోన్మాద వాదం మీద
యుద్ధానికి...
ఇదీ ఇవ్వాళ్టి యుద్ధ పిలుపు
ఇదీ ఇవ్వాళ్టి యుద్ధ కవిత్వం

# గుజరాత్‌లో ఓ మృతుని వాఙ్మూలం

## మంగలేష్ దర్బార్

తెలుగు - ఆర్. శశికళ

ఇదివరకే నేను
కాస్త కాస్త చస్తూండేవాడిని
కొంచెం చావు
కొంచెం బతుకు
చావు బతుకుల బాల్యం నాది
జీవించాలంటే
లత తెగని వెతుకులాట
బతుకు నాది

అయితే నేనిప్పుడు
శాశ్వతంగా చావటానికి
తగులబెట్టబడ్డాను

ఇదివరకూ నాకెన్నడూ
మంటల్లో మాడిన ఫలితం
ఎలాంటిదో నన్న ఆలోచనలేదు

చేనేత మగ్గంపై పోగులు తీశాను
బట్టలకు రంగులద్దాను
ఎన్నెన్నో మరమ్మత్తు పనుల్లో నేనే
మార్కెట్ స్క్వేర్‌ను అలకరించా
చెక్కల ముక్కలతో
రంగుల వస్తువులు చేశా
నృత్యంలో ఉపయోగించే కర్రలను చేశాను

పిల్లల కోసం అల్యూమినియమ్ టైర్లతో
బుల్లి బొమ్మ సైకిల్లు తయారు చేశాను
కానీ అందుకు బదులుగా
ఓ చెప్పుల జత; ఓ లుంగీ మాత్రం నావే
పగలు నా లుంగీ

రాత్రి నా భార్యకు కూడా దుప్పటవుతుంది

నన్ను కాపాడాలని అడ్డొచ్చిన
నా భార్యను అగ్నికి ఆహుతి చేశారు
పసివాళ్ళయి నా బిడ్డలనూ...
నేను అచేతనంగా మిగిలిపోయాను

ఆ తర్వాతే నేనూ...
నా చేతుల్లోని శక్తియుక్తులేమయ్యాయో?
నా జీవితానికి పెద్ద లక్ష్యం లేదు
నన్ను చంపిన తీరుకు మాత్రం
లక్ష్యమున్నట్టుంది...

'నీవెవరు?' నన్ను అడిగారు
నేను రంగులద్దేవాన్ని
వృత్తి పనివాన్ని
ఓ కళాకారున్ని
పనివాన్నని, వారి శత్రువు కానని
చెప్పలేకపోయాను

బుల్లి సైకిళ్ళ చక్రాలు
మరమ్మత్తు చేస్తున్నాను
మోదుతూన్న రాతిపై నుండి
చక్రాల నుండి ఎగురుతున్న నిప్పురవ్వలు
నా అంతరంగంలోకి దూసుకెళ్తున్నాయి

నా చివరి ప్రార్థన కోసం
చేతులు చాపాను
ప్రార్థనలకు సమాధానం దొరుకుతుందా?

ఇప్పుడిక నేను చచ్చిపోయాక
మానవత్వం మరణించాక
మీకంటే ఎక్కువ స్పందన
నిజాయితీ నాకు దొరికాక
ఈ పాడు లోకంలోకి రానన్నందుకు
నన్ను దహించకండి

నా అస్తిత్వం
మరణించిన మానవత్వం
మట్టి కలసిన అనామకత్వం

మీరింకా ఏదో వెతుకుతున్నారు
కాస్త ఆశ్చర్యం మరింత భయంతో
నాలో మీకెవరు కన్పిస్తున్నారు?

ఒక పరిచయమైన ముఖమా?

లేక స్నేహితుడా?
నిన్ను నీవ్ వెతుక్కుంటున్నావా?

లేదంటే
నాలాగా రూపుదిద్దు
కొంటున్న మరో
మనిషిని
గమనిస్తున్నావా?

# దువా!

## గీతాంజలి

నువ్వొస్తున్నావని తెల్సింది
పదేళ్ళక్రితం నువ్వు నా దగ్గర్కి
ఎందుకొచ్చావో గుర్తుకు వచ్చింది
గల్లీ గల్లీ పాత గాయాల జ్ఞాపకాలతో
తల్లడిల్లిపోయింది

నువ్వొస్తున్నావని తెల్సిన
మరుక్షణమే... నా పెరట్లోని
మల్లెపూవు వాడిపోయింది
మా మస్జిద్లమీది కబూతర్ల
గుండెలాగిపోయాయి
కమ్మని మా రంజాన్ ఖీర్
మాకు గొంతు దిగనే లేదు!

నువ్వొస్తున్నావని తెల్సింది!
మా అంగాంగాలు మళ్ళీ
బురఖాల్లోకి
సిగ్గుతో, భయంతో చితికిపోయాయి!
రాతియుగం నాటి ఇనుప కచ్చడాల కోసం
మా కళ్ళూ... చేతులు వెతికాయి...

నువ్వొస్తున్నావని తెల్సింది!
పదేళ్ళక్రితం
ఈ దేశంలో హిందువుగా మాత్రమే
బతకాలి... అన్నావుగా...
నువ్వన్నట్లే మా మొహల్లా
నిశ్శబ్దమై పోయింది

ఆ నిశ్శబ్దం... మా భద్రతకేమీ
చిహ్నం కాదు!

అలాగని
ఆ నిశ్శబ్దం మా లొంగుబాటు కాదు

ఆ నిశ్శబ్దం... నిశ్శబ్దమూ కాదు!
నువ్వు తరిమేసిన కబూతర్ తిరిగొచ్చి మళ్ళీ
మా మస్జిద్ల మీది
గుటూర్ గుటూర్ శబ్దమైయ్యింది
మా గొంతుల్లోని నమాజుకు
షెహనయీ అయ్యింది!

నువ్వొస్తున్నావని తెల్సింది...
మా మానాల్లో నువ్వు గుచ్చిన
త్రిశూలం ఇంకా సలుపుతూనే ఉంది
ముస్లిం పుట్టక ముందే శవమైపోవాలన్న
నీ మరణ శాసనపు కర్కశ కరవాలానికి
నువ్వు గుచ్చి కాల్చిన నా గర్భస్థ పిండపు
హాహాకారం... ఈ నిశ్శబ్దాన్ని
శబ్దిస్తున్నట్లే ఉంది!

నువ్వు ఛిద్రం చేసిన మా బచ్చేదానీలు
కొత్త శిశువుల్ని... హుస్సేన్ - అక్బర్లను
నూర్జహాన్ - బిల్కిస్లను కంటూనే ఉన్నాయి.
నువ్వు నరికేసిన మా రొమ్ములు
కొత్త శిశువుల పాల ఏడ్పుల దిశగా
పారుతూనే ఉన్నాయి

నువ్వొస్తున్నావని తెల్సింది
వుస్తున్నావు కదా...
నీకొక విషయం చెప్పాలి
పదేళ్ళ క్రితం... మీరు హిందువులనే
కని తీరాలని, మా బచ్చే దానిలో
బలవంతంగా చిమ్మిన నీ హిందూత్వపు
వీర్యం...

ఇప్పుడు పదేళ్ళ బిడ్డై... రెహమాన్గై
అమ్జీదై...
నిన్నటి రంజాన్లో
నువ్వు ధ్వంసం చేసిన
మస్జిద్ శకలాల మధ్య
మోకాళ్ళ మీద వినమ్రుడై

నీలాంటి వాళ్ళని కూడా...
దయతో చూడమని
మాఫ్ చేయమని
నీ అసహనాన్ని
ఎదుర్కొనే శక్తినిమ్మని
దువా చేస్తున్నాడు!

నీ భద్రత కోసం...

మా మొహల్లాల భద్రత కోసం
ఫాతెహా ఇస్తానంటున్నాడు

# ప్రేమ చిరునామా

## శిఖా ఆకాశ్

1

జననంలోనే
మరణం పుట్టుక మొదలైంది
ఎన్నెన్ని ప్రయాణాలానంతరమో
ఒకే ఒక్క మృత్యువు

ఇన్నాళ్లూ నీ గమనమేమిటో
నీ స్వరూపమేమిటో
అసలు నువ్వెవరో
నీ మరణం మాట్లాడుతుంది
మరణం తర్వాత కూడా
ఎవడైతే బతుకుతాడో...
వాడు కదా!
అసలు మానవుడు

మృత్యువు
సామూహిక గానమైన మనిషి కదా
సదా బాలకుడు
జగచ్చక్షువు

2

మనుషుల్ని ప్రేమించడమే
అసలైన విప్లవమౌతుందన్న
ఎరుక గల్గిన వారెవరైనా
ప్రేమగల్గిన మనుషుల
చిరునామా అవుతారు
ప్రజా ఉద్యమాల కలనేతలో
పెనవేతలో
కలల సాకారమైన ఆచరణ
మృత్యువంటని
తామరాకు మీద నీటిబిందువోలె
పాదరస సింధువోలె
జ్ఞాపకమై వెంటాడతారు

కొన్ని ఖాళీలు
ఖాళీల్లా కన్పిస్తాయి గానీ...
శూన్యమనుకొంటాం గానీ...
ఒకానొక రసాయనిక చర్య ఏదో
అందులో దాగుందని
అది అంతా కాదు
ఆరంభమేనని
రుజువు పరచడమే
విప్లవ మానవుల
మృత్యువు

3

ఎవరు ఎవర్నైనా
ఆరేసుకోడానికో
దండెం కావాలి
ఎవర్ని ఎవరైనా
చూసుకోడానికో
అద్దం కావాలి

నిన్ను నీవు
చేరుకోవడానికి
అక్షరాలు కూడా దండెమౌతాయి

నిన్ను నీవు
గుర్తుపట్టడానికి
మనుషులు కూడా
అద్దమౌతారు

4

జ్ఞానవంతుల
దుఃఖదీపం
నిత్యం పరిమళిస్తుంది
త్యాగధనుల
దివ్యతేజం
సతతం సత్యమై జ్వలిస్తుంది
(కామ్రేడ్ చలసాని ప్రసాద్‌కు అరుణారుణ జోహార్లు)

# పావురం..

## కెక్యూబ్‌వర్మ

కొన్ని సాయంత్రాలు ముఖంపై
నెత్తురు చిమ్మి ఊపిరిని బందీ చేస్తాయి

ఎక్కడో బంధింపబడి ఊరుకాని చోట
గుండెల్లో తూటా దింపుతాడు వాడు

నువ్ అలా వాడి పిరికితనానికి
నవ్వుతూ గడ్డిపోచనలా విసిరేస్తావ్

నీ నెత్తురంటిన పచ్చని నేల
సాక్ష్యంగా ఓ గడ్డి పూవును పూస్తుంది

నువ్వొక పావురంగా మారి అమ్మ
ఒడిలో చేరుతావు

నీ కరచాలనంతో వెచ్చబడ్డ
మాగుండె నిప్పుల కొలిమవుతుంది

నీ చివరి చీకటి గానం కోట్ల గొంతుకలలో
నినాదమై విముక్తి గీతమవుతుంది...

(ఇటీవల బూటకపు ఎదురుకాల్పులలో అమరుడైన శబరి ఏరియా కార్యదర్శి కామ్రేడ్ నగేష్ స్మృతిలో)

# ఈ పువ్వులు పూశాయి

### పద్మకుమారి

తమ్ముడూ..
మన చేలో
ఈ మల్లె చెట్టు నాటి నాకేం చెప్పావు?

'నేనున్నా లేకున్నా
ఈ చెట్టుకు నీళ్ల పోయి అక్కాయ్
నేను పోసినా
నీవు పోసినా
పూసిన పూలన్నీ నీకే' అంటివి

నిజమే నీకెందుకీ పూలు అనుకున్నా
నీవు మళ్లీ కలిసి మల్లె చెట్టు గురించి అడుగుతావని
నీళ్లుపోస్తూనే ఉన్నా

తమ్ముడూ.. నా తమ్ముడూ
మొక్క నాటిన రోజుల్లో వెళ్లి
పూలు పూసేనాటికి
శవమై వచ్చావా?
నా కన్నీళ్లతోపాటే పూసిన పూలన్నీ నీ సమాధిపై
రాలిపడుతున్నాయి

రేపటికి ఈ పువ్వులు వాడిపోవచ్చు
ఈ పువ్వులు నీవే
ఈ చెట్టూ నీదే

ఇక్కడ నీ జ్ఞాపకాలు వీస్తూనే ఉంటాయి
నీ కలలు పుష్పిస్తూనే ఉంటాయి.

*(తమ్ముడి సమాధి మీద ఆ పక్కనే తను నాటిన మల్లె చెట్టు పూలు తెంపి దోసిలితో పోస్తూ రోదించిన అమరుడు గోపి (పాపినేనిపల్లె, ప్రకాశం జిల్లా) అక్క దు:ఖం ఇది)*

# "ముజఫర్‌నగర్ బాకీ హై" రోహిత్ వేముల ఆత్మ-హత్య చెప్పిన చేదు నిజం: స్మృతిబద్ధ హత్య!

### వరవరరావు

**ఫేస్‌బుక్ ఆగస్ట్ 3:**
లౌకిక ప్రజాస్వామ్యాన్ని
అనవరత జాగురకతతో కనిపెట్టి ఉన్న
కళ్లులేని ధర్మ దేవత
నాలుగు తలల న్యాయం చేయడానికి
వామనస్వామ్యం అమలుచేయడానికీ
తెల్లవార్లూ మేల్కొని తేల్చేసింది

"మ్లేచ్ఛుని కంఠం ఉత్తరించండి
అన్న దొరకకపోతే
తమ్ముణ్ణైనా సరే తలారికి అప్పగించండి"

సుప్రీం తీర్పు చట్టమై క్షణాలపై అమలైపోయింది
మమ్మల్ని శిక్షించడానికి

"ఆనోభద్రా: క్రతువోయాన్తు!"
విద్యాలయాలలో ముస్లింలకు అండగా
దళితులు కదలకుండా కట్టడి
నిర్బంధాలు నిషేధాలు

"గణతంత్రమా అనాగరికమా అన్నందుకు
మాలపిల్లల్ని అనుమానించండి"
సుశీలం జ్ఞానం ఏకత షికాయతు
మంత్రాంగం లేఖాస్త్రాలు

"దేశద్రోహులకు టెర్రరిస్టులకు
తావు ఇచ్చిన రిజర్వేషన్ల నుంచి
మానవ వనరులను కాపాడండి
మనుస్మృతిని అమలు చేయండి"

"అంటరానివాళ్లకు చోటిచ్చిన
విద్యాలయాల నుంచి
వాళ్లను వెలివేస్తున్నాం
నలుగురు కూర్చుని నవ్వే వేళల
నడిచే దారుల మసలే చోటుల
వసతి గృహాల్లో
వాళ్ల ప్రవేశం నిషేధం"

**డిసెంబర్ 18 ఎథనాసియా:**
"ఉపకులపతి గారూ,
విషయం: దళిత సమస్యకు పరిష్కారం
మొదట ఎచ్‌సియులో దళిత విద్యార్థుల ఆత్మగౌరవ ఉద్యమాల పట్ల మీరు కనబర్చే అంకితభావాన్ని ప్రశంసించనీయండి. దళిత పిల్లల్ని కించపరచిన ఎబివిపి అధ్యక్షుణ్ని ప్రశ్నించినందుకు మీరు తీసుకున్న వ్యక్తిగత శ్రద్ధ ఆదర్శ ప్రాయమైనది. క్యాంపస్ స్థలాల నుంచి ఐదుగురు దళిత విద్యార్థులు సాంఘిక బహిష్కరణకు గురయ్యారు. అమెరికా అధ్యక్ష అభ్యర్థి రోనాల్డ్ ట్రంప్ కూడా మీ కమిట్‌మెంట్ ముందు నాకు లిల్లీపుట్‌లా కనిపిస్తున్నాడు. మౌలికత లేని మీ నిబద్ధతకు నేను కొన్ని సూచనలు ఇవ్వడానికి కుతూహల పడుతున్నాను.

"రాజ్యాంగాధిపతి చెప్పాడు గనుక తప్పడం లేదుగాని
విద్యాలయాలలో ప్రవేశంతో పాటే
మాకు ఇంత విషం ఇవ్వండి
10 మిల్లీగ్రాముల కాలకూట విషం చాలు
వాళ్లు అంబేద్కర్‌ను చదవాలనుకున్నప్పుడు
ప్రతి దళిత విద్యార్థి గదికీ
మీ సహచరుడు చీఫ్ వార్డెన్‌తో
ఒక మంచి పశువుల పలుగు తాడు వంటి
ఉరితాళ్లు పంపించండి"

కేంద్ర విశ్వవిద్యాయాలలో దళిత, మైనారిటీలకు
కారుణ్య మరణం ప్రసాదిస్తున్న
మీవంటి కులపతుల ఔదార్యం
క్యాంపస్ శ్మశాన శాంతిలో విశ్రాంతి తీసుకొనుగాక

**వెలివాడ శిబిరం:**
చంకలో అంబేద్కర్ బొమ్మతో
భుజం మీద బ్యానర్‌తో
ఆ ఐదుగురూ హాస్టల్ ఖాళీ చేశారు

"ఈ దేశ మహానగర
అత్యున్నత విద్యాలయంలో
వెలివేసిన అంటరానివాడలో
మేం ఐదుగురం
మాతో అంబేద్కర్ స్టూడెంట్స్ అసోసియేషన్
నీలం రంగు
ఎర్ర జెండా
ఆకుపచ్చరంగు జెండాల వాళ్లు

వేయిపడగల విషనాలుకల
రాజ్యం బాయ్‌నెట్ల నీడలో
నిద్రలేని పదిహేను చీకటి రాత్రులు

**రోహిత్ వేముల "సూసైడ్ నోట్" 17 జనవరి 2016**
"గుడ్ మార్నింగ్,
మీరీ లేఖ చదివే సమయానికి
నేను ఉండను

నా మీద కోపం తెచ్చుకోకండి
మీలో కొందరు నన్ను చాలా ప్రేమించారు
కంటికి రెప్పలా కాపాడారు
నాకెవరి మీదా ఫిర్యాదు లేదు

నా శరీరానికీ ఆత్మకూ ఏదో ఎడం ఏర్పడుతున్నది
నేను అమానుషుణ్నవుతున్నాను
సమస్యలతో సతమతమవుతున్నాను
నేను ఓ రచయితను కావాలనుకున్నాను
కార్ల్ సాగన్ వలె సైన్స్ రచయితను
చివరికి ఈ రచన

నేను సైన్స్‌ను ప్రేమించాను
నక్షత్రాలను ప్రకృతిని ప్రజల్ని
ప్రజలు చాలా కాలంగా
ప్రకృతి నుంచి దూరం చేయబడ్డారని తెలియక.

మన అనుభూతులు సెకండ్ హ్యాండ్ అయిపోయాయి
మన ప్రేమ నిర్మితమవుతున్నది
మన విశ్వాసాలకు రంగు అంటింది
మన మౌలిక ప్రతిభకు
కృత్రిమ కళ ద్వారా గుర్తింపు వస్తున్నది
గాయపడకుండా ప్రేమించడం కష్టమైపోతున్నది.

మనిషి మిలువ తక్షణ గుర్తింపుకు
తక్షణ అస్తిత్వానికి
సన్నిహిత అవకాశానికి
కుదింపబడుతున్నది

ఒక ఓటుకు
ఒక సంఖ్యకు
ఒక వస్తువుకు
మనిషిని ఒక మనసుగా ఎప్పుడూ చూడలేదు
ఒక నక్షత్ర రజంతో చేసిన జ్వాజ్వల్య కాంతి వలె.

అన్నింట్లో
కార్యక్షేత్రంలో
చదువుల్లో
వీథుల్లో
రాజకీయాల్లో
చావులో
బతుకులో

నేను ఇటువంటి లేఖ
మొదటిసారి రాస్తున్నాను
ఆఖరి లేఖ మొదటిసారి

నేనేమీ చెప్పలేకపోతే
క్షమించండి
ప్రపంచాన్ని అర్థం చేసుకోవడంలో ఎల్లవేళలా
నేను తప్పు కావచ్చు
ప్రేమను బాధను జీవితాన్ని మరణాన్ని
అన్నింటినీ అర్థం చేసుకోవడంలో

తొందరేం లేదు
కాని
నేను ఆగలేకపోయాను

ఒక జీవితాన్ని ప్రారంభించాలన్న తహతహ
కాని ఎల్లవేళలా కొందరికి జీవితమే శాపం
నా పుట్టుకయే
మరణాంతక ప్రమాదం
నా బాల్య ఏకాంతం నుండి
నేనెప్పుడూ బయట పడలేదు
ఏ మెప్పూ పొందని
నా గతం నుంచి
ఈ క్షణంలో నేనేమీ
గాయపడి లేను
విచారంగానూ లేను
ఏ ఆలోచనా లేదు
నా గురించి నాకేమీ పట్టదు
అది చాలా బాధాకరం
అందుకే నేనీ పనిచేస్తున్నాను
అందరు నన్ను పిరికివాడు అనవచ్చు
స్వార్థపరుడు అనవచ్చు
మూర్ఖుడు అనవచ్చు
ఎందుకంటే వెళ్లిపోతున్నాను గనుక
నన్నేమని పిలిచినా నాకేమీ పట్టదు
మరణాంతర కథల మీద
నాకు విశ్వాసం లేదు
దయ్యాలనీ ఆత్మలనీ
నాకేదన్నా విశ్వాసం ఉందంటే
నేను నక్షత్రంలోకి ప్రయాణం చేస్తానని
ఇతర ప్రపంచాల గురించి తెలుసుకుంటానని

ఈ ఉత్తరం చదువుతున్న మీరు
నాకేమన్నా చేయానుకుంటున్నారా
నాకు ఏడు నెల ఫెలోషిప్ రావాలి
ఒక లక్ష డెబ్బై ఐదు వేల రూపాయలు
అవి మా కుటుంబానికి చెందేలా చూడండి
రామ్‌జీకి నలభై వేల రూపాయలు ఇవ్వాలి
అతను ఎప్పుడు అడగడు
కాని దయచేసి అతనికి ఆ డబ్బు ఇవ్వండి
నా అంత్యక్రియలు నిశ్శబ్దంగానూ నిశ్చలంగానూ జరగనివ్వండి
నేను అట్లా కనిపించి వెళ్లిపోయినట్లుగా ప్రవర్తించండి
నా కోసం కన్నీళ్లు పెట్టకండి
నేను బతికున్నప్పటి కన్నా
మరణంలో ఆనందంగా ఉన్నానని తెలుసుకోండి

**..."నీడల నుంచి నక్షత్రాల దాకా**

ఉమ అన్నా
నీ గదిని ఇందుకు వాడుకున్నందుకు క్షమించు
ఎఎస్ఎ కుటుంబమా
మిమ్ములను నిరాశపరచినందుకు బాధగా ఉన్నది
మీరు నన్ను చాలా ప్రేమించారు
మీ అందరికీ భవిష్యత్తులో చాలా మంచి జరగాలని
కోరుకుంటున్నాను
ఆఖరిసారి, జై భీమ్

**కొన్ని లాంఛనాలు రాయడం మరచిపోయాను**

నన్ను నేను చంపుకునే ఈ చర్యకు
ఎవరూ బాధ్యులు కారు
నన్నీ చర్యకు పూనుకొమ్మని
నన్ను ఎవరూ తమ చర్యల ద్వారా మాటల ద్వారా రెచ్చగొట్టలేదు
ఇది నా నిర్ణయం
నేను మాత్రమే దీనికి బాధ్యుణ్ని
ఇందు కోసం నా స్నేహితులను గాని
నా శత్రువులను గాని
నేను పోయాక ఇబ్బంది పెట్టకండి"



# యూ టర్న్

## రమా సరస్వతి

అక్కా... సొహైల్ని కొట్టారు. సీరియస్గా ఉన్నాడు.. వేళకాని వేళ మా తమ్ముడి దగ్గరనుంచి వచ్చిన ఫోన్లోని మొదటి మాట.

ఎందుకు? ఎవరు? భయం, గాబరా కలగలసిన గొంతుతో ఇవతలనుంచి నేను.

శాస్త్రి అంకుల్ పిల్లలు అంటున్నారు.. కానీ అంకుల్ వాళ్ల మేనల్లుడేమోనని మా ఫ్రెండ్స్ డౌట్.. తమ్ముడి సమాధానం.

కొట్టుకునే వరకు వెళ్లాయా గొడవలు.. అదే గాబరాతో నేను.

ఏమో... అక్కా.. నాకూ పెద్దగా వివరాలేమీ తెలియట్లేదు.. . ఉదయ్ చెప్పాడు.. అన్నాడు.

ఫోన్ డిస్కనెక్ట్ చేశా.

నిజమే వాడికీ వివరాలు తెలిసే చాన్స్ తక్కువే. ఇండియాలో ఉన్న ఫ్రెండ్ టచ్లో ఉంటే తప్ప. వాడు, నేను మా ఊరొదిలి దాదాపు పది పన్నెండేళ్లవుతోంది. ముందు చదువు కోసం హైదరాబాద్.. తర్వాత పెళ్లితో నేను యూరప్, ఉద్యోగంతో వాడు అమెరికా! యూరప్ అంటే గుర్తొచ్చింది.. సొహైల్ యూరప్ రావడానికి అన్ని ప్రయత్నాలు చేసుకున్నాడట. ఎంబీఏ చేశాడు అని మా తమ్ముడే చెప్పాడు. కానీ వీసా రిజెక్ట్ అయిందట. బహుశా పారిస్ ఇన్సిడెంటే కారణం కావచ్చేమో అనుకున్నాం!

కట్ చేస్తే సొహైల్ గురించి మళ్లీ ఇప్పుడే వినడం! మేం మా సొంతూరు నిజామాబాద్ వదిలిపెట్టేప్పటిదాకా.. మాకు తెలిసినంత వరకు శాస్త్రి అంకుల్, ఖాన్ అంకుల్ వాళ్ల మధ్య గొడవలేం లేవు. ఇన్ఫాక్ట్ మంచి ఫ్రెండ్స్. వాళ్ల ఫ్రెండ్షిప్కి నేను అడ్మైరర్ని కూడా. ఈ రాత్రి మా తమ్ముడి ఫోన్కాల్ నా కంటి మీద కునుకును ఎలాగూ దూరం చేసింది కాబట్టి శాస్త్రి అంకుల్, ఖాన్ అంకుల్ స్నేహాన్ని మీతో పంచుకుంటా.. ఆరకంగా ఆ గోల్డెన్ ఏజ్ని ఇంకోసారి తలచుకునే అవకాశం నాకు దొరుకుతుంది.

నైంటీస్ నుంచి మొదలయ్యే జ్ఞాపకం ఇది...

మా కాలనీలో ఇల్లు కట్టుకుని కొత్తగా వచ్చారు శాస్త్రి అంకుల్ వాళ్లు. ఆ గృహప్రవేశం ఫంక్షన్లోనే మా కాలనీవాసులకు ఖాన్ అంకుల్, ఆయన కుటుంబంతో పరిచయం అయింది. శాస్త్రి అంకుల్, ఖాన్ అంకుల్ పెళ్లికాక ముందు నుంచీ ఫ్రెండ్స్ అని శాస్త్రి అంకుల్ వాళ్ల అమ్మాయి చెప్పింది ఒకసారి నాతో. తను, నేను ఒకే ఏజ్ గ్రూప్ వాళ్లం. చదివే స్కూళ్లు వేరయినా తొందరగానే ఫ్రెండ్స్ అయ్యాం. నిజానికి శాస్త్రి అంకుల్ అమ్మాయి సరస్వతితో నేను ఫ్రెండ్షిప్ పెంచుకోవడానికి రీజన్ వాళ్ల నాన్న, ఖాన్ అంకుల్కి మధ్య ఉన్న స్నేహమే. మీకు ఆశ్చర్యంగా ఉండొచ్చు... నాకూ ఆశ్చర్యంగానే ఉండేది పదకొండు, పన్నెండేళ్ల ఆ వయసప్పుడు... ఒక బ్రాహ్మిన్, ఒక ముస్లిం మధ్య ఫ్రెండ్షిప్ ఎలా కుదురుతుంది. పైగా ఇటు శాస్త్రి అంకుల్... ఇటు ఖాన్ అంకుల్... ఇద్దరివీ ఆర్థడాక్స్ ఫ్యామిలీసే. అయినా... మూడోమనిషి కుళ్లుకునేంత స్నేహం ఉండేది ఆ రెండు కుటుంబాల మధ్య. నాకు బాగా గుర్తు.. శాస్త్రి అంకుల్ వాళ్లింట్లో తద్దినాలైతే ఖాన్ అంకుల్ వచ్చేదాకా శాస్త్రి అంకుల్ భోజనం చేసేవాడు కాదు. బ్రాహ్మల బంతికి ఎదురుగా శాస్త్రి అంకుల్, ఖాన్ అంకులు పక్కపక్కనే కూర్చొని భోజనం చేసేవారు. మరీ విడ్డూరం అని శాస్త్రి అంకుల్ వాళ్ల బంధువులు ముక్కున వేలేసుకున్నా, చెవులు కొరుక్కున్నా ఆ కుటుంబం ఏనాడూ పట్టించుకోలేదు. ఖాన్ అంకుల్ ఇంట్లో అయ్యే ఈద్కి ఈ కుటుంబం వెళ్లాల్సిందే. వాళ్ల కోసం కూరగాయల భోజనం చేయించేవారట సరస్వతే చెప్పింది ఒకసారి. తర్వాత తర్వాత సరస్వతి తమ్ముళ్లు ఖాన్ అంకుల్ వాళ్ల అబ్బాయిలతో నాన్వెజ్ కూడా తినడం అలవాటు చేసుకున్నారట. ఈవెన్ బీఫ్ కూడా. ఈద్ వచ్చిందంటే ఖాన్ అంకుల్ వాళ్లు మాకూ బిర్యాని, ఖీర్ పంపేవాళ్లు. మా కాలనీలో వినాయక చవితి నవరాత్రులకు ఖాన్ అంకుల్ తన పదమూడు మంది పిల్లలతో సహా అటెండ్ అయ్యేవారు. శాస్త్రి అంకుల్, ఖాన్ అంకుల్ ఇద్దరూ కలిసి హిందీ సినిమాలు బాగా చూసేవారు. శాస్త్రి అంకుల్ ఆల్ టైమ్ ఫేవరేట్ యాక్ట్రస్ వహీదా, ఖాన్ అంకుల్ ఆల్టైమ్ ఫేవరేట్ హేమామాలిని. ఇలాంటివి విన్నప్పుడు నాకు చిత్రంగా అనిపించేది. ఈ బ్రాహ్మణాయన పనిచేసేది రెవెన్యూ డిపార్ట్మెంట్లో.. ఆ ముస్లిం ఆయన పనిచేసేది హెల్త్ డిపార్ట్మెంట్లో.

నైంటీస్ ఎండింగ్లో అనుకుంటా... ఖాన్ అంకుల్ రిటైరయ్యారు. ఆ రోజు నుంచి శాస్త్రి అంకుల్ స్కూటర్ నడపడం మానేశారు. రోజూ ఉదయం ఎనిమిదింటికే శాస్త్రి అంకుల్ వాళ్లింటికి వచ్చి తొమ్మిదన్నరకు ఇద్దరూ టిఫిన్ చేసి బయలుదేరే వారు. శాస్త్రి అంకుల్ని ఆఫీస్లో దింపేసి తను ఇంటికి వెళ్లేవారు ఖాన్ అంకుల్. సాయంకాలం కలెక్టరేట్కి వెళ్లి అంకుల్ని పికప్ చేసుకొని వాళ్లింటికి తీసుకెళ్లేవాడు ఖాన్ అంకుల్. రాత్రి ఎనిమిదింటి వరకూ ఉండి అక్కడే డిన్నర్ చేసి అంకుల్ని మళ్లీ ఇంట్లో దింపేసేవాడు. శాస్త్రి అంకుల్ రిటైర్ అయ్యేవరకు ఈ షెడ్యూల్ ఛేంజ్ లేదట. శాస్త్రి అంకుల్ సర్వీస్లో ఉన్నప్పుడే ఇంకో ఇల్లు కట్టాడు. ఆ పని మొత్తం ఖాన్ అంకులే చూసుకున్నాడు. శాస్త్రి అంకుల్కి వాళ్ల అన్నదమ్ములతో ఆస్తి తగాదాలు వచ్చి ఒంటరైతే తోడుంది ఖాన్ అంకులే. సరస్వతి ఇంటర్కాస్ట్ మ్యారేజ్ చేసుకుంటే శాస్త్రి అంకుల్ కోపంతో ఇంటికి రానివ్వని రెండేళ్లు ఖాన్ అంకుల్ ఇల్లే ఆమెకు

పుట్టిల్లు అయింది. తొలిచూలు పురుడు కూడా పర్వీన్ ఆంటీయే పోసింది. నాకు తెలిసినంత వరకు శాస్త్రి అంకుల్కి ఖాన్ అంకుల్ సొంత తోబుట్టువు కన్నా ఎక్కువ. ఆ రుణం శాస్త్రి అంకుల్ ఎలా తీర్చుకున్నాడో నాకు బాగా తెలుసు.. ఎందుకంటే ఆ ఇన్సిడెంట్కి నేను ప్రత్యక్షసాక్షిని. ఆ ఫ్రెండ్షిప్ని ఆరాధించే స్థాయి నుంచి ఓ మెట్టు ఎక్కువ చేసిన సంఘటన..

2003 సంవత్సరం.. రంజాన్ మాసం...

ఆ యేడు ఎందుకనో.. శాస్త్రి అంకుల్ కూడా రంజాన్ ఉపవాసం ఉన్నాడు. రోజా సాయంకాలం ఖాన్ అంకుల్ నమాజ్ చదివే మస్జిద్కి వెళ్లేవాడు శాస్త్రి అంకుల్. నమాజ్ అయిపోగానే ఖాన్ అంకుల్ని తీసుకొని ఇంటికొచ్చి ఇద్దరూ కలిసి భోంచేసేవారు. ఎప్పటిలాగే ఆ రోజా సాయంకాలం మస్జిద్కు వెళ్లాడు శాస్త్రి అంకుల్. ఇంకో నాలుగు రోజుల్లో రంజాన్ పండుగ. ఇద్దరూ కలిసి ముందు రోజే షాపింగ్ చేసుకున్నారు. ఇంకా నమాజ్ పూర్తిచేసుకొని బయటకు రాలేదు ఖాన్ అంకుల్. ఆ రోజు కాస్త ముందుగానే బయలుదేరి మస్జిద్ ఎదురుగా ఉన్న టైలర్షాప్లో కూర్చున్నాడు. టైలర్తో ఏదో మాట్లాడుతుంటే మస్జిద్లోంచి కలకలం వినిపించింది ఆయనకు. హడావిడిగా బయటకు వస్తున్నారు కొందరు... శాస్త్రి అంకుల్కి ఏమీ అర్థం కాలేదు. క్యా హువా భాయ్.. అని అడిగాడు బయటకు వచ్చిన ఓ వ్యక్తిని. యూసుఫ్ఖాన్ సాబ్ బేహోష్ హోగయే చెప్పాడు ఆయన. అంతే క్షణం కూడా ఆలస్యం చేయకుండా చెప్పులు వదిలేసి లోపలికి పరిగెత్తాడు శాస్త్రి అంకుల్. ఖాన్ అంకుల్ చుట్టూ జనాలున్నారు. తోసుకుంటూ ముందుకెళ్లాడు శాస్త్రి అంకుల్. నమాజ్చేస్తున్న భంగిమలోనే నేలకొరిగి ఉన్నాడు ఖాన్ అంకుల్. ముల్లా... ఖాన్ అంకుల్ని వెల్లకిలా పడుకోబెట్టి మంత్రించిన నీటిని ఖాన్ అంకుల్ మొహం మీద చల్లుతున్నాడు. అయినా ఆయనలో కదలిక లేదు. శాస్త్రి అంకుల్ మనసు కీడు శంకించినట్టుంది. డాక్టర్ దగ్గరకు తీసుకెళ్దాం అంటున్నాడు ముల్లాతో. కబురు పెట్టాం అన్నాడు ఆయన. ఇంతలోకి పక్కసందులో ఉన్న ఆరెంపి డాక్టర్ని వెంటబెట్టుకొని వచ్చినట్టున్నారు ఎవరో.. ఆయన ఖాన్ అంకుల్ నాడీ చూసి ప్చ్.. నాడీ ఆడ్డం లేదు అని పెదవి విరిచాడు. ఇంక ఆగలేకపోయాడు శాస్త్రి అంకుల్.. అరే ఖాన్.. భాయ్.. దేఖో.. మై శాస్త్రి ఆగయా.. ఉఠో ఘర్ జాయేంగే చలో అంటూ తట్టి లేపుతున్నాడు. అయినా ఆయనలో కదలిక లేదు. అందరూ కలిసి డాక్టర్ దగ్గరకు తీసుకెళ్లారు. చనిపోయి ఇరవై నిమిషాలైందని చెప్పాడు డాక్టర్. అక్కడే కుప్పకూలిపోయాడు శాస్త్రి అంకుల్. ఆ రోజు ఖాన్ అంకుల్ శవాన్ని మోసి జంధ్యం తీసిన శాస్త్రి అంకుల్ మళ్లీ జంధ్య వేసుకోలేదని.. సంధ్యావందనం చేయలేదని.. అసలు దేవుడిని కొలవటమే మానేశాడని మా నానమ్మ చెప్తుండేది. తర్వాత అసలు ఆయన మనిషే కాలేదని మా కాలనీవాళ్లు అంటుంటారు. అలాంటి కుటుంబాల మధ్య గొడవలెందుకు వచ్చాయో? ఎవరు చెప్పగలరు? సరస్వతి.. లేదంటే ఖాన్ అంకుల్ సంతానం. నాతో ఎవరూ టచ్లో లేరు. ఒకటిరెండు సార్లు మాట్లాడిన సొహైల్ పరిస్థితి అది.

ఫేస్బుక్ చూస్తే...

సరస్వతి దొరుకుతుందేమో... చిన్న ఆశ... బలిచక్రవర్తిని పాతాళంలోకి నొక్కుతున్న వామనుడి అంతగా పెరిగింది.

టైమ్ చూసుకుంటే ఉదయం మూడు. వెళ్లి ల్యాప్టాప్ ఓపెన్ చేశా. ఫేస్బుక్ లాగిన్ అయ్యా. సరస్వతి కొట్టి చూశా.. ఇరవై పేర్లు వచ్చాయి. తనను చూడక చాన్నాళ్లయింది. ఇప్పుడు ఎలా ఉందో? వీళ్లలో ఎవరు? ఎలా పోల్చుకోవడం..సరస్వతి కోసం సెర్చ్ చేస్తూనే నా వాల్ మీదున్న పోస్టును చూడ్డం మొదలుపెట్టా...

ఇంతలోకే తమ్ముడి నుంచి మళ్లీ ఫోన్...

ఏమందిరా.. ఏమన్నా తెలిసిందా? ఆత్రం ఆగలేని గొంతుతో నేను.

అక్కా... నిజామాబాద్ అంతా హిందూ ముస్లిం గొడవలట. సొహైల్ని కొట్టింది శాస్త్రి అంకుల్ మేనల్లుడు వాసు అండ్ గ్యాంగ్ అట. అందులో శాస్త్రి అంకుల్ పిల్లలు కూడా ఉన్నారంటున్నారు.

రీజన్ ఏంట్రా.. అరిచినంత పనిచేశా.

ఆమిర్ఖాన్ ఏదో అవార్డ్ ఫంక్షన్లో ..దేశంలో ఇంటాలరెన్స్ చూసి నా భార్య దేశం వదిలి వెళ్లిపోవాలనుంది అని అన్నాడని... అది ఎఫ్బి, వాట్సప్లో వైరల్ అయింది కదా.. దాని మీదే నిజామాబాద్లో హిందువులు, ముస్లింలు కొట్టుకున్నారట. ఆమిర్ఖాన్ పోస్టర్లు అతికించి వాటి మీద హిందువులు యూరినల్స్ చేశారట. అది చూసి ముస్లిం పిల్లలు వీళ్లను కొట్టారట. ఏదో హోటల్లో ముస్లింలు బీఫ్ తింటున్నారని హిందువులు వెళ్లి ముస్లింలను అటాక్ చేశారట. ఆ గొడవ పెద్దదై... ఇదిగో సొహైల్ను వీళ్లు కొట్టేదాకా వచ్చింది చెప్పాడు బాధగా.

దారుణం.. శాస్త్రి అంకుల్ పిల్లలు సొహైల్ వాళ్లతో కలిసి బీఫ్ తిన్న రోజుల్ని ఎలా మరిచిపోయారు?

ఆ ఫ్రెండ్షిప్ శాస్త్రి అంకుల్, ఖాన్ అంకుల్ దగ్గరే ఆగిపోయిందేమో అనిపించింది. నాకు బాగా గుర్తుంది.. మేం చిన్నపిల్లలమే అప్పుడు. అయోధ్యలో రామాలయం కోసం ఇంటికో ఇటుక కావాలనే క్యాంపెయిన్ మొదలయింది... మా కాలనీకీ వచ్చారు.. ఆ రోజు సండే.. మధ్యాహ్నం పన్నెండయ్యుంటుంది టైమ్.. నేను, సరస్వతి, వాళ్ల తమ్ముళ్లు అందరం కలిసి వాళ్లింట్లో క్యారమ్స్ ఆడుకుంటున్నాం. ఖాన్ అంకుల్ అక్కడే ఉన్నారు. వాళ్లు వచ్చారు. ఖాన్ అంకుల్ని చూసి మరింత రెచ్చిపోతూ శాస్త్రిగారు.. మీ ఇంటి నుంచి వంద ఇటుకలు కావాలి.. అంటూ ఖాన్ అంకుల్ని ఇబ్బంది పెట్టాలని చూశారు. శాస్త్రి అంకుల్ అలాగే తర్వాత రండి అంటూ వాళ్లను పంపేసి ఖాన్ అంకుల్కి సారీ చెప్పారు. నీ తప్పేముంది శాస్త్రి నువ్వెందుకు సారీ చెప్పడం అని శాస్త్రి అంకుల్ భుజం తట్టి ఖాన్ అంకుల్ వెళ్లిపోయారు. మళ్లీ తెల్లవారి మామూలుగానే ఉన్నారు. నాకు తెలిసి మళ్లీ ఆ టాపిక్ వాళ్లిద్దరి మధ్య వచ్చి ఉండదు. వచ్చి ఉంటే ఆ స్నేహం అన్నేళ్లు సాగేది కాదు. శాస్త్రి అంకుల్ మేనల్లుడున్నాడు వాసుకి హెల్త్ డిపార్ట్మెంట్లో ఉద్యోగం ఇప్పించింది ఖాన్ అంకులేనట. అప్పట్లో నాకు సరస్వతి చెప్పింది. వాడికి సరస్వతినిచ్చి పెళ్లి చేయాలనేది శాస్త్రి అంకుల్ ఆలోచన. అందుకే

# బొట్టు కుక్క

ఎండ్లూరి మానస

టింగ్ టింగ్! టింగ్ టింగ్! !

అసహనంగా తలుపు తెరిచాను. అమ్మా నాన్నలకి ప్రతి రోజూ ఏవో ఒక పోస్టులు,కొరియర్లు వస్తూనే ఉంటాయి. వాళ్ళని కలవడానికి కూడా పద్దాక ఎవరోకరు వస్తూనే ఉంటారు. అదీ సరిపోక, అపార్ట్మెంట్స్ లో మొదటిల్లు మాదే కాబట్టి అడ్రెస్సులు అడిగే వాళ్ళూ, పుస్తకాలూ వంట సామగ్రీ అమ్మేవాళ్ళూ, వివాహ పత్రికలు చూపించి అడుక్కునే వాళ్ళూ, కరపత్రాలు ఇచ్చేవాళ్ళూ, వీళ్ళూ వాళ్ళూ అందరూ గంటకో సారి మా ఇంటి కాలింగ్ బెల్ మోగిస్తూనే ఉంటారు! పోనీ తలుపు తెరిచే పెడదామా అంటే వచ్చే పోయే వాళ్ళందరూ మా ఇంట్లో ఏదో దొంగ పెళ్లి జరుగుతున్నట్టు అనుమానంగా, నిస్సిగ్గుగా, అనాగరికంగా గుమ్మంలోంచి పడగ్గది దాకా తొంగి చూస్తూ వెళుతుంటారు! వాళ్లు చూసే చూపులకి మాకే ఏదో తప్పు చేస్తున్నామన్న సందేహమొచ్చేస్తుంటుంది అప్పుడప్పుడు!

ఇంతకీ ఇప్పుడు కాలింగ్ బెల్ కొట్టింది మా వాచ్ మాన్ అప్పారావు, ఇస్త్రీ బట్టలు ఇవ్వడానికి! 'కాలింగ్ బెల్ వద్దు, తలుపు తట్టు చాలు' అంటే వినడు. కావాలని టకీ టకీ మని రెండు సార్లు కొట్టి విసిగిస్తుంటాడు డాక్టర్ అంకుల్ లాగ! అప్పుడు గుర్తొచ్చింది! వేసవి సెలవులు కదా! చాలా మంది లేరు అపార్ట్మెంట్స్ లో.జనం తక్కువే ఉంటారు కాబట్టి కాస్త స్వేచ్ఛగా ఉండొచ్చని తలుపు బార్లా తెరిచాను.ఎన్నాళ్ళకి గాలీ వెలుతురూ వస్తోందో ఇంట్లోకి! చాలా రోజుల తరువాత పట్టపగలు ట్యూబ్ లైట్ ఆపేసాను!

నేనూ నాన్నా టీవీ చూస్తున్నాం.బయటంతా రణగొణ శబ్దాలు...రెండిళ్ళవతల కొత్త వాళ్లు దిగుతున్నారు. నిన్న కొంత సామాను తెచ్చారు. ఇవ్వాళ మిగతా సామాను దింపుతున్నట్టున్నారు.

కొద్దిసేపటికి ఆ ధ్వనుల్లోంచి ఓ చిన్న పాప ఏడుపు వినిపించింది. పిల్లలందరూ సెలవులకి వెళ్ళిపోయారు కాబట్టి ఇక్కడ కాదనుకున్నాను. మళ్ళీ అదే ఏడుపు. నాన్ననడిగితే ఏం లేదంటాడు. అమ్మ లోపలెక్కడో ఉంది. ఎంతసేపటికీ ఏడుపాగట్లేదు! వెంటనే బయటకెళ్ళి చూస్తే రెండు మూడేళ్ళ పాప! కొత్త పాప! కళ్ళు నలుపుకుంటూ ఏడుస్తూ ఉంది.అప్పారావు కోసం చూశాను.లేడు. పాప దగ్గరికెళ్ళాను.పిల్ల నల్ల బంగారం! నేరేడు పండు రంగులో నిగనిగలాడిపోతుంది.బొద్దుగా ముద్దుగా బత్తాయిల్లాంటి బుగ్గలు, చక్రకేళీల్లాంటి జబ్బలూ, చిట్.....ట్టి మూతి, నుదుటి మీంచి కళ్ళలోకి జారిపడే మొక్కజొన్న పీచు లాంటి మెత్తని వెంట్రుకలు, నడి నెత్తి మీద చిచ్చుబుడ్డీ వెలుగుల్లాంటి పిలక! ఆ పాప వెనుకే ఓ బుజ్జి తెల్లని బొచ్చు కుక్క పిల్ల. దాని కళ్ళ మధ్యన ఎర్రని కుంకుమ బొట్టు. ఆ బొట్టు దాని మతాన్నైతే చెప్పింది కాని కులాన్ని చెప్పలేదు. పాపకీ బొట్టుంది. ఆ బొట్టు కూడా మతాన్నే చెప్పింది.

పాప ముందు మోకాళ్ళ మీద కూర్చుని కళ్ళు తుడిచి మాట్లాడించే ప్రయత్నం చేశాను. ఏడుపు తప్ప ఒక్క మాటా రావడం లేదు. కుక్క పిల్ల నా పాదాల దగ్గరగా వచ్చి ముక్కుతో పరీక్షిస్తోంది! కొంపదీసి కరవదు కదా! ఇంట్లో ఎప్పుడూ కుక్కల్ని పెంచనందు వల్ల నాక్కాస్త బెరుగ్గా ఉంది. కొన్ని నిమిషాలకి అలవాటు పడ్డాను. ఎంత చక్కగా ఆడుకుంటుందో! పాప మాత్రం ఏమీ మాట్లాడడం లేదు.బైటికి తీస్కెళ్ళి వాళ్ల వాళ్లు ఎవరైనా ఉన్నారేమో చూద్దామా అంటే ముట్టుకోనివ్వట్లేదు. వెక్కి వెక్కి ఏడుస్తోంది. లోపలికి తీస్కొచ్చి మంచినీళ్ళు తాగించాను. ఆ ఏడుపుకి అమ్మ హాల్లోకొచ్చింది. అమ్మా నాన్నా ఏవేవో మాట్లాడించే ప్రయత్నం చేస్తున్నారు. కానీ ఫలించట్లేదు! నేను మాత్రం కుక్కపిల్లతోనే ఆడుతున్నా. గుండెల మీద పసిపాపలా కొద్దిసేపు, భుజాలమీద గుమ్మడికాయలా కొద్దిసేపు, చంకలో కోడిపిల్లలా కొద్దిసేపు వళ్ళో చంటి బిడ్డలా కొద్దిసేపు మారిపోతోంది కుక్కపిల్ల.

పాపని ఏవేవో అడుగుతున్నారు అమ్మా నాన్న...'నీ పేరేంటి పాపా?' , 'ఎక్కడుంటారు?' 'స్కూల్ కెళుతున్నావా?' , 'మీ అమ్మా నాన్నా పేర్లేంటి?' ఊహు ఏవీ చెప్పట్లేదు. ఏడుపూ ఆపట్లేదు!

కుక్కపిల్లని నా భుజానేసుకుని "ఎవరమ్మాయివి రా తల్లీ?"

---

ఖాన్ అంకుల్కి చెప్పి ఉద్యోగం ఇప్పించాడు. ఆ జాబ్కి లంచం అడిగితే శాస్త్రి అంకుల్కి చెప్పకుండా ఖాన్ అంకులే ఇచ్చాడట. ఈ విషయం ఎప్పటికో శాస్త్రి అంకుల్కి తెలిసింది. ఈ రోజు ఆ విషయాన్నెలా మరిచిపోగలిగారు?

మనసంతా గందరగోళంగా ఉంది.. చూపు మాత్రం ల్యాప్టాప్ స్క్రీన్ మీద స్క్రోల్ అవుతూనే ఉంది. ఒక చోట మనసూ చూపుని అనుసరించినట్టుంది ఓ పోస్ట్ దగ్గర ఆగిపోయింది. ఆమిర్ ఖాన్ అవార్డ్ ఫంక్షన్లో అన్న మాటల వీడియో అది.

ప్లే నొక్కా....

షాక్.. తను అన్నది వేరు... ప్రచారం అవుతున్నది వేరు.

మనిషి రోజురోజుకి పరివర్తనం చెందుతాడు.. కానీ మనం దిగజారిపోతున్నాం. 1984లో సిక్కుల మీద జరిగింది తప్పే.. ఇప్పుడు జరుగుతున్నది తప్పే.. అప్పుడు జరిగింది తప్పే అనుకున్నప్పుడు... రియలైజ్ అయినప్పుడు అలాంటి సంఘటనలు పునరావృతం కావద్దు కదా.. అవుతున్నాయ్.. ఆమిర్ ఖాన్ ఇంకా ఏదో మాట్లాడుతూనే ఉన్నాడు..

కాలం శాస్త్రి అంకుల్, ఖాన్ అంకుల్ తరం నుంచి యూటర్న్ తీసుకుంటున్నట్టనిపిస్తోంది.



అని అడిగాను. ఠక్కున ఏడుపాపి "కమ్మోలమ్మాయిని" అంది. కుక్కపిల్ల భుజమ్మీంచి వళ్ళో పడింది. నాన్నా అమ్మా నేనూ అవాక్కయ్యాం! ఎందుకో కుక్కపిల్ల నా కళ్ళలోకి చూస్తోంది. నేను దాని బొట్టు వైపు చూశాను. మతమే కాదు ఇప్పుడు కులం కూడా తెలిసింది. కమ్మోరమ్మాయి వెంట వచ్చిన కమ్మోరి కుక్క పిల్ల. దాని జాతి కుక్కల్ని అది గుర్తుపడుతుందేమో! పాపం మనుషులే ఇంకా వారి వారి జాతుల్ని ఇప్పటికీ చెప్తే గానీ గుర్తుపట్టలేక పోతున్నారు! ! కులాన్ని ఉగ్గు గిన్నెతో పట్టించి, పాలసీసాలో పోసి, కాస్త ఎదిగాక కాంప్లాన్ లో కలిపిచ్చి కులాంగ సౌష్టవాన్ని పెంచి రేపటి సమాజానికి కులపౌరులుగా తీర్చిదిద్దుతున్న నైనం చూసి ఆశ్చర్యపోయాను. పేరు, ఊరు, తల్లి దండ్రుల పేర్లు, వారి చదువులూ ఉద్యోగాలూ ఏవి అడిగినా పనికి రాని ప్రశ్నలు గానే మిగిలిపోయాయి! మూడేళ్ళ వయసుకే 'గుర్తింపు' అంటే కులం అని నేర్చుకున్న పసిపాపకి నా కుల నిర్మూలనా పోరాటం ఏం అర్ధమవుతుంది? ఇప్పుడిప్పుడే మాటలు నేర్చుకుంటున్న ఈ పసి చిలుకను కూడా నేను ఎదుర్కోవాలన్నది విషాద వాస్తవం! !

"అక్కా! వాతలే"

ఏడ్చి ఏడ్చి గొంతెండిపోయినట్టుంది! మరికొన్ని నీళ్ళు తాగించాను. ఆ షాక్ లోంచి తేరుకోడానికి నేను కూడా కొన్ని తాగి పాపను ఎత్తుకున్నాను. కొంచెం బెదురు తగ్గింది దానికి.

"మీ ఇంట్లో బొమ్మల్లీవా??" అడిగింది గదంతా చూపుల్తో ఒక చుట్టు చుట్టి.

కొంతమంది మా ఇల్లు చూసి పుస్తకాలు అద్దెకిచ్చే లైబ్రరీ యేమో అనుకునేవాళ్లు.అలాంటి ఇళ్ళు అంతరించి పోయాక 'పాత పుస్తకాలు అమ్ముతారా?' అని అడిగే అమాయకులూ లేకపోలేదు! ఈ పాపకి కూడా అలాంటి అనుమానమే కలిగినట్టుంది!

"నువ్వున్నావుగా చిన్ని బొమ్మవి!" అన్నాను దాని బుగ్గలు పిండుతూ.

"నువ్వు బెద్ద బొమ్మవా?" చెవిలో బెల్లం పాకం పోస్తున్నంత తియ్యగా ఉన్నాయి పాప మాటలు.

కొంచెంసేపు పాపా కుక్కా నేనూ పార్కింగ్‌లో ఆడుకున్నాం. సాధారణంగా నాకు కుక్కలంటే చచ్చే భయం. కుక్కపిల్లలంటే కూడా! ! కానీ ఇలాంటి చిట్టి కుక్కపిల్లతో ఇంతగా ఆడడం ఇదే మొదటిసారి. యేసయ్య ఒళ్ళో గొర్రె పిల్లలా ఉంది కుక్కపిల్ల. క్రిస్మస్ ట్రీ మీద పడిన మంచులా దాని తెల్లని బొచ్చు. సవ్వడి లేకుండా చర్చి గంటల్లా లయబద్దంగా ఊగే దాని బుల్లి తోకా, 'అక్కా! ఆడుకుందాం దా' అన్నట్టు దాని చూపులు...అబ్బ! భలే ఉంది బుజ్జి కుక్క. దాని మొహానికున్న బొట్టు చూస్తుంటే మాత్రం మొన్న సంక్రాంతికి వచ్చిన గంగిరెద్దు గుర్తొచ్చింది. బొట్టు పెట్టుకున్న వాటిల్లో నేను చూసిన రెండో జంతువు ఇది!

ఇంతలో అమ్మ లోపలికి పిలిచి కుక్కపిల్లకి కొన్ని బిస్కెట్లు, పాపకి బొబ్బట్లు పెట్టింది. ఎవరో గుమ్మంలోంచి తొంగి చూస్తున్నట్టు అనిపించి చూశాను.ఆ కళ్ళూ, చూపులు పరిచయం లేనివి! గొంతుకి వజ్రాల నల్లపూసలు, పదివేళ్ళలో ఆరింటికి నాజూకైన బంగారం ప్లాటినం ఉంగరాలు, ఖరీదైన జీన్స్, కుర్తీ, మొహంలో ఆధునికత, మరింకేదో కళ.

"సంజా!" ఆమె చేతులు చాచింది.

"మమ్మీ...!" నా చేతుల్లోంచి దూకి వెళ్ళింది పాప, దాని వెంటే కుక్కపిల్ల.

పిల్లకీ, కుక్కపిల్లకీ ఏం తెలుసు?! నుదురు చూసి వర్ణాన్ని అంచనా వేసే విద్య! చూడగానే ఏదో అసంతృప్తిని నవ్వుతో నొక్కి పెట్టి

"మా పాపేనండి.వెతుక్కుంటున్నాం ఇందాకటి నుంచీ" అంది.

ఆమె చూపులకంటే కుక్కపిల్ల చూపులే చల్లగా ఉన్నాయి...

"ఓ అలాగా! అదే... పేరడిగితే కూడా చెప్పలేదు. నేనే బయటకు వస్తున్నాను. ఎవరి పాపా ఏంటో అని.ఇంతలో మీరే వచ్చారు."

"సంజనా అండి!" వెనుదిరిగింది.

ఆ కుక్క పిల్ల నా చుట్టూ ఆమె చుట్టూ తిరుగుతోంది.

"హే పప్పీ! దా! ఏంటి తింటున్నావ్?" దాని నోట్లో ఆమె చూపుడు వేలు పెట్టి నానిపోయిన బిస్కెట్టు ని బయటకు తీసి విదిల్చింది.

"ఇది చాలా కాస్ట్లీ డాగ్ అండి.స్పెషల్ ఫుడ్ ఉంటుంది.అదే పెడతాం." పళ్ళు బయటకు రాకుండా నవ్వింది.

ఆ కుక్కపిల్లకి నేను నచ్చానేమో! వదలడం లేదు.

"నేనిక్కడే ఆదుకుంతా..." నన్నే చూస్తూ అంటోంది సంజా.

"తప్పు! ఇంటికెళ్ళాలి! దా పప్పీ"

నా కాళ్ళ చుట్టూ తిరుగుతున్న పప్పీని ఎత్తుకున్నాను.

"వద్దండి... వచ్చేస్తుంది. దింపేయండి!"

ఓ వెర్రి నవ్వు నవ్వి పప్పీ ని వదిలేసి లోపలికెళుతూ చూశాను... కుల బుజ్జాయిని ఓ భుజాన, ఖరీదైన జాతి కుక్క పిల్లని మరో భుజాన వేసుకుని వెళుతోంది నేటి ఆధునిక మహిళ. మౌనంగా వెళ్లి నా గదిలో పడుకున్నాను. బుట్ట బొమ్మలాంటి పసి పాప కన్నా బొచ్చుతో ఉన్న బొట్టు కుక్కే ఎక్కువగా మెదులుతోంది గుండెల్లో.



# తలా పిడికెడు

బమ్మిడి జగదీశ్వరరావు

దేశంలోని రాష్ట్రంలోని అన్ని ఖజానాల ముందు...

అదేనండీ ట్రెజరీ ఆఫీసుల ముందు జనం బారులు తీరారు. ఏరులై వచ్చి నిలబడ్డారు.

'మనకు తెలియని యిదేం ఉద్యమమబ్బా...' అవి అన్ని రాష్ట్రాల పోలీసులూ కేంద్ర మిలటరీ బలగాలు ముక్కున వేలేసుకొని ముచ్చెమటలు పట్టాయి.

లాఠీలు తూటాలు జైళ్ళూ టియర్ గ్యాసులూ ముళ్ళ కంచెలూ ఓ మూలకి రాలేదు. ముప్పై కోట్ల మంది ఉప్పెనై వచ్చారు.

'ముందు వాళ్ళ డిమాండ్లేంటో కనుక్కోండి...' ఎక్కడికక్కడ మంత్రులు అధికారులకు ఆదేశాలిచ్చారు.

హింసకు పాల్పడకుండా శాంతియుతంగా సంతోషంగా ఉన్న ప్రజల్ని చూస్తే అసలు సంగతి అధికారులకి అంతు పట్టలేదు.

"ఏడాదిదంతా కలిపి ఒక్కసారిచ్చినా - నెల నెలా ఇచ్చినా మీ ఇష్టం...' అన్నాడు మొదలున ఉన్న ముసలాయన. చెల్లింపులు చేసే క్యాషియర్‌కు ఏమీ అర్థం కాలేదు. ఆ అయోమయంలో 'ఎందుకూ?' అనకుండా అలవాటుగా 'ఎంత?' అన్నాడు.

'ఏడాది మొత్తం ఒక్కసారే ఇచ్చేదుంటే ఎనభై ఎనిమిదిన్నరవేలు ఇవ్వండి...'

'నెలదయితే ఏడు వేల మూడు వందల డబ్బై ఎనిమిది రూపాయలివ్వండి...'

ఒక్కర్నడిగితే ఇద్దరేసి సమాధానాలు చెప్పారు.

'అదేంటి?' అడిగాడు అక్కడకొచ్చిన అధికారి.

'చదువుకున్నోళ్ళు చెపితేనే అర్థమవుతుంది, నువ్వు చెప్పరా...' ఓ కుర్రాణ్ని ముందుకు తోసారు.

'నేను చెప్పడం కాదు, ఆలే చెప్పారు. సెంట్రల్ స్టాటికల్ ఆర్గనైజేషన్ లెక్కలే అలగున్నాయి...' అన్నాడు కుర్రాడు.

'ఆఁ...' అని ఆలోచనగా ఆగి - అధికారులంతా అర్థం చేసుకొని 'ఓహో... తలసరి ఆదాయమా?' అన్నారు, అర్థం చేసుకున్నారు.

'అది తలా ఒక్కొక్కరి ఆదాయం... తలా ఒక్కొక్కరికిచ్చేస్తే తీసుకొని వెళ్ళిపోతాం...' పడుచమ్మాయి గడుసుగా అంది.

'... అంటే... అంబానీలదయినా టాటా బిర్లాలదయినా అందరికీ అదే ఆదాయం...' అధికారి చెప్పబోతే 'ఆ లెక్కలన్నీ మాకెందుకండీ... మా లెక్క మాకు తేల్చండి...' అన్నారు జనం, ఒకే మాటగా!

'లక్షల మందికి కోట్ల ఆదాయాలున్నాయి... సారీ... అర్థమయినట్టు చెపుతాను... ముఖేస్ అంబానీ ఆదాయం ఏడాదికి ఎనభై ఎనిమిదన్నర వేలు, నెలకి ఏడు వేల మూడు వందల...' అధికార్లు చెప్పబోతే 'మీకూ మాకు తేడా లేదు, మా ఆదాయం మాకిచ్చేస్తే చాలు...' జనం మాట.

'లెక్క అది కాదు... వాళ్ళ ఆదాయం మీ పేరున ఉంది... తలా ఇంతని...' అధికార్లు పోటీపడి అర్థం చేయించబోయారు.

'మా పేరున ఉన్న ఆదాయం మాదే గదండీ...' జనంది ఒకే మాట.

'అంటే... కోటీశ్వరుల ఆదాయం... తలా ఒక్కక్కరికీ ఇస్తే - ఇస్తే కాదు... పంచితే - పంచితే కాదు... అంటే... దేశం మొత్తం ఆదాయం అన్నమాట... అందరిదీ అన్నమాట...' అధికారులకు చదివిన చదువులు అక్కరకు రాలేదు.

'మేమూ ఈ దేశంలో పౌరులమే. అందరిదీ ఆదాయమైనప్పుడు - తలా ఇంతని లెక్కేసినప్పుడు - మా ఆదాయం మాకు ఇవ్వాలిగదా?! ' ముప్పై కోట్ల మందిదీ ఒకటే మాట... 'దరిద్రులు...' సహనం కోల్పోయాడో అధికారి.

'అవును సార్... దరిద్రుల ఆదాయం దరిద్రులకి ఇచ్చేయండి సార్...' ముసలామె రెండు చేతులూ జోడించి దండమెట్టింది.

'ముసలీ ముతకా... పిల్లా పాపా... అప్పుడే పుట్టిన బిడ్డవరకు... అందరి ఆదాయమే గద సార్... మీరు చెప్పిందే గదా...' నడీడామె కొంగు నడుముకు దోపింది.

'తలా ఎంత పడిందో... అంతే ఇవ్వండి సార్... అంతకు ఒక్క రూపాయి ఎక్కువ ఇవ్వొద్దు... ఆఁ...' ముసలాడి గొంతులో ఖరాఖండితనం.

'లేదంటే... ఇది దేశం మొత్తం ఆదాయం కాదు, కొద్ది మంది ఆదాయం మాత్రమే అని చెప్పండి సార్...' అన్నాడో కుర్రాడు.

'ఔను... ఔను...' సామూహిక స్వరం.

'ఔను... ఇది కొందరి ఆదాయమే...' బరితెగింపుగా ఏం చేస్తారో చేసుకోండి అన్నట్టు తేల్చేసాడో కుర్ర అధికారి.

దాంతో అనుభవమున్న అధికారులంతా ఒక్కసారిగా కుర్ర అధికారి మీద దాడి చేసినట్టు అరుస్తూ పడిపోయారు. కొందరు తిట్టిపోస్తే మరి కొందరు 'స్థూల జాతీయ ఉత్పత్తిని కూడా ఇన్‌క్లూడ్ చేసారు...' అని గుర్తు చేసారు.

'మాటి మాటికో మాటొద్దు. ఏదో ఒక్కమాట మీదే ఉండండి...' ముసలాయన విసుక్కున్నాడు, తనతో ఉన్న జనాన్ని ఆగమని సైగ చేసాడు చేతుల్తో -

ఒక్క క్షణం నిశ్శబ్దం...

మరుక్షణం ప్రళయంలా జనశబ్దం!

'ప్రభుత్వ ప్రకటన ఏదయితే అదే చెప్పండి...' మధ్యలో మీ అధికార్ల మధ్య వర్తిత్వం అక్కర లేదన్నట్టు అరిచి చెప్పారు జనం...

ప్రభుత్వ ప్రకటనను మళ్ళీ చదివి వినిపించారు! ఔను మరి,

డిమాండ్ అలాంటిది.

తలసరి ఆదాయమే!

తలా ఒక్కరి ఆదాయమే!

"మా ఆదాయం మాకివ్వండి..." సామూహిక స్వరం.

ప్రభుత్వం నడిపే మంత్రులూ ప్రభుత్వాల్ని నడిపే మేధావులూ సాయంగా సెలబ్రిటీలూ మేం ముందంటూ స్వచ్ఛంద సేవా సంస్థలూ అందరూ రోడ్ల మీదకొచ్చారు. నచ్చజెప్పడానికి చర్చలు జరిపారు. తలసరి ఆదాయానికి తలా ఒకర్థం ఇవ్వలేక పోయారు. జనం చెప్పే అర్థానికి వేరే అర్థం ఇవ్వలేక పోయారు. 'చట్టం ముందు అందరూ సమానులేనా?' సామూహిక ప్రశ్నకు 'సమానమే!' సమాధానం రాక తప్పలేదు.

ఇంటలిజెన్సు వాళ్ళు 'దీని వెనుక... కుట్రుంది... కుతంత్రముంది' అని నిరూపించాలని తలక్రిందులయారు, ఆరా దొరకలేదు. ఆరోపణ నిలబడలేదు.

ప్రభుత్వ మేధావులు సమస్యా సాగరాన్ని మధించి అమృతం తీసినట్టు లాజిక్కును తీసారు.

'తలసరి ఆదాయంతో పాటు తలసరి అప్పు కూడా ఉంది తెలుసునా? ఆదాయంతో పాటు అప్పూ తీసుకుంటారా?'

జనం నివ్వెరపోలేదు. ఉత్సాహంగా ముందు కొచ్చారు. 'ఆదాయం ఉన్నప్పుడు అప్పు ఎందుకుండదు?' అని ఎదురు ప్రశ్న వేసారు.

చిలికిన అమృతంలో విషపు చుక్క పడిపోయినట్టు మేధావుల ముఖాలు వివర్ణమయిపోయాయి.

'ఆదాయమూ మాదే... అప్పూ మాదే...'

'ఇల్లన్నాక ఆదాయమూ ఉంటాది... అప్పూ ఉంటాది...'

'దేశమన్నాక ఆదాయమూ ఉంటాది... అప్పూ ఉంటాది...'

'ఆదాయం ఇస్తేనే అప్పూ ఇస్తారు... ఆదాయం ఇవ్వకుండా అప్పెలాగ ఇస్తారు?'

'ఆదాయం లెక్కలొచ్చినప్పుడు... ఆ లెక్కల ప్రకారం ఆదాయం ఇవ్వాల... ఇవ్వాల్సింది ఇవ్వకుండా అప్పుల గురించి ఆదాయమప్పుడు మాట్లాడుతున్నారంటే మా ఆదాయం మాకివ్వడం ఇష్టం లేనట్టే గదా?'

తలా వొక మాట. తలా వొక దారి. దారులన్నీ కలిసాయి. ఒక్కటే మాట!

'తలా ఆదాయం తలా ఒక్కరికివ్వండి...'

అందరిదీ అదే మాట!

దేశమిప్పుడు... మంత్రులూ - ప్రధాన, ముఖ్యమంత్రులూ - గవర్నరులూ రాష్ట్రపతీ - అందరి చెయ్యీ దాటి పోయింది. పరిస్థితి అదుపూ తప్పిపోయింది. చిలికి చిలికి గాలి వాన అయ్యింది, కాదు... కాదు... వరదయ్యింది. ఉప్పెనయ్యింది.

అధికారం పిచ్చోడి చేతిలో రాయి అన్నారు. ఆ అధికారం ప్రజా ప్రతినిధుల చేతుల్లో లేదు. అధికారుల చేతుల్లో లేదు. ప్రజల చేతుల్లోనే ఉంది.

'ప్రజలకి పిచ్చి పట్టింది...' అధికార గణానిది ఒకటే మాట...

'యథా రాజా తథా ప్రజా...' అని దానికీ జవాబు చెప్పారు.

అత్యవసర పరిస్థితి ప్రభుత్వం విధించినట్టు లేదు. ప్రజలు విధించినట్టు ఉంది.

ప్రజాధిపతులకు ఇళ్ళే జైళ్ళయాయి. కార్యాలయాలే కారాగారాలయ్యాయి. రాజీనామాలు చేసారు. రహస్య ఆలోచనలు చేసారు. అసెంబ్లీలలో అడుగెట్టలేకపోయారు. పార్లమెంట్లో పత్తా లేకుండా పోయారు.

రహస్యం ఎప్పటిలాగే బహిరంగమయింది.

రంగం సిద్ధమయింది.

రణ రంగం...!

'మా తలసరి ఆదాయం మాకివ్వండి!'

ఒక్కటే డిమాండ్! ఒక్కటే నినాదం!

శాంతియుతంగా ముందుకొచ్చిన ప్రజల డిమాండ్ తీర్చకపోతే - శాంతి మార్గం హింసామార్గమయ్యే మార్గమొక్కటే కనిపిస్తోందని నిఘా వర్గాలు తాము సేకరించిన ఆధారాలను ప్రభుత్వం ముందు ఉంచింది.

ఉన్న విషయం చెప్పకపోతే లేని ప్రమాదం తెచ్చుకున్నట్టవుతుందని ఒక నిర్ణయానికి వచ్చింది ప్రభుత్వం. తమ చేతుల్లో ఉన్న మీడియా ద్వారా ఆ విషయం ప్రజలకు విన్నవించుకుంది.

"తలసరి ఆదాయం కోరడం ప్రజల అభీష్టమే అయినా - ఆ ఆదాయం అంతా ప్రభుత్వం దగ్గర లేదు... ఉండదు..."

'మరి ఆ ఆదాయం ఎక్కడ ఉంది?' ప్రజల ప్రశ్న.

'ఎక్కడ ఉంది?' ప్రభుత్వం నోరెళ్ళబెట్టింది.

'ప్రశ్నకు ప్రశ్నే జవాబు కాదు!' కుర్రాళ్ళు ముందుకడుగేసారు.

'... ఎక్కడ ఉంది... అంటే... ప్రపంచంలోనే అతి ఎక్కువ ఆదాయం కలిగిన వాళ్ళలో మన భారతీయులు ఉండడం... ర్యాంకు సాధించడం మనకు గర్వకారణం...' అప్పటికప్పుడు సినిమాతారలు ప్రజాహితం కోరి ప్రయోజిత కార్యక్రమాలు చేపట్టారు. క్రికెటర్లూ కళాకారులూ సంఘ సేవకులూ దేశభక్తులయిపోయి బృందగానం ఎంతో ఆర్తిగా ఆలపించారు.

జనం విన్నారు. తలలాడించారు. 'మా తలసరి ఆదాయం మాకివ్వండి...' పాత పాటే పాడారు.

అవగాహనా సదస్సులూ, రన్‌కెరన్‌లూ చేసారు.

'మా తలసరి ఆదాయం మాకివ్వండి...' రాగం మారలేదు. తాళం తప్పలేదు.

'ఎక్కడుంది ఆదాయం?' ప్రభుత్వం బలప్రదర్శన చేయబోయింది.

'ఎక్కడుంది ఆదాయం?' ప్రజలు బల ప్రదర్శన చేసి చూపించారు, ఒక్క పిలుపుతో -

'మా ఆదాయం మాక్కావాలె...' జన నినాదం!

'ప్రభుత్వం దగ్గర లేదు...'

'మరెక్కడుంది? ప్రభుత్వాన్ని నడిపే మీ దగ్గరా? నడిపించే వాళ్ళ దగ్గరా? వెన్ను దగ్గరా? దన్ను దగ్గరా?'

'..........................'

'తలసరి ఆదాయం సమానమైనప్పుడు.. అందరూ సమానంగా ఉండాలి కదా?'

'..............'

కథ

# భయం, భద్రత?

## సాగర్

ఎగ్జామ్ అయిపోయాయి. అందరం ఎవరి హడావిడిలో వాళ్లం ఉన్నాం. ఇంటికెళ్ళటానికి తొందరపడుతున్నాం.

నేను, రఘు బస్టాప్ వైపు నడుస్తున్నాం. రోజూ మేం ఇలా కలిసి వెళుతుంటాం.

'రఘూ.. ఎగ్జామ్స్ ఎలా రాశావ్' అని అడిగాను.

తను బాగానే రాసి ఉంటాడని నాకు తెలుసు. చాలా తెలివైనవాడు. చదువులోనేగాక కరెంట్ ఇష్యూస్‌లో కూడా ఇంట్రెస్టు ఉంటుంది. మేమిట్లా కలిసి నడుస్తున్నప్పుడు ఎన్నో చెబుతుంటాడు. అందుకే నాకు తనంటే చాలా ఇష్టం.

'అంత బాగా రాయలేదు. నిన్న మా అన్నయ్య ఆర్ఎస్ఎస్ వాళ్ల మీటింగ్ ఉందని పిల్చుకెళ్లాడు. ఇంటర్నల్ ఎగ్జామ్సే కదా రమ్మన్నాడు. దాంతో సరిగా ప్రిపేర్ కాలేదు...' చెప్పాడు రఘు.

రఘు వాళ్లన్నయ్య ఆర్ఎస్ఎస్ అని నాకు తెలియదు. మా మాటల్లో కూడా ఎన్నడూ రాలేదు. రోజూ న్యూస్ పేపర్స్‌లో, ఛానల్స్‌లో ఆర్.ఎస్.ఎస్. గురించి చూస్తుంటాను.

అందుకని ఆసక్తిగా 'అక్కడ ఏం చెప్పారు?' అని అడిగా.

'రోజూ చాలా మంది ముస్లింలు మన దేశానికి వస్తున్నారట. అట్ల వచ్చి ఇక్కడే ఉండిపోయి బాంబులు పెట్టి జనాలను చంపేస్తున్నారట. అందుకే ముస్లింలను జాగ్రత్తగా గమనించాలని చెప్పారు. ఎవరైనా అనుమానంగా అనిపిస్తే ఆర్.ఎస్.ఎస్. వాళ్లకు చెబితే వాళ్ళ సంగతి చూస్తామన్నారు. అవసరమైతే మమ్మల్నే చూసుకోమన్నారు, తరువాత ఏమి జరిగినా వాళ్లు వస్తామన్నారు'

నేను షాకయ్యాను. రఘు ఇలాంటివి మాట్లాడతాడని ఊహించలేదు. నేను వెంటనే రియాక్ట్ కాలేకపోయాను. ఒక నిమిషం తర్వాత...' మీరు ఇలా చేయడం తప్పు కదా?' అన్నాను.

దానికి రఘు సీరియస్‌గా రియాక్టయ్యాడు.

'ముస్లింలనే కాదు.. ఎవరైనా సరే హిందూ మతం గురించి తప్పుగా మాట్లాడితే కొట్టి చంపమన్నారు..'

మామూలుగా అయితే రఘు ఇట్లా మాట్లాడంగ నేను చూడలేదు.

'మీరు ఇలా చేస్తే వాళ్ళు పోలీసులకు కంప్లైట్ ఇవ్వరా?' అని అడిగాను.

'గవర్నమెంట్ ఆర్.ఎస్.ఎస్. చేతిలో ఉంది. ఇంకెవరు ఏం చేస్తారు' నిర్లక్ష్యంగా అన్నాడు.

నాకు తన మాటలు నచ్చలేదు. ఎవరో ఏదో చేశారని ముస్లింలందరినీ ఇలా అనడం మంచిదేనా? అనే డౌట్ వచ్చింది.

నేను ఆలోచించుకుంటూ ఏమీ అనకపోయే సరికి రఘు 'ఆర్.ఎస్.ఎస్., బిజెపి వాళ్లే కాదు. పేపర్స్, న్యూస్ ఛానల్స్‌లో కూడా ముస్లింలు చేస్తున్న పనులను చూపిస్తున్నారు కదా?. వాళ్ళు అబద్దాలు చెబుతారా?' అన్నాడు.

దీంతో నాకు కొంచెం కోపం వచ్చింది. వీడేంది ఇట్ల తయారయ్యాడని భయం కలిగింది. అయితే ఇంకేమైనా మాట్లాడితే గొడవ అవుతుందేమోనని మౌనంగా ఉండిపోయాను. తన మాటలు నాకు నచ్చలేదనే సంగతి రఘు గుర్తించినట్లుంది. ఇంకా కొనసాగించలేదు. మా ఇద్దరి మధ్య నిశబ్ద వాతావరణం ఏర్పడింది.

మౌనంగానే బస్టాప్‌కి చేరుకున్నాం.

బస్సులో కూర్చున్నాక రఘు మళ్లీ మొదలు పెట్టాడు. తను మామూలుగా అంతే. ఏదైనా మొదలు పెట్టాడంటే చాలా చెబుతుంటాడు. నాకు తను చెప్పేవి వినడం ఇష్టం. కానీ ఇప్పుడు మాట్లాడుతున్నవి నచ్చడం లేదు.

రఘు మాటలు వింటుంటే వీడు ముస్లింలందరిని తీవ్రవాదులనుకుంటున్నాడా? అని భయం కలిగింది. వీడి మాటలు వింటుంటే మా ఊర్లో ఈ మధ్య జరిగింది గుర్తొచ్చింది.

మా ఊరు పేరుకే పల్లెటూరు కాని చాలా కంపెనీలు ఉన్నాయి. పత్తి, పొగాకు, ఆయిల్ కంపెనీల్లో పని చేయడానికి ఉత్తరాంధ్ర, ఒరిస్సాల నుంచి కూలీలు వస్తారు. అలా వచ్చిన వారు మా ఊరి జనాభాలో సగానికి పైగా ఉంటారు. అంత మంది బయటివాళ్లు ఉన్నా మా ఊళ్లో ఏ గొడవలూ జరగవు. అందరూ ప్రశాంతంగా ఉంటారు.

అలా వచ్చిన వారికి ఏదైనా డబ్బు అవసరమైతే ఫైనాన్స్ తీసుకునేవారు. ఫైనాన్స్ వాళ్లు ఆధార్ కార్డు జిరాక్సు తీసుకుని అప్పు ఇచ్చేవారు. నేను సెలవులకి ఊరికి వెళ్లినప్పుడల్లా మా ఫ్రెండ్ నెట్ పాయింట్‌లో కూర్చునేవాడిని.

గత వేసవి సెలవుల్లో ఊరికి వెళ్లినపుడు ఎప్పటిలానే ఉదయం అక్కడికి వెళ్లాను. టీవీలో న్యూస్ చూస్తున్నాను. సెలవులు కావటంతో పిల్లలందరూ వీడియోగేమ్స్ ఆడుకోడానికి వచ్చారు. దీంతో షాపంతా గొడవ గొడవగా ఉంది.

---

"అంటే... తలసరి ఆదాయాన్ని మించి ఆదాయం, సంపద కలిగి ఉన్నారంటే... మేం తలసరి ఆదాయం కూడా లేకుండా ఉన్నామంటే... వాళ్ళ దగ్గర ఉన్న ఆదాయం ఎవరిది?" అని అడిగే లోపలే - "మనదే ..." ఒకడికి ముప్పై కోట్ల మంది గొంతిచ్చారు.

'మనం తలా ఒకరం... మన తలసరి ఆదాయాన్ని తీసుకుందాం... పదండి...'

సంపన్నులు సహా ప్రభుత్వం వజవజ వణుకుతూ వెనకడుగేసింది.

జనం ముందుకడుగేసారు!

అదే భవిష్యత్ చరిత్ర! !



కస్టమర్ రావటంతో మా ఫ్రెండ్ పిల్లలను గొడవ చేయవద్దని చెప్పి అతనికి ఏం కావాలో అడిగాడు. ఇంతలో ఒకతను వచ్చి జిరాక్సు కోసం నిలబడ్డాడు. అతని డ్రస్సు చూడగానే ఆటో డ్రైవర్ అని అర్థమౌతుంది. అతని ముఖం పీక్కుపోయి బాధలో ఉన్నట్టు కనబడింది. ముస్లింలా ఉన్నాడు. అతను ఆధార్ కార్డులిచ్చి ఒక్కొక్కటి ఐదు జిరాక్సులు తీసి ఇవ్వమన్నాడు. అందులో మూడేళ్ళ చిన్నపిల్లాడిది కూడా ఉంది.బయట ఎవరో ముగ్గురు వ్యక్తులుండి ఇతనిని తొందరపెడుతున్నారు. వాళ్ల ఫైనాన్స్ ఇచ్చే వాళ్లేమో అనుకున్నాను.

అందుకని 'ఫైనాన్స్ తీసుకుంటున్నారా?' అని యథాలాపంగా అతడ్ని అడిగాను.

దానికి అతను ఏమి మాట్లాడలేదు. అయితే తనలో తానే బాధపడుతున్నాడని అర్థమైంది.

మా ఫ్రెండ్ జిరాక్స్ కాపీలు తీసి అతనికి ఇచ్చాడు.ఆయన 'ఇవి వాళ్లకు ఇచ్చి వచ్చి డబ్బులు ఇస్తా' అని చెప్పి వాళ్ళ దగ్గరికి వెళ్ళాడు. ఆ ముగ్గురు దేని గురించో ఇతనితో మాట్లాడుతున్నారు. రెండు నిమిషాలు ఉండి వాళ్లు వెళ్లిపోయారు.

ఇతనొచ్చి డబ్బులిస్తుంటే 'అప్పు ఇవ్వడానికి ష్యూరిటీ అడుగుతున్నారా?' అని అని అడిగాను. నాకు అతడి గురించి తెలుసుకోవాలని చాలా ఇదిగా ఉంది. ఆయన ముఖంలోని దయనీయత నన్ను ఊరకే ఉండనివ్వలేదు.

ఈసారి ఆయన లేదన్నట్టు తలూపాడు.

టివిలో మోదీ ఉపన్యాసం వస్తోంది. నేను ఆ వైపు కూడా ఓ చెవి వేసి వింటున్నాను. ఇంకో కస్టమర్ 'ఈయన వచ్చాక రోజా టివిలో కనపడుతున్నాడు. కానీ ఏమి చేస్తున్నాడో అర్థం కావటంలా. రోజుకో దేశం తిరుగుతూ మాటలు మాత్రం భలే చెప్తున్నాడు' అని వెళ్లిపోయాడు.

ఈ మాటలకు ఇంతక ముందు జిరాక్స్‌కు వచ్చిన ముస్లిం ' ఈసాబ్ వస్తే మమ్మల్ని పట్టించుకోడు అనుకున్నాము కాని మమ్మల్ని ఈడ బతకనిచ్చేట్టు కనబడ్డలేదు' అన్నాడు. ఈ మాట నాతో అన్నాడో, తనలో తానుగా అనుకున్నాడో తెలియలేదు.

ఆయన గురించి తెలుసుకోవాలనిపించింది.

'ఏమైంది మీకు?' అని అడిగాను.

'మాది నల్గొండ. అక్కడ గడవక ఈడ బంధువులుంటే సంవత్సరం క్రితం ఆటో నడుపుకుందామని వచ్చినాం. మొన్నటి దాకా బానే ఉంది గాని. వరంగల్ జెయిలు నుంచి నలుగురిని కోర్టుకు తీసకపోతూ మధ్యలో పోలీసులు నల్గొండ దగ్గర కాల్చేశారు కదా. నల్గొండ నుంచి ఇక్కడికి ఎందుకు వచ్చారు? ఆ చనిపోయిన వాళ్లతో సంబంధాలు ఉన్నాయా? అని పరేషాన్ చేస్తున్నారు. వారం వారం ఇంట్లో వాళ్ళందరం పోయి సంతకాలు పెట్టి రావాలంట, ఎప్పుడు పిలిస్తే అప్పుడు పోవాలంట లేదంటే జైలులో పెడతామంటున్నారు.చివరికి ఐదేళ్ళ పిల్లాడిని కూడా స్టేషన్‌కి తెమ్మంటున్నారు. మా ఇంటికి పోలీసులు వచ్చినప్పటి నుంచి చుట్టుపక్కల వాళ్లు మమ్మల్ని చూసి భయపడుతున్నారు. అసలు మాట్లాడటమే లేదు. పోలీసులకు తోడు పేపర్లు, చానళ్ల వాళ్లు కూడా...' అని కంటతడి పెట్టాడు. నేను ఆయనట్లా చూడలేకపోయాను.

రఘు ముస్లింల గురించి మాట్లాడుతోంటే నాకు ఇదంతా గుర్తు వచ్చింది. తన మాటలు వినడం లేదని రఘుకు అర్థమైనట్టుంది.

'ఏం ఆలోచిస్తున్నావు?' అని అడిగాడు.

నేనేమీ చెప్పలేదు. స్టాప్ వచ్చింది.

'వెళదాం పదా' అని రఘు అనడంతో ఇద్దరం దిగాం. తనకు బాయ్ చెప్పి ఇంటికెళ్లాను. కానీ రఘు మాటలే గుర్తుకు వస్తున్నాయి. మా ఊళ్లో ఆ ముస్లిం కంటతడి, అందులోని భయం నన్ను అంతకంటే వెంటాడుతున్నాయి.

వార్తలు చూద్దామని టివి పెట్టాను. దీపావళి నేపథ్యంలో ఎటువంటి అవాంచనీయ సంఘటనలు జరగకుండా నగరంలో కట్టుదిట్టమైన భద్రత ఏర్పాటు చేశామని పోలీసు అధికారి చెబుతున్నాడు. ముఖ్యంగా పాతబస్తీ పరిసర ప్రాంతాల్లో అనుమానితులపై నిఘా పెట్టినట్టు తెలిపాడు. ఆయన మాటలు వింటుంటే ముస్లింలంటే తీవ్రవాదులని నేరుగానే అంటారేమో అనిపించింది. ఛానల్ మార్చాను.



# నేను వాళ్ళను క్షమించగలనా?

బిల్కిస్ బానో

అనువాదం - గీతాంజలి

దాడులు జరిగినప్పుడు నా భర్త నిరుద్యోగి అయినా చిన్న ఇంట్లో సంతోషంగా బతికాం. సాలేహా అనే 3 సంవత్సరాల పాప ఉంది.

నాకు ఐదవ నెల. ఫిబ్రవరి 27, 2002 ఉదయం సబర్మతి ఎక్స్‌ప్రెస్ కాలిపోయింది. మరునాడు మా ఊరి సర్పంచ్ రాలీ తీసాడు. అది హింసాత్మకంగా మారి హిందువులు - మా ముస్లింల ఇళ్ళను కాల్చేయనారంభించారు. అప్పట్నించే గ్రామం నించి బయటకెళ్ళి పోవాలని అనుకున్నాం కానీ గ్రామ నాయకులు మాకేం కాదని చెప్పారు.

కానీ అప్పటికే గుంపులోంచి మా ఇళ్ళవైపు రాళ్ళు కురవడం మొదలైంది. మమ్మల్ని రక్షించుకోవడానికి పరిగెత్తాం. కనీసం చెప్పులు కూడా లేకుండా. గ్రామంలోని ముస్లింలంతా గ్రామ మాజీ సర్పంచు కార్జ కాకా. పోలీస్ సెక్యూరిటి అడిగాం కానీ అది తిరస్కరించబడింది. ఐదు వందల మందికి పైగా ముస్లిం పిల్లలు, స్త్రీలు, ముసలివాళ్ళు, మగవాళ్ళు అక్కడ గుమిగూడారు. మాకు రక్షణ లేనట్లుగా అన్పించింది. మేం పారిపోవాలనుకున్నాం కానీ రోడ్లన్ని అన్ని వైపుల నించీ మూసేసారు. బయటకు వెళ్ళే ప్రధాన భాగాలలో కాలుతున్న కరెంటు తీగలు వదిలేసారు.

28 మధ్యరాత్రి వాళ్ళు పద్ధతి ప్రకారం ఇళ్ళు కాల్చడం మొదలు పెట్టారు. "మిమ్మల్ని చంపేస్తాం, నరికేస్తాం" అంటూ అరవసాగారు. మా మగవాళ్ళు 573 ముస్లిమ్స్ పేర్లు రాస్కుని పోలీస్ స్టేషన్‌కి పరిగెత్తారు. మాకు అత్యవసర రక్షణ అవసరమైనది. కానీ పోలీసులు తిరస్కరించారు. చాలా మంది ముస్లింల అడవుల్లోకి పారిపోయి అక్కడే కొన్ని రోజులు దాక్కుని గడిపారు. 28 తారీఖున ఉదయం 11 నుంచి రాత్రి 8 వరకు నీళ్ళు, ఆహారం లేకుండా మా గ్రామంలో అటూ ఇటూ తిరుగుతూ, దాక్కుంటూ భయంతో గడిపాం. కానీ అదీ ఎంతో సేపు కొనసాగలేదు. ఎక్కడైతే మేం దాక్కునే వాళ్ళమో. ఆ ఇళ్ళకి వెంటనే మీరు ముస్లింలకి ఆసరా ఇస్తే మీ ఇళ్ళ మీద దాడులు చేస్తాము. వెంటనే వాళ్ళని పంపెయ్యండి అని ఫోన్లు వచ్చేవి. మేం బయటకు వచ్చేసే వాళ్ళం. మేం దాక్కున్న ఇంటి యాజమాని ఖర్జా కాకాకి కూడా ఫోన్ వచ్చింది. ఆయన్ని భయపెట్టేసారు. అతను భయపడిపోయి మమ్మల్ని ఇల్లు ఖాళీ చేసి వెళ్ళిపొమ్మన్నాడు.

మా ఇళ్ళు, టెంపోలు కాల్చేసారు. పోలీసులను రక్షణ అడిగితే ఊర్నించి పారిపొమ్మన్నారు. మేం ఊరి వదిలేసి అర్ధరాత్రి మాజీ కాంగ్రెస్ ఎంఎల్ఏ భిజాల్‌భాయి దామోర్స్ ఇల్లు చేర్కున్నాం. అది చున్‌దాది ఊరికి దగ్గర్లో ఉంది. అతనింట్లో లేడు. అతని కొడుకు మాకు కొన్ని నీళ్ళు, తినడానికి చిరుతిళ్ళేవో ఇచ్చాడు. కానీ కొద్ది సేపయ్యాక అతను కూడా మమ్మల్ని వెళ్ళిపొమ్మన్నాడు. అక్కడ్నించి మేం కొఫుర్ గ్రామానికి వెళ్ళాం కానీ అక్కడా అదే పరిస్థితి. ఆ రాత్రంతా మేం ఒక మాస్క్‌లో తలదాచుకున్నాం. ఆ రాత్రి నడిచిన నడకకు నిండు గర్భిణి, మా అక్క కూతురు షమీమ్‌కి పురుటి నొప్పులు మొదలయ్యాయి. అది చాలా కష్టకాలంలా అన్పించింది మాకు. అల్లా దయవలన ఆమెకు మాస్క్‌లోనే నార్మల్ డెలివరీ అయ్యింది.

కేగరీ గ్రామంలో కూడా మత ఘర్షణలున్నాయి. ఆదివాసీలను తోడు తీస్కుని మేం అప్పుడే ప్రసవించిన మా షమీమ్‌తో సహా కుద్రా గ్రామానికి బయలుదేరాం. మొదట మేం ఐదు వందల మంది ముస్లింలం ఉన్నాం. తర్వాత 17 మందిమి మాత్రమే మిగిలాం. షమీమ్ రక్తస్రావంతో నడవలేక పోతోంది. అందరం ఆ కుద్రా గ్రామంలోనే ఉండిపోతే మగవాళ్ళు ఆ స్థలం విడిచి ముందుకు సాగారు. మా అమ్మీ, నా ఇద్దరు చెల్లెళ్ళు, మా మేనమామ, నా ఇద్దరు తమ్ముళ్ళు, మా అత్తయ్య, ఆమె భర్త, మా అత్తయ్య ముగ్గురు చెల్లెళ్ళు మొత్తం 17 మందిమి అక్కడే ఉండిపోయాం. కొంత మంది ఆదివాసీలు మాకు సాయం చేసారు.

అక్కడ రెండు రోజులున్నాం. ఆదివాసీలు షమీమ్ పరిస్థితి చూసి జాలిపడి మాకు కూడా ఆతిథ్యం ఇవ్వడమే కాదు మాకు బట్టలు, ఆహారం కూడా ఇచ్చారు. మేం ముస్లిమ్స్ అని తెలవకుండా మేం ఆదివాసీల బట్టలు వేస్కున్నాం. మేం అక్కడ్నించి ఇష్టం లేకున్నా నిస్సహాయంగా బయలు దేరవల్సి వచ్చింది. ఎందుకంటే... వాళ్ళను కూడా ముస్లిమ్స్‌ని దాచిపెట్టుకున్నారేమోనని చాలా సార్లు అడుగుతూ వచ్చారు. ఉదయం 4 గంటలకు కుద్రా నించి బయలుదేరాం.

ఈ రోజంతా మేం నిత్యం భయంతో ఏడుస్తూనే గడిపాం. భయం మా గుండెల్లో, మనుసుల్లో నిండిపోయి, మమ్మల్ని ఒణికించింది. ఏదీ కూడా ఆలోచించలేని మానసిక స్థితిలోకి వెళ్ళిపోయాం. కేవలం అక్కడ్నించి ఎలా తప్పించుకుపోవాలా అన్న ఆలోచన తప్ప మేం ఇంకో విషయం గురించి మర్చిపోయాం.

17 మందిలో 4గురు పురుషులు, 8 మంది స్త్రీలు మిగతా వాళ్ళంతా పిల్లలు. రెండు రోజుల తర్వాత ఆదివాసీలు మమ్మల్ని చాపర్ వార్డ్ గ్రామం దాకా వచ్చి దింపారు. ఇక్కడ్నించి పానివేలాలో ఉన్న మానాభాయిని కలవాలనుకున్నాం. అక్కడ చేరేక ముందే మేం కొద్ది సేపు ఆదివాసీ ప్రాంతంలో విశ్రాంతి తీస్కున్నాం. అది రెండు ఎత్తైన కొండల నడుమ మధ్యలో సన్నని రోడ్డులో ఉంది. ఆ దారి

వెంట వెళ్తుంటే ఒక మనిషి వచ్చి మా మామయ్యని బాగా కొట్టాడు. ఆయన కిందపడి స్పృహ తప్పిపోయాడు. ఒక గంట తర్వాతే స్పృహ వచ్చింది ఆయనకు. మెల్లగా అక్కడికి చాలా మంది వచ్చారు. వారంతా మా రంధిక్ పూర్ గ్రామానికి చెందిన వారు. చాపర్‌వాడ్ గ్రామస్తులు వీళ్ళకు మా ఆనుపానులు ఇచ్చారు.

"ఇక్కడ ముసల్‌మాన్స్ ఉన్నారు - చంపెయ్యండి - వీళ్ళను నరకండి" అంటూ వాళ్ళు అరవసాగారు.

పానివెలా, చాపర్‌వాడ్ నించి వాళ్ళు మరింత జనాలను కూడగట్టుకొని వచ్చారు. మేమంతా బాగా అలసిపోయాం. నిస్సహాయంగా ఉండిపోయాం. మాకు తిరిగి పోరాడే శక్తి లేదు. పరిగెత్తి దాక్కునే క్షణాల్లో కనీసం ఒక కర్రలాంటి ఆయుధాన్ని తీస్కోవాలి అన్న ఆలోచన కూడా రాలేదు మాకు. అన్ని దిక్కులా పరిగెత్తనారంభించాం అయినా కానీ తప్పించుకోలేక పోయాం. మేం 17 మందిమి వాళ్ళు 25 కంటే ఎక్కువగా ఉన్నారు. వాళ్ళంతా టాటా సుమోలో వచ్చారు.

వాళ్ళు మా అమ్మాయిల దగ్గర్కి వచ్చి అసభ్యంగా మాట్లాడ్తూ వాళ్ళ బట్టలు చింపేసారు. నగ్నంగా చేసి మా అందరి ముందే లైంగిక అత్యాచారం చేసారు. షమీమ్ రెండు రోజుల పసిగుడ్డును చంపేసారు. నా మేనమామను, మా పిన్ని, బాబాయ్‌లను చంపేసారు. వాళ్ళు నా పాపను కూడా చంపేసారు. వాళ్ళు నా పాప సాలెహాను గాల్లోకి విసిరికొట్టారు. ఆ పాప రాయి మీద పడి తల పగిలి చనిపోయింది. నా కళ్ళముందే నా గుండె వక్కలయ్యింది.

చాలా మంది, నన్ను రేప్ చేసాక వాళ్ళలో ఒక వ్యక్తి నా గొంతు మీద కాలుపెట్టి నన్ను కొట్టాడు. కర్రలతో, రాళ్ళతో నన్ను కొట్టారు. నన్ను ఒక చెట్ల పొదల్లో పడేసి వెళ్ళిపోయారు. నేను స్పృహ తప్పాను. నేను చనిపోయాననుకున్నారు. కానీ కొన్ని గంటల తర్వాత నాకు స్పృహ వచ్చింది.

ఆ దుండగులు మాటలతో ఉచ్చరించ లేని పదాలు వాడారు. "గోధ్రాలో మా వాళ్ళను చంపారు... మేం మీ ముస్లింలను చంపేస్తాం ఎవర్నీ వదలం" అంటూ అరిచారు.

నా ముందే వాళ్ళు నా తల్లిని - చెల్లెళ్ళను నా ఇతర 12 మంది బంధువులను చంపేసారు. జంతువులను ఛీరి చంపినట్లుగా వాళ్ళు మమ్మల్ని కోసారు.

28 ఉదయం, నా భర్త, ఇతర కుటుంబ సభ్యులు, బీజేపి లీడర్ ఇంట్లో పెట్టిన మీటింగ్‌కి వెళ్ళారు. అక్కడ రక్షణ కోరారు. అక్కడే నన్ను, నా చెల్లెళ్ళను రేప్ చేసి చంపిన వాళ్ళున్నారు.

మొత్తం 17 మందిలో ముగ్గురమే ఉన్నాం. ఇద్దరు చిన్న పిల్లలు - నేను. ఈ చిన్న పిల్లలేలా బతికారో నాకంతు పట్టలేదు. చనిపోయిన వాళ్ళల్లో ఒక్క హిందువు కూడా లేదు. లైంగిక అత్యాచారం చేసేటప్పుడు, చంపేటప్పుడు చాలా అసభ్యమైన చేష్టలు - మాటలు మాట్లాడారు. నేను గర్భవతిని వదిలెయ్యండి అని కూడా నేను చెప్పలేకపోయినాను. ఎందుకంటే నా మెడ మీద వాళ్ళ కాళ్ళు - నోటి మీద చేతులు ఉండేవి. నోరు పెగలనివ్వకుండా. హిందువుల్లో అన్ని కులాల వాళ్ళు ఉన్నారు. ఈ దురాగతంలో పాల్గొన్నారు. నా గ్రామంలోని పక్కింటి వాళ్ళు కూడా మా ముస్లిమ్స్‌ని చంపిన వాళ్ళలో ఉన్నారు. నేను వాళ్ళనెలా గుర్తించలేనో చెప్పండి? వాళ్ళంతా నా గ్రామస్తులు!

రెండు గంటల తర్వాత కళ్ళు తెరిచిన నాకు నా ప్రపంచం అంతా దారుణంగా నాశనమైపోయి కన్పించింది. కనీసం లేచి నా కాళ్ళమీద నిలబడలేకపోయాను. నన్ను చూసిన వాళ్ళు మళ్ళీ నా దగ్గర్కి వస్తారేమోనని భయపడ్డాను. ఆ కొండపైకి ఒక రాత్రి - పగలూ అలాగే గడిపాను. చాలా ఆకలిగా, దాహంగా ఉంది. దాహంతో చనిపోతానేమో అన్పించింది. మెల్లగా కొండచరియ దిగడం మొదలుపెట్టాను.

కింద ఆదివాసీల - బోరు పంపు కనపడింది. వాళ్ళు కూడా నేను ముస్లిమ్‌నని నన్ను కొట్టటానికొచ్చారు. వాళ్ళ భాషలో నేను వాళ్ళ మనిషినే అని చెప్పాను. వాళ్ళు నాకు బట్టలు - తిండి ఇచ్చారు. కొద్దిగా నిద్రపోయాను. ఆ సమయంలో ఒక పోలీస్ వ్యాన్ ఆ వైపుగా వచ్చింది. రంధక్‌పూర్‌లోని ముస్లిమ్స్‌పై అక్కడ దాడి జరిగింది అని పోలీసులు తెల్సుకున్నారు.

వాళ్ళు నన్ను వాన్‌లో కూర్చోమన్నారు. నేను బతకడం నా అదృష్టం అన్నారు. అప్పుడు వాళ్ళకు నా కథ ఏం చెప్పలేదు. వాళ్ళు నన్ను లింబేడాకి తీస్కెళ్ళారు. అక్కడ నాకు అన్నం పెట్టి నా కంప్లైంట్ విన్నారు. వాళ్ళకంతా చెప్పాను. కానీ వాళ్ళు నేను చెప్పిందంతా మార్చి పడేసారు. నన్ను భయపెట్టారు. నువ్వు నిన్ను రేప్ చేసారని కంప్లైట్ ఇస్తే మెడికల్ చెకప్‌కి హాస్పిటల్‌కి తీస్కెళ్ళాల్సి వస్తుంది. ఇంత బలహీనంగా ఉన్న నువ్వు హాస్పిటల్‌కి ఎలా వెళ్తావు? నిన్ను చంపేస్తారేమో నువ్వు కంప్లైట్ ఇస్తే అని నన్ను చాలా భయపెట్టారు. పోలీసులతో పోరాడ్డానికి నాకు అస్సలు శక్తి లేదు. అందువల్ల కంప్లైట్ ఇచ్చే ఆలోచన మాని నన్ను గోద్రా కేంపుకి తీస్కెళ్ళమన్నాను. నా బంధువుల్ని కలవాలి నేను అక్కడ.

మా అమ్మ, ఇద్దరు తమ్ముళ్ళు - చెల్లెళ్ళు, నా మూడేళ్ళ బిడ్డ అంతా చంపబడ్డారు. కానీ నేను ఆ దుండగుల్ని గుర్తు పట్టగలను. నన్ను రేప్ చేసిన వారిని నేను సంవత్సరాలుగా ఎరుగుదును. వాళ్ళకి మేం పాలు అమ్మాం. మాకు ఆవులు - బర్రెలుండేవి. ఊరంతా మేం పాలు పెరుగు అమ్మేవాళ్ళం. అదే మా జీవనాధారం. వాళ్ళు మా దగ్గర నిత్యం పాలు కొనే వినియోగదార్లు. వాళ్ళకేమన్నా సిగ్గూ, షరం ఉంటే నన్ను రేప్ చేయకపోయి ఉండేవాళ్ళు.

రేప్‌కి గురైన ఐదు రోజుల తర్వాత... మూడు సార్లు స్నానం చేసిన తర్వాత నేను ఆఖర్ని మెడికల్ చెకప్‌కు వెళ్ళగలిగాను. నా మీద రేప్ జరిగిందనడానికి సాక్ష్యం ఉంది నా దగ్గర. నాకు చదువు లేదు. నేను గాంఛీ కమ్యూనిటీకి చెందిన తబలీగి జమాత్‌కి చెందిన దాన్ని. ఇక్కడ ఆడపిల్లలకు చదువు చెప్పించరు - స్కూలుకి పంపరు.

నేను ఈ పోరాటాన్ని ఆపను... వాళ్ళనెలా క్షమించగలను?



# నరేంద్ర దెబోల్కర్ 'ప్రతి రాధేమా' నా తండ్రిని మరల చంపుతూనే ఉంది

హమీద్ దెబోల్కర్
తెలుగు - ఆర్. శశికళ

20వ తేదీన ఆగస్టు 2013 నరేంద్ర దెబోల్కర్ పై కాల్పులు జరిగాయి.

మూఢనమ్మకాలకు వ్యతిరేకంగా మాట్లాడటమే ఆయన చేసిన నేరం.

క్రూరమైన వక్రోక్తి : పోలీసులు అతని హత్య ఛేదించే ప్రయత్నం చేశారు. (వాస్తవానికి ఆయన ఆత్మ చెప్పాలి హంతకుడెవరో అని పెదవి విరుస్తున్నారు)

ఈ కేసులో ఎటువంటి పురోగతి లేదు.

నరేంద్ర దెబోల్కర్ కుమారుడైన హమీద్ తండ్రిని గుర్తు చేసుకొంటున్నాడు.

గొప్ప హేతువాది హమీద్ దల్వాయి పేరు నాకు మా నాన్నగారు పెట్టారు.

నా పేరు గురించి అడిగినపుడు, ఒక మనిషిని అతని పేరు లేదా మతంతో అంచనా వేయరాదు అని చెప్పారు.

ఆయన ఆచరణ, పాటించే విలువలు గమనిస్తూనే నేను, నా సోదరి వాటిని స్వీకరించాము. కానీ ఆయన మాకెపుడూ ఏదీ నేర్పలేదు.

'అంధ శ్రాద్ధ నిర్మూలన సమితి' కార్యకలాపాలలో భాగంగా ఆయన ప్రయత్నాలు ఫలించి ఎందరో మూఢనమ్మకాలు వదిలేశారు.

అంతేకాక మూఢ విశ్వాసాలకు వ్యతిరేకంగా పోరాడే స్ఫూర్తిని రగిలించారు.

దెబోల్కర్ కృషి ఫలితంగానే మహారాష్ట్ర ప్రభుత్వం మూఢ నమ్మకాలకు వ్యతిరేకంగా ప్రవేశపెట్టిన బిల్లును ఆమోదించింది.

ఆయనం మరణం తర్వాత ఎందరో సన్నిహితుల మద్దతు నాకు ఆధారమైంది.

ఆ పోరాటం తిరిగి కొనసాగించే స్ఫూర్తి కల్గింది.

ఆయనను చంపేశారు. కానీ ఆయన ఆలోచనలను చంపలేరు.

నాకు ఎనిమిదేళ్ళ వయసులో నా పేరు గురించి మా నాన్నను అడిగాను. పాఠశాలలో విద్యార్థులు వారి పేర్లను వారి మతాలలో సరిపోల్చుకొనేవారు. ఎవరో నన్ను ఎగతాళి చేసినపుడు నా తండ్రిని ప్రశ్నించాను. పేర్లు ఎప్పుడూ మతంతో అంచనా వేయద్దు - మనమెపుడు మంచి మనుష్యులుగా ఉన్నామా లేదా అనేది చూడాలని ఆయన సమాధానమిచ్చేవాడు.

నేను కొన్ని నెలల్లో పుట్టనంగా 'హమీద్ దల్వాయి' అనే ప్రఖ్యాత సంస్కర్త మరణించారు. ఆయనంటే మా నాన్నకు చాలా ఇష్టం అందుకే నాకాయన పేరు పెట్టారు. ఆ విషయం నాకెంతో గర్వానిచ్చింది.

ఆయనకు ధర్మోపదేశాలల్లో ఎటువంటి నమ్మకం లేదు. ఆయన మాతో ఎన్నడూ ఏదీ ఉపదేశం చేయలేదు. నేను, నా సోదరి 'ముక్త' కేవలం ఆయన పాటించే విలువలు, నమ్మకాలను అర్థం చేసుకొంటూ పెరిగాం. ఇంటా బయటా ఆయనది ఒకే తీరు. అంతర్ముఖుడు ఎన్నడూ కొప్పడిన దాఖలాలు లేవు. ఆయన చేతే ఆయన వ్యక్తిత్వంలో అంతర్భాగం. అతిసూక్ష్మమైన విషయాలను న్యాయంగా హేతుబద్ధంగా సవాలు విసిరే పద్ధతిలో ఇతరులు విశ్లేషించేందుకు ఏమీ మిగిలేది కాదు. అన్యాయమైన విషయాలనెపుడూ వ్యతిరేకిస్తూ ఉండేవాడు. హేతుబద్ధంగా ఆలోచించి, మూఢ, అంధ విశ్వాసాలకు వ్యతిరేకంగా పోరాడాలనే వాడు. అప్రధానమైన ఉద్యమం ఆయన జీవితంలో లేదు. 1980 సంవత్సరంలో వి. ప్రేమానంద్‌తో పాటు ఆయన ప్రయాణం చేశాడు. అతడు దక్షిణ భారతదేశంలో ప్రముఖ హేతువాది. వాళ్ళిద్దరూ ఎన్నెన్నో గ్రామాలు తిరిగారు. స్థానిక సమస్యలపై మాట్లాడుతున్నపుడు ప్రజలు కూడా చెడు గురించి మాట్లాడాలను కొనేవారు. అభ్యుదయ ఆలోచనాపరులు ప్రబోదాంకర్ థాకర్ మహారాజా ఆలోచనలు వ్యాప్తి కాకుండా గాడ్చే అడ్డుకొన్నారు.

1989 లో 'అంధ శ్రద్ధా నిర్మూలన సమితి' స్థాపించబడినది. అతని సామాజిక బాధ్యతలు 40-45 ఏళ్ళ మధ్య ప్రారంభమయినాయి. ఆ రోజుల్లో మేం ఆయన్ను ఎప్పుడో గాని కలవటం జరిగేది కాదు. ఆయన నెలలో 22-25 రోజులు ఇంటి నుండి బయటా గడిపేవాడు. ఆ రోజుల్లో మొబైల్ ఫోన్లు లేవు. వెళ్ళేముందే తన రూట్ మాప్ తయారు చేసి ఇచ్చేవాడు. ఆయన లక్ష్యాలు అర్థం చేసుకొనే వయసు నాకిప్పటికి లేదు. కానీ ఆయన విభిన్నమైన వ్యక్తి అని మాత్రం అన్పించేది. తర్వాత కాలంలో ఆయన ఉపన్యాసాలను, రచనలను అర్థం చేసుకొన్నాను. హేతువాదాన్ని విశ్వసించి, ఆచరించి వ్యాప్తి చేయటంలో కుటుంబ పాత్ర ఎంతో ఉంది.

### ఆయన చెల్లించిన మూల్యం

నీ అంతరాత్మ ఏది చెబితే అది చేయమని మా అమ్మమ్మ ఎప్పుడూ చెప్తూండేది. అందుకు మూల్యం అతడు చెల్లించేందుకు సిద్ధపడ్డాడు.

ఆగస్టు 20, 2013 'సతారాహేం'లో నా కుటుంబంతో కలిసి ఉన్నారు. ఆ దుర్దినం నా కోసం ఎదురు చూస్తోంది కావచ్చు. 8-30 గంటలకు ఫోన్ మోగింది. పూణెలో మా తండ్రిపై దుండగులెవరో కాల్పులు జరిపారని తెల్సింది. ఇదివరకే ఆయనపై ఎన్నో దాడులు జరిగాయి. ఆయన చేస్తున్న పనిలో ప్రమాదాలు పొంచి ఉన్నాయని తెల్సి ఆయనపై ఎన్నో తప్పుడు కేసులు నమోదయ్యాయి. అదివరకు రెండు రోజుల క్రితమే ఆయనతో కలిసి మాట్లాడాను. అదే ఆఖరి కలయిక అనుకోలేదు.

గత రెండు సంవత్సరాలుగా సమాధానాలు వెతుకుతూనే ఉన్నాను. ఈ కేసులో ఎటువంటి పురోగతి లేదు.

న్యాయం కోసం ఇంకా ఎదురు చూస్తూనే ఉన్నాను. సిబిఐ ఆరుగురు అధికారులను కేసు పరిశోధనకు పంపింది. ముఖ్యమంత్రి కూడా ధృవీకరించాడు. దర్యాప్తు అధ్వాన్నంగా ఉంది. అధికారుల ఉదాశీనత బాధ కల్గిస్తోంది. అధికారులు మారుతూనే ఉన్నారు. పూనెలో నేరానికి ముంబయిలో కూర్చుని పరిశోధిస్తున్నారు. ట్రిగ్గర్ నొక్కిన వేళ్ళను కనిపెట్టాలంటే కష్టమే కావచ్చు. కానీ ఈ దుర్మార్గ చర్య వెనకున్న ఆలోచనను బయటపెట్టలేరా?

వాస్తవం ఏంటంటే ఎవరైతే ఆయనను కల్పిత కేసుల్లో ఇరికించాలని చూశారో, ఎవరు ఆయన హత్యకు గురయినపుడు హర్షం ప్రకటించారో, హత్యకు ముందు ఆయన ఫొటోను అవమానించారో వారు నేరస్తులు. నా తండ్రి ఎవరికీ తెలియదనడం ఆశ్చర్యం కల్గిస్తోంది. సిబిఐకి కేసు అప్పగించే ముందు పోలీసులు మొదట్లో కొన్ని అల్పమైన ఎత్తుగడలతో కాలయాపన చేశారు. విషాదమేమంటే పోలీసులు నా తండ్రి హత్య కేసును ఆయన వ్యతిరేకించిన ఆధారాలతో పరిష్కరించే ప్రయత్నం చేయటం. 'అంధశ్రద్ధా నిర్మూలన సమితి' కార్యకర్తలు, నా కుటుంబం నాకు తోడుగా నిలిచింది.

నాకంటే ఆ కార్యకర్తలే బహుశా ఎక్కువ అదృష్టవంతులు, నా తండ్రితో వారే ఎక్కువ సమయం గడిపారు. వారంతా వారి కుటుంబంలో వ్యక్తిని కోల్పోయినట్లు రోధించారు. వారే నాకు ఈ దుర్ఘటన ఎదుర్కొనే బలాన్నిచ్చారు. మూఢ విశ్వాసాలకు వ్యతిరేకంగా పోరాడాలని, తిరిగి ఆయన బాటలో నడవాలని నిర్ణయించుకొన్నాం.

నాసిక్ నుండి 'కృషి చాంద్ గూడె' తన వ్యాపారం పక్కన పెట్టి అంధ విశ్వాసాల నిర్మూలన సమితి కోసం పూర్తికాలం కార్యకర్తగా గత రెండేళ్లుగా పని చేస్తున్నాడు.

నా తండ్రి హత్యకు కేవలం 15 రోజులు ముందే తన తండ్రిని కోల్పోయిన సంజయ్ బన్నా, ఇస్లాంపూర్ నుండి పూర్తికాలం కార్యకర్తగా పని చేస్తున్నాడు. ఆ దుఃఖం నుండి బయటపడి నిరసన ప్రదర్శనల్లో ముందున్నాడు. ఇంకా అటువంటి ఉదాహరణలు ఎన్నో ఉన్నాయి. నేను సైకాలజిస్ట్ కావటంతో 'అంధశ్రద్ధా నిర్మూలన సమితి' పిలుపు అందుకోవటం నాకే మాత్రం కష్టం కాలేదు. మూఢ నమ్మకాలు సైకాలజీలో భాగం.

మా లక్ష్యం ఏంటంటే ఆయన ఆశయాన్ని కొనసాగించడమే. ఆయన హంతకులు విజయం సాధించారని అనుకోవచ్చు. ఆయన హత్యతో ఆలోచనలు చంపగలరా? ఒక నాయకుని చంపితే ఆయన అనుచరులు ఆ క్షణంలోనే హింసాత్మకంగా ప్రతిస్పందిస్తారు. కానీ అటువంటి స్పందనలు లేకుండా మేమంతా ఆచరణకు పునరంకితమయ్యాం - ఆయన బోధనల విజయం అని నేను భావిస్తాను.

మాధవ్ బావె, ప్రస్తుతం 'అంధశ్రద్ధా నిర్మూలన సమితి'కి ప్రధాన కార్యదర్శి. అతడు ఒకప్పుడు తప్పుడు బాబాలతో, మూఢనమ్మకాలతో గుడ్డివాడయ్యాడు. లాథూర్‌లో నా తండ్రి ఉపన్యాసం విని తన దృక్పథం మార్చుకొన్నాడు. పునారాలోచించాడు. అంధశ్రద్ధా నిర్మూలన సమితి సమావేశాల్లో, సంఘటనల్లో పాల్గొన్నాడు - క్రమంగా ఆయన ఊహించని రీతిలో మారిపోయాడు.

జగ్గుబాబా గోరత్, మాన్ తాలూకా నుండి అతడే దేవుడనే పేరుతో గ్రామీణులను మోసం చేసేవాడు. అతడు కూడా బావే లానే ప్రభావితమయ్యాడు. ఈ రోజు అతడు అంధశ్రద్ధా నిర్మూలన సమితిలో ఒక విడదీయరాని భాగం. ప్రజలకు మోసం చేసే వాళ్ళను, దొంగ బాబాలను గుర్తించటంలో సహాయం చేస్తున్నాడు.

నా తండ్రితో ఆగిపోయిన పని మేం మొదలుపెట్టాం. స్పందన అద్వితీయంగా ఉంది. సాధారణంగా ఇప్పటి యువకుల్లో సున్నితత్వం, ఆసక్తి లేదని అనుకొంటారు. కానీ మా విషయంలో అనుభవం మాత్రం అందుకు భిన్నంగా ఉంది. బయటికి వాళ్ళకు పెద్ద పేరు ప్రఖ్యాతులుండకపోవచ్చు. కానీ ఈ యువకులంతా సమాజ అభ్యున్నతికి పని చేసేందుకు ఉప్పెనలా కదిలారు.

### ఓ వేయిమంది మరణం

నా తండ్రి మరణించినపుడు రాధేమా, ఆశారామ్ సంఘటనలు జరిగాయి. అంధశ్రద్ధా నిర్మూలన సమితి 18 ఏళ్ళ సుదీర్ఘ పోరాటం తర్వాత మూఢచార వ్యతిరేక బిల్లు పాస్ చేసింది మహారాష్ట్ర ప్రభుత్వం. ఈ బిల్లు పాస్ కావడానికి నా తండ్రి ప్రాణాని పణం పెట్టాడు. ఆచరణలో ఈ చట్టం ఉపయోగించడం అనేది కేవలం భ్రమ మాత్రమే. రాధేమా మతం పేరుతో ఎన్నో మోసాలు చేశాడు. చట్టం ఉపయోగిస్తే ఇటువంటి వాళ్ళు శిక్షార్హులు అవుతారు.

* * *

డాక్టర్ దెబోల్కర్ పోరాటం ప్రత్యేకంగా ఏ మతానికో వ్యతిరేకం కాదు. మతాలకు అతీతంగా మతోన్మాదాన్ని మాత్రమే వ్యతిరేకించాడు.

ప్రజలంతా శాస్త్రీయ దృక్పథంతో ఆలోచించగలిగే విద్యను అందించాల్సిన ఆవశ్యకత మరింతగా పెరిగింది.

అపుడే రాధేమా, ఆశారం లాంటి దొంగ బాబాల ఆలోచనలు మూఢత్వం బయటపడతాయి. అందుకే నరేంద్ర దెబోల్కర్ లాంటి వారి ఆవశ్యకత రోజు రోజుకు పెరుగుతోంది. ఆయన లేని లోటు అర్థమవుతూంది. ఎన్నో సవాళ్లు ఎదుర్కోవాల్సి ఉంది... ఆ బాటలోనే నడుద్దాం.



వ్యాసం

# నా దేశాన్ని కాపాడగలిగాను - కానీ నా కుటుంబాన్ని కాపాడుకోలేకపోయాను

ఇబ్రహీమ్ షేక్

అనువాదం - గీతాంజలి

పది సంవత్సరాల తర్వాత అతను అన్ని కోల్పోయి జీవితంలోని చౌరస్తాలో నిలబడ్డాడు ఇబ్రహీమ్ షేక్... భారతదేశాన్ని శత్రు దేశాల నించి రక్షించే సిఆర్‌పిఎఫ్ వీర జవాను... కోల్పోయిన తన జీవితాన్ని కోరుకుంటున్నాడు.

2002లో గుజరాత్‌లో గోధ్రా అనంతరం జరిగిన ముస్లిం జాతి హవన కాండలో చంపివేయబడ్డ తన 18 మంది కుటుంబ సభ్యులనైతే అతను ఎలాగూ తిరిగి బతికించుకోలేడు. కానీ సిఆర్‌పిఎఫ్ జవానుగా కోల్పోయిన తన ఉద్యోగాన్ని తిరిగి కోరుకుంటున్నాడు.

సిఆర్‌పిఎఫ్ జవాను ఇబ్రహీమ్‌షేక్. 2002లో గోధ్రాకు 100 కి.మీ. దూరాన ఉన్న తన రంధిక్‌పూర్ గ్రామం మత కలహాల్లో కాలిపోతున్నపుడు అతను ఆ చండీఘడ్‌లో తన డ్యూటీలో ఉన్నాడు.

నేను వెంటనే మా కమాండెంట్‌కి ఫోన్ చేసి నా కుటుంబాన్ని రక్షించుకోవడానికి, కనీసం కనుక్కోవడానికి 15 రోజులు శెలవు ఇవ్వమని అడిగాను. ఆయన వెంటనే డాహోద్ డిస్ట్రిక్ట్ కలెక్టర్‌కి, జిల్లా పోలీస్ సూపరిన్‌టెన్‌డెంట్‌కి ఫోన్ చేసి నాకు నా బంధువుల్ని లేదా వారి శవాలని కనుక్కోవటంలో సాయం చేయాలని చెప్పారు. ఆయన వెంటనే ఫైవ్-టన్ వెహికల్, 2 పైలెట్ జీప్సలను నాకు సహాయంగా పంపారు. షేక్ గుర్తు చేస్కుంటూ చెప్పాడు.

ఇబ్రహీం వెంటనే గోధ్రా కేంప్‌కి చేరుకున్నాడు. అక్కడ మారణకాండలో చనిపోయిన తర్వాత మిగిలిన ముస్లిమ్స్ వందల సంఖ్యలో ఉన్నారు. అక్కడ తన కుటుంబ సభ్యులు 18 మంది క్రూరంగా చంపివేయబడ్డారని తెలుసుకుని కుప్పకూలిపోయాడు. నా కుటుంబ సభ్యులంతా తామేం తప్పు చేయకున్నా చంపబడ్డారు. మా ఊరికి దాదాపు 100 కి.మీ. దూరానా ఉన్న గోధ్రాలో ట్రైన్ తగలబడితే మా ఊరి ముస్లిమ్స్‌ని చంపేసారు. ఆ ట్రైన్ దహనానికి మా ఊరి ముస్లిమ్స్‌కీ ఏంటి సంబంధం? మా మనుషులు - ఇల్లు - వస్తువులు - మా ఆవులు - బర్రెలు అన్నీ కాలి బూడిదై పోయాయి... షేక్ దుఃఖాన్ని ఆపుకోలేక పోయాడు.

ఇక నేను సగం కాలిన నా ఇంటిన బాగు చేస్కోవాలని అనుకున్నా... నేను మరిన్ని రోజులు శెలవు కావాలని కోరుకున్నా కానీ అది తిరస్కరించబడింది. 2 నెలల తర్వాత మళ్ళా సిఆర్‌పిఎఫ్ డ్యూటీలో చేరిపోయి నాలుగు సంవత్సరాలు అక్కడ డ్యూటీ చేస్తూండి పోయాను. కానీ తిరిగి నా మిగిలిన కుటుంబ సభ్యులతో గడపాలని కోరుకున్నా. అక్కడ్నించి సిఆర్‌పిఎఫ్ పర్మిషన్ తీస్కోకుండానే బయటపడ్డాను. ఆ సమయంలో నేను ఆర్థికంగా, మానసికంగా చాలా చితికి పోయాను. దేశాన్ని రక్షించుకోగలిగాను, కానీ నా కుటుంబాన్ని రక్షించుకోలేకపోయానన్న వాస్తవం నన్ను పశ్చాత్తాపంతో దహించి వేసింది.

నేను రంధిక్‌పూర్ గ్రామానికి వచ్చాను. నేను బిల్కిస్‌బానోకి తన కేసులో సహాయం చేస్తూ వచ్చాను. బిల్కిస్ బానో 19 సంవత్సరాల వివాహిత, 5 నెలల గర్భిణీ... సామూహిక లైంగిక అత్యాచారానికి, దౌర్జన్యానికి గురి అయ్యింది. లైంగిక అత్యాచారం తర్వాత ఆమెని బాగా కొట్టారు. ఆమె స్పృహ తప్పి పడిపోయింది. చనిపోయిందనుకుని వదిలి వెళ్ళిపోయారు దుండగులు. ఆమె 3 సంవత్సరాల పాప సాలెహాని గాలిలో విసిరితే రాయి మీద పడి తలబద్దలై ఆమె కళ్ళముందే చనిపోయింది. బిల్కిస్ చెల్లెలు షమీమ్ 2 రోజుల బాలింత ఆమెనీ అత్యాచారం చేసి చంపేసారు. ఆమె రెండు రోజుల పసిబిడ్డని నేలకేసి బాది బాది చంపేసారు. బిల్కిస్ కన్న తల్లినీ అత్యాచారం చేసారు. ఆమె తల్లితో పాటుగా 13 మందిని చంపేసారు. ఇదంతా 2002లో గుజరాత్ మత కలహాల్లో జరిగింది. ఆమె చేసిన న్యాయ పోరాటానికి 2008లో విజయం లభించింది.

ఏడుగురు నిందితులకి 2008లో ట్రయల్ కోర్టు యావజ్జీవ శిక్ష విధించింది. ఈ కాలమంతా నేను ఆమెతో ఉన్నాను. ఇబ్రహీం అంతా గుర్తుకు చేస్కుంటున్నాడు. కలతపడిన మనసుతో.

ఇబ్రహీమ్ షేక్ ఇప్పుడు ఒక పునరావాస కాలనీలో ఉంటున్నాడు. అక్కడే రంధిక్‌పూర్ గ్రామంలోని 80 కుటుంబాలు ఉంటున్నాయి. షేక్‌కి మళ్ళీ సిఆర్‌పిఎఫ్‌లో చేరాలని ఉంది. "నేను నా దేశం కోసం పోరాడ్డానికి ఎప్పుడూ సిద్ధమే. నా చివరి రక్తపు బిందువు కూడా నా భారత దేశం కోసం ధార పోస్తాను" తన మనసులో మాటని షేక్ పంచుకున్నాడు. గుజరాత్‌లో జరిగిన మత కల్లోలాన్ని గుర్తుకు చేస్కుంటే ఒణుకు వస్తుందనీ... గుజరాత్‌లో ముస్లిమ్స్‌ని రక్షించని ఆర్మ్‌డ్ పోలీస్‌పై తనకు నమ్మకం పోయిందనీ చెప్పూ, ఆర్మ్‌డ్ ఫోర్సస్... మా సిఆర్‌పిఎఫ్ ఫోర్సెస్ కన్నా చాలా భిన్నమైనవి. అది సిఆర్‌పిఎఫ్, బిఎస్‌ఎఫ్, ఆర్మీ, ఎయిర్‌ఫోర్స్ లేదా నావికా దళం ఏదైనా మా ఆర్మీ దళాలే ఉన్నతమైనవి. 110 కోట్ల భారత దేశ జనాభా... కళ్ళు మూస్కుని ప్రశాంతంగా నిద్రపోవచ్చు. మా డ్యూటీలో ఉన్న ఆర్మీ రక్షణలో ....



వ్యాసం

# డాక్టర్ అస్గర్ ఆలీ ఇంజనీర్ స్మారకోపన్యాసం : భారత సమాజం, లౌకికతత్వం

**రోమిల్లా థాపర్**

సంక్షిప్త అనువాదం - పిఎస్ఆర్ ప్రసాద్

లౌకిక భారత సమాజాన్ని స్థాపించడం పట్ల తీవ్ర అభినివేశం ఉన్నవ్యక్తికి, ఆ లక్ష్యాన్ని ముందుకు తీసుకుపోవటానికి తనను తాను నిబద్ధం చేసుకున్న వ్యక్తికి సంబంధించిన కార్యాచరణను స్మరించటానికి నాకు వచ్చిన గొప్ప గౌరవమైన అవకాశంగా దీన్ని భావిస్తున్నాను.

మన రాజకీయ పార్టీలన్నీ లౌకికతత్వాన్ని కేవలం ఒక రాజకీయ వివాదం స్థాయికి కుదించటానికి ప్రయత్నించినప్పటికీ, లౌకికతత్వం కేవలం రాజకీయ పార్టీ వివాదం మాత్రమే కాదని నేను చెప్పదలుచుకున్నాను. ఒక రాజకీయ పార్టీ లౌకికతత్వాన్ని సూత్రప్రాయంగా ఆమోదిస్తుంది గాని, దాన్ని ఆచరణలో సక్రమంగా అన్వయించే విషయంలో ఊగిసలాడుతుంది. లౌకిక వ్యతిరేక భావజాలం పునాదిగా గల మరొక పార్టీ దాన్ని వేళాకోళం చేస్తుంది. ఒక సమాజాన్ని లౌకికీకరించటం అనేది మనం ఎలాంటి సమాజాన్ని కోరుతున్నాం అనే దానితో లోతుగా ముడిపడి ఉంటుంది. బహుశా అందుచేతనే స్వాతంత్రం వచ్చిన తొలి సంవత్సరాలలో దీని గురించి విస్తృతమైన చర్చ జరిగింది. ప్రస్తుతం దాని మీద దృష్టి పెట్టకుండా ఉండటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. దీని అర్థం ఏమిటంటే భారత సమాజానికి ప్రస్తుతం మనం ఇస్తున్న మార్గదర్శకత్వాన్ని సీరియస్‌గా, పునర్మూల్యాంకనం చేయటం మనకిష్టం లేదు. దాన్ని (లౌకికతత్వాన్ని) రాజ్యాంగం నుండి తొలగించాలనే ఒక తాత్కాలిక సలహా కూడా ఈ మధ్య వచ్చింది. దాన్ని రాజ్యాంగంలో చేర్చాలనే డిమాండ్‌ను మర్చిపోతారనే ఆశ వాళ్ళకు ఉండి ఉంటుంది.

మనం లౌకిక సమాజాన్ని కోరుకునేట్లైతే మన ఆలోచనా పద్ధతిలో మార్పు రావాలి. మనల్ని మనం మతం, కులం, భాషలను బట్టి ప్రాథమికంగా గుర్తించే పద్ధతికి స్వస్తి చెప్పాల్సి ఉంటుంది. సిద్ధాంతపరంగాను ఆచరణలోనూ మనల్ని మనం ఒక జాతికి చెందిన సమానులైన పౌరులుగా భావించే ఆరోదన ప్రారంభం కావాలి. రాజ్యానికి, ప్రజలందరికి మధ్య పరస్పరం కొన్ని బాధ్యతలను నిర్ణయించుకోవాల్సి ఉంటుంది. మనకు ఉండే మతం, కులం, భాష, ప్రాంతం వంటి గుర్తింపులన్నీ తప్పనిసరిగా ద్వితీయ శ్రేణికే చెందుతాయి. ఈ దేశ పౌరసత్వం ఉన్న వారందరికి ఒకే రకమైన హక్కులను కలిగించటం కోసం ఈ గుర్తింపులన్నీ సర్దుబాటు చేసుకోవాలి. అంతిమంగా రాజ్యం ఒక మతాన్ని ప్రోత్సహించటం గాని, లేదా ఒక మత సంస్థకు మద్దతు ఇవ్వటంగాని ఆశించకూడదు. ఇలాంటి మార్పు ఇంకా ప్రారంభం కానే కాలేదు. అయినా కొన్ని శ్రేణుల నుండి దీనిపట్ల కావాలనే వ్యతిరేకత వ్యక్తమవుతోంది.

భారత సమాజాన్ని గురించి, లౌకికతత్వాన్ని గురించిన చర్చలో ఇమిడి ఉన్న మౌలిక అంశాల గురించి నా ప్రసంగంలో చర్చించ దలుచుకున్నాను. లౌకిక తత్వానికి ఈ దేశంలో సాధారణంగా ఆమోదం ఉన్న నిర్వచనం సమగ్రమైనది కాదు. అంతేగాక అందరూ దాన్ని ఏకగ్రీవంగా ఆమోదించటం లేదు. అందుచేత లౌకికతత్వాన్ని నేను ఎలా నిర్వచిస్తానో వివరిస్తాను. తదనంతరం, భారతదేశంలో మతాలకున్న సామాజిక ఆచరణ ఐరోపా అనుభవం కంటే ఎలా భిన్నమైనదో పరిశీలిస్తాను. భారతదేశంలో మతాన్ని కులం నుంచి వేరు చేసికాక, కుల సంబంధంలో ఎలా అర్థం చేసుకోవాలో వివరిస్తాను. చివరిగా భారత సమాజాన్ని లౌకికీకరించే క్రమంలో ఇమిడి ఉన్న ప్రాధాన్యతలను గురించి మాట్లాడతాను.

## నిర్వచనాలు

లౌకికతత్వం, లౌకికవాదం, లౌకికీకరణ అనే పదాలకు నేను ఆలోచిస్తున్న అర్థాన్ని వివరించటంతో నా ఉపన్యాసాన్ని ప్రారంభిస్తాను. లౌకికత అంటే భౌతిక ప్రపంచంతో సంబంధం ఉన్నది, ఆధ్యాత్మికతకు భిన్నమైనది. లౌకికవాదం అంటే సాంఘిక వ్యవస్థలపై మత సంస్థలకున్న ఆధిపత్యాన్ని ప్రశ్నించేది. సమాజంలో మతం ఉనికిని అది నిరాకరించదు. అయితే ఏ సాంఘిక వ్యవస్థలపై అజమాయిషీ చేసే అధికారం మతానికి ఉంటుందో, ఉండదో అది స్పష్టంగా విభజించి చూపుతుంది. ఇది చాలా ముఖ్యమైనది. లౌకికీకరణ అంటే సమాజం మార్పు పొందే క్రమం, ఈ భిన్నత్వాన్ని గుర్తించే క్రమం.

1851లో మొదటసారిగా వాడినపుడు 'లౌకికత' అనే పదానికి ఒక ప్రాథమిక అర్థం ఉండేది. సమాజం ఆరోగ్యకరంగా ఉంటూ సమన్వయపూర్వకంగా పనిచేయటానికి వీలుగా మానవ సమాజం సాంఘిక నియమాలు, విలువలు, నీతి సూత్రాలను రూపొందించుకున్నదనే వాస్తవాన్ని అది సమర్థించింది. అవి ఏవీ దైవ సృష్టి కావు. వాటికి దైవిక అంగీకారం కూడా అవసరం లేదు. అలాంటి అంగీకారం కావాలని మతం అనుకోవచ్చు గాని దానితో నిమిత్తం లేకుండానే చట్టాలు ఉనికిలో ఉన్నాయి. ఆ సమాజంలో నివసిస్తున్న వాళ్ళ సామాజిక జీవనానికి ఏది మంచిది అవుతుందో దానికే ఈ సూత్రాలను నిర్ణయించే అధికారం ఉండేది. అధికారం చట్టాల ద్వారా వ్యక్తీకరించబడేది. అందుచేతనే సామాజిక విలువల మూలాలు తరచుగా హేతుబద్ధమైన ఆలోచనలలో ఉండేవి. ఒక నిర్దిష్టమతంతో సంబంధం లేకుండా యావత్తు సమాజం అంగీకరించిన నైతిక నియమాల స్మృతిని రూపొందించాలనే ఆలోచన ఉన్న సమాజంలో ఇది ప్రత్యేకించి అవసరం.

దీని అర్థం ఏమిటంటే.. సమాజంలో అమలులో ఉండే చట్టాలను గాని సాంఘిక నియమాలను గాని వాటికి దైవ ఆమోదం ఉందనే భావనతో గాక వాటిని చట్టాలుగా మాత్రమే గుర్తించి అమలు పరచాలి. వాటికి మతం, కులాల కంటే భిన్నమైన స్వతసిద్ధమైన అధికారం ఉన్నది. దైవంపైన, మరణానంతరం జీవితంపైన, అలాంటి ఇతర అంశాలపైనా నమ్మకం ఉన్న మతం ఉనికిలో కొనసాగింది. అయితే చట్టాలు మాత్రం లౌకిక అధికారం కలిగిన వ్యవస్థ ద్వారా రూపొందించబడి అమలు చేయబడ్డాయి. అందుచేత లౌకికవాదం అంటే మతాన్ని నిరాకరించటం కాదు. వివిధ మత వ్యవస్థలకు సాంఘిక ఆచరణపై ఉన్న అజమాయిషీని కట్టడి చేయడమే.

ఈ సూత్రాన్ని అనేక రకాలుగా అన్వయించవచ్చును. మతపరంగా ఏది సరియైనది అనే పరిమితి దాటి స్వేచ్ఛగా ఆలోచించే స్వాతంత్ర్యాన్ని అది ప్రజలకిచ్చింది. అంటే అర్థం.. మతంతో విడిపడిపోవడం కాదు. మనిషి సామాజిక ప్రవర్తనను మత అజమాయిషీ చిక్కుముడుల నుండి తప్పించటం. చట్టాన్ని ఉల్లంఘించిన వాళ్ళకు శిక్ష విధించబడుతుందని, అది కూడా ఈ జీవితంలోనే తక్షణం అమలవుతుందనే నియమం కారణంగా - కొందరు ఊహించినట్లుగా ఈ లౌకికవాదం కారణంగా - ప్రజలు అవినీతిపరులు కాలేదు. మతస్మృతులు చెప్పినట్లుగా, లౌకిక చట్టంలో ఈ జన్మలో చేసిన నేరాలకు శిక్ష మరొక జన్మలో ఉండదు. ఈ కారణంగా తాము రూపొందించుకున్న చట్టాల అవసరాన్ని గురించి ప్రజలు ఆలోచించుకునే అవకాశం ఉంది. చట్టాలు ఎందుకు ఉన్నాయో ప్రజలు అర్థం చేసుకుంటే, వాటిని అమలు పరిచేటట్లు చేయడం చాలా తేలిక.

అత్యధికులైన ప్రజలు చిన్నతనం నుండీ మత ఆవరణలోకి ఎటువంటి ప్రశ్నలు లేకుండానే ప్రవేశపెట్టబడతారు. అది క్రమక్రమంగా మానసిక మద్దతు పొందుతుంది. ఆ కారణంగా విశ్వాసాన్ని ప్రశ్నించాల్సిన అవసరం తగ్గిపోతుంది. ఒకళ్లు చెప్పినదాన్ని అంగీకరించటం చాలా తేలిక. కాని ఒక అంశాన్ని హేతుబద్ధంగా ఆలోచించి నిర్ణయం తీసుకోవటం చాలా కష్టం. స్వతంత్రంగా ఆలోచించటం అనేది నేర్చుకుంటేనే వస్తుంది.

తమ నిర్ణయాలు హేతుబద్ధమైనవో, కావో నిర్ణయించుకో గలిగిన శక్తిని ఇచ్చే విద్యావిధానం ఉన్న చోటనే ఇది సాధ్యం. అలా లేనిచోట వాళ్ళు తమకు తెలియని ఒక ఊహాతీత శక్తి మీద ఆధారపడతారు. ప్రతిదీ దైవం నిర్ణయించిన ప్రణాళికలో భాగమేనని, ప్రతిదీ దైవ అంగీకారంలో భాగమని చెప్పి చిన్న చిన్న ప్రశ్నలను కూడా సమాధానం పరచటం సాధ్యం కాదు. అందుచేత విశ్వాసాల మీద, నమ్మకాల మీద ఆధారపడిన వాటికంటే భిన్నమైన, నిరూపించగలిగిన వివరణలు వెతుకులాడే దిశగా విద్య సమాజాన్ని కదిలించాలి. మనం నివసించే భౌతిక, ప్రాకృతిక ఆవరణలను శోధించటం ద్వారానే సాంఘిక నియమాలు రూపొందాయి. అందుచేత సాంఘిక న్యాయాల వివరణ విద్యలో ఒక ప్రధాన భాగం. అంతేగాక అది లౌకికీకరణలో కూడా అంతర్భాగం.

మతం ఒక వ్యక్తిగత, ఉద్రేకపూరిత అవసరాల నుండి ఆవిర్భవించింది. ఇప్పటికీ చాలా మందికి అది అట్లానే ఉన్నది. ఈ విశ్వం అంతా, అందరూ నిబిడాశ్చర్యంతో చూసే మానవాతీత శక్తి కారణంగా, పని చేస్తుందని వివరించేంత వరకూ ఇది వ్యాప్తి చెందింది. అయితే క్రమక్రమంగా వ్యక్తిగతమైన ఈ మతం సంక్లిష్టమైన వ్యవస్థీకృత రూపాన్ని ధరించి సమాజాన్ని, రాజకీయాలను అజమాయిషీ చేయాలనే దురాశ కల్గిన సంస్థల రూపంలోకి మారింది. ఈ మార్పు ఫలితంగా విశ్వాసాల కేంద్రంగాను, వివిధ మత సంస్థల ద్వారా సాంఘిక వ్యవస్థలను అజమాయిషీ చేసే అథారిటీగాను మతం మరింత శక్తివంతమయ్యింది. కొన్ని ప్రాంతాలలో దాని శక్తి రాజ్యంతో సరిసమానంగా నడిచింది. మతానికున్న ఈ నిర్దిష్ట అంశాన్ని పరిమితం చేసి దాన్ని రాజ్య ఆచరణ నుండి వేరు చేసి ఉంచాలని లౌకిక వ్యక్తుల కోరిక. అందుకే ప్రజాస్వామిక రాజ్యాంగం లౌకిక రాజ్యాంగంగా కూడా ఉండాల్సిన అవసరం ఏర్పడింది. మతానికి, సాంఘిక వ్యవస్థలపై మతం అజమాయిషీకీ మధ్య ఉన్న తేడా ముఖ్యమైనది. ఎందుకంటే మనం తరచుగా ఆ తేడాను పట్టించుకోకుండా లౌకిక వాదం మతాన్ని మొత్తంగా నిరాకరిస్తుందని అంటుంటాం.

లౌకిక వాదానికి మరొక అదనపు అర్థం కూడా ఉన్నది. మానవ సమూహాలకు వర్తించే శాసనాలను రూపొందించటానికి, వాటిని అమలు పరచటానికి, రాజ్యాంగానికి ఉండే అధికారం, మతానికి భిన్నంగా ఉండాలి. ఎందుకంటే మతానికి లభించిన అధికారం నమ్మకం, దైవం అనే భిన్నమైన వనరుల నుండి లభించినవి కాబట్టి. రాజ్యానికి మతానికి ఉన్న అధికారాలు పరస్పరం భిన్నమైనవి. లౌకికవాదం అంటే మతాన్ని నిరాకరించటం కాదు అని నేను మళ్ళీ చెపుతున్నా. అది నాస్తికత్వంతో సమానం కాదు. లౌకికవాదం అంటే మతాన్ని బహిష్కరించటం కాదు. సాంఘిక న్యాయాలు, సంస్థలపై మత సంస్థల అజమాయిషీని పరిమితం చేయటమే లౌకికవాదం.

పౌరచట్టాలు సమాజానికి వెన్నెముకలాంటివి. అవి జీవించే హక్కును కాపాడాలి. జీవికలోను, పనిలోను వివక్షతలు లేకుండా అవి రక్షణ కల్పించాలి. ఒక మనిషి జీవితంలో మార్పుకు అవకాశం ఉన్న అంశాలన్నింటిని కాపాడటానికి ఇది అత్యవసరం. ఆ మార్పులు ఏమిటంటే - పుట్టుక, వివాహం, విడాకులు, శిశువులను సామాజికీకరించే విద్య, వృత్తి, ఉద్యోగం, ఆస్తికి సంబంధించిన ఇతరేతరమైన వారసత్వం - ఇవన్నీ పౌర చట్టాల పరిధిలోకి వస్తాయి. ఇవి సమర్థవంతంగా అమలు జరగాలంటే, మానవుల సామాజిక జీవనానికి, సమాజ గమనానికి సంబంధించిన ఇలాంటి చట్టాలన్నీ ఆధునిక రాజ్యంలో సంక్షేమ రాజ్యభావనకు సంబంధించిన ప్రాథమిక అంశాలన్నింటిని తప్పని సరిగా కల్పించాలి. వాటిల్లో ఎంత కనిష్టంగా చూసుకొన్నా ముఖ్యమైనవి ఏమిటంటే - ఆహారం, పరిశుభ్రమైన తాగునీరు, సమాజంలోని సభ్యులందరికి విద్య, ఆరోగ్యం, ఉపాధి కల్పనలలో సమాన అవకాశాలు. ఇవి దఖలు పరచటంలో మతంతో, కులంతో సంబంధం ఉండకూడదు. లౌకిక సమాజంలో ఉండాల్సినట్లుగా పౌర చట్టాలు సార్వజనీనంగాను, ఉమ్మడిగా ఒకే రకంగాను ఉండాలంటే అవి పైన చెప్పిన వాటికి గ్యారంటీ ఇవ్వాలి. ఏ అంశానికి సంబంధించిన వివక్షతా అంగీకార యోగ్యం కాదు.

లౌకిక వ్యవస్థలో మత సంబంధమైన అథారిటీ ఉంటుంది.

కాని అది మత విశ్వాసాలు, వాటి అమలుకు మాత్రమే పరిమితమౌవుతుంది. మతానికి, రాజ్యానికి మధ్య ఖచ్చితమైన విభజన రేఖ ఉండకూడదని, ఆ రెండింటి మధ్య అంగీకార యోగ్యమైన సూత్రబద్ధమైన దూరం ఉండవచ్చునని ఒక వాదన ఉన్నది. ఇలా చేస్తే మతం లోపలగాని, మతాల మధ్యగాని, మతానికి రాజ్యానికి మధ్యగాని కొత్త సమీకరణలకు అవకాశం ఇచ్చినట్లవుతుంది. ప్రతి మతానికి రాజ్యంపైన సమాన హక్కులు ఉంటాయి కాబట్టి, అవి చట్టం ముందు సమాన హోదాను కలిగి ఉంటాయి కాబట్టి ఈ రకమైన స్థితిలో ఒక మతం మొత్తం మీద ఆధిపత్యం చెలాయించే అవకాశం ఉండదు. ఇలాంటి అమరికలో ఎంతో కొంత విభజన ఉంటుంది. అందువల్ల మత సంబంధమైన అథారిటీ సాంఘిక చట్టాలను ఇంకెంత మాత్రం అజమాయిషీ చేయలేదు.

లౌకికవాదం అంటే కొన్ని సందర్భాలలో వర్ణించబడినట్లుగా - లౌకిక వాదానికి భారతీయ నిర్వచనం - అన్ని మతాల సహజీవనం కాదు. గతంలో ఈ దేశాన్ని పరిపాలించిన, అశోకుడు, అక్బరు లాంటి పాలకులు కొందరు ఈ అభిప్రాయానికి మద్దతునిచ్చారని, వాళ్ళు లౌకికతత్వాన్ని పోలిన విధానాన్ని అవలంబించారని కొందరంటారు. అయితే వివిధ మతాల సహజీవనం మాత్రమే లౌకికవాదం అనిపించుకోవటానికి సరిపోదు. ఎందుకంటే వాటిల్లో కొన్ని మిగతా వాటితో సమానమైనవిగా పరిగణించబడకపోవచ్చు, మరికొన్ని నిర్లక్ష్యం చేయబడవచ్చు. ప్రస్తుత భారతదేశంలో మతాల గురించి మనం మాట్లాడేటపుడు సమాజ చట్రం చివరి అంచుల్లోకి నెట్టివేయబడ్డ ప్రజలు - జనాభాలో దాదాపు నాలుగోవంతు మంది - అనుసరించే మతాలు కూడా ఉన్నాయని గుర్తించాలి. చట్టం ముందు సమాన హోదా కలిగి ఉండి సహజీవనం చేయటం ఖచ్చితంగా తొలి అడుగు. అయితే ఇది ఎంత దూరం పోతుంది, తరువాత అడుగు ఏమిటని మనం ప్రశ్నించాలి.

ఈ నిర్వచనం కూడా అసంపూర్ణమే. ఎందుకంటే సమాజంపై మత అథారిటీకి ఉన్న పరిధి అనే అతి ముఖ్యమైన ప్రశ్నకు ఇందులో జవాబు లేదు. రాజ్యానికి మతానికి మధ్య అడ్డుగోడ కట్టడం మన ఉద్దేశం ఎంత మాత్రం కాదు. అందుకు భిన్నంగా పౌర అధికార పరిధి కిందికి వచ్చే చర్యలను, మత అధికారానికి ప్రాతినిధ్యం వహించే సంస్థల అజమాయిషీ కిందకు వచ్చే చర్యలను ఖచ్చితంగా వేరుచేయటం దీని ఉద్దేశం. ప్రజాస్వామిక వ్యవస్థలో ఏ చట్టాలను ఎవరు అజమాయిషీ చేస్తారనేది ఎంత అవసరమో, సమానత్వం కూడా అంతే అవసరం.

సమకాలీన భారతదేశంలో మతాల సహజీవనం ఇప్పటికే ఉన్నది. కాని లౌకికతత్వం పెద్దగా కనబడదు. కొంతమంది అయితే అది నిజానికి లేనే లేదు అంటారు. రాజకీయ పార్టీలు, రాజ్యం మత సంస్థల నుండి తమని తాము దూరం చేసుకోవటం లేదు. నిజానికి కొన్ని సమయాలలో ఇవి రెండు బాగా దగ్గరి సంబంధంలో ఉంటున్నాయి.

లౌకికవాదం పాశ్చాత్య దృక్పథం అనీ, భారతదేశానికి అది సరిపోదని అంటూ కొందరు లౌకికవాదాన్ని వ్యతిరేకిస్తున్నారు. వలసానంతర భారతదేశానికి జాతి, ప్రజాస్వామ్యం కొత్తవి. ఈ రెండింటి గురించి కూడా అట్లానే ఆలోచిద్దామా? నయా ఉదారవాద మార్కెట్ ఎకానమీ మన దేశంలో అమలు పరుచుకోవటం పాశ్చాత్య నమూనాను అనుసరించటం కాదా? సమాజాన్ని లౌకికీకరించటానికి మద్దతు ఇవ్వటం అంటే మనది కాని పాశ్చాత్య దృక్పథానికి మనం లొంగిపోవటం కాదు. స్వాతంత్యం తరువాత మన చరిత్రలో జరుగుతున్న మార్పునకు సంబంధించిన ప్రక్రియను అర్థం చేసుకోవటానికి ప్రయత్నించటం. ఒక జాతిగా ఉండటం ఆధునిక కాలానికి సంబంధించిన ఒక నూతన అనుభవం. అది ప్రపంచం అంతటా ఉన్నది. ప్రజాస్వామ్యం మనకు ఒక నూతన అనుభవం అయినప్పటికీ దాన్ని మన దేశానికి తగిన వ్యవస్థగా మనం ఎంచుకున్నాం. ప్రజాస్వామ్యం పని చేయాలంటే లౌకిక సమాజం తప్పనిసరి.

ఆధునిక సంస్థలు నూతన రాజకీయ ఆర్థిక, సాంఘిక రూపాలలో కొనసాగుతున్నాయి. అలాంటి ఆధునిక సంస్థలను పనిచేయించటానికి ప్రయత్నిస్తున్న సమాజాలన్నింటిలోను రూపొందే సామాజిక మార్పులకు సంబంధించిన తప్పని సరైన వ్యక్తీకరణే లౌకికవాదం. అది ఆధునీకరణను వెన్నంటి ఉండే దృక్పథం. చట్టం నైతిక సూత్రాల ఆచరణలోను, మతానికి రాజ్యానికి ఉండే సంబంధంలోను అది నూతన దిశా నిర్దేశనం చేస్తుంది. అది ఇప్పుడు ఉన్న రూపంలో మన ఆధునిక పూర్వ చరిత్రలో దాని కోసం అన్వేషించకూడదు. మనం అన్వేషించాల్సినది భారతీయ మతాలలో మత మౌఢ్యాన్ని ప్రశ్నించే సాంప్రదాయాన్ని. అలాంటి ఒక సుదీర్ఘమైన సాంప్రదాయం మన దేశంలో ఉందనటానికి సాక్ష్యం ఉన్నది. ఈ పరంపర క్రీస్తు పూర్వం ఒకటవ శతాబ్దంలో ప్రారంభమై అవిచ్ఛిన్నంగా ఇప్పటికీ కొనసాగుతున్నది. ఇలాంటి ఆలోచనాధారలను గురించిన లోతైన అధ్యయనం ద్వారా మనకు హేతుబద్ద ఆలోచనతో దగ్గరి సంబంధం ఏర్పడుతుంది. అంతేగాక భారతీయులు ఎన్నడూ మౌఢ్యాన్ని ప్రశ్నించలేదనే భావాన్ని కూడా ఆ అధ్యయనం ఛిద్రం చేస్తుంది. చట్టాలు, మానవ సమాజాల చేత రూపొందించబడ్డవేగాని దైవదత్తాలు కావని గుర్తిస్తే సామాజిక పరిణామాల ఫలితంగా ఆ చట్టాలలో కూడా మార్పులు జరుగుతాయనే వాస్తవాన్ని మనం అంగీకరిస్తాం. గతంలో ఇదొక అవిచ్ఛిన్న క్రమంగా కొనసాగింది.

**భారతదేశాలలోని మతాల గురించి వలస వాదుల భావనలు:**

ఇపుడు ఈ అంశానికి సంబంధించి నిర్దిష్టంగా భారతదేశం గురించి అతి దగ్గరగా పరిశీలిద్దాం. గతంలో మతాలకు, సమాజాలకు మధ్య జరిగిన ఆదాన ప్రదానాల గురించి నేను వ్యాఖ్యానించ దలుచుకున్నాను. అలా చేయటం ద్వారా దాన్ని ఇప్పటి మన కాలంలో మనం చూస్తున్న దృష్టికోణంతో సరిపోల్చటానికి అవకాశం ఉంటుంది. వర్తమానం గతం నుండి రూపొందుతుంది. నా వాదన ఏమిటంటే సమాజానికి, మతానికి ఉండవలసిన సంబంధం అనే ముఖ్యమైన అంశం గురించి, వలసవాద మేధావులు రూపొందించిన భావాలతో మనం పెరిగాం. భారతదేశంలో మతం అనే అంశం గురించి ఆ వలసవాద భావాలే మనలో ప్రవేశించాయి. ఆధునిక పూర్వ భారత సమాజంలో మతం ఎలా పనిచేసిందో అర్థం

చేసుకోవటానికి వలసవాద దృష్టికోణం ఉపయోగపడదు. అయినా దాన్ని మనం తగినంతగా ప్రశ్నించకుండానే అంగీకరించాం. గతం గురించి క్లుప్తంగానైనా పరిశీలించటం ఉపయోగకరం.

యూరప్‌కు సంబంధించి లౌకికవాదం అంటే చర్చి, రాజ్యం మధ్య ఎటువంటి సంబంధం లేకుండా దేని పరిధిలో అది ఉండటమే. ఐరోపాలో మతం అంటే ఏకశిలా సదృశమైన క్రైస్తవమే. క్యాథలిక్కులైనా, ప్రొటెస్టెంటులైనా వాళ్ళు క్రిష్టియన్‌లే. ప్రొటెస్టెంటిజం తల ఎత్తటానికి పూర్వం కాథలిక్ విశ్వాసాల్ని, ఆచారాలను ప్రశ్నించిన వాళ్ళు ఘోరంగా శిక్షించబడ్డారు. కొందరిని బతికి ఉండగానే తగలబెట్టారు. కొందరు తమ అభిప్రాయాలను మార్చుకున్నారు. అనేక మంది శిక్షలకు గురైయ్యారు. ప్రొటెస్టాంటిజమ్ తరువాత కాలంలో కొంత సరళంగా ఉన్నప్పటికీ తొలి అనుభవాలను మర్చిపోకూడదు. (అనేక ఐరోపా దేశాల్లో ఇతర దేశాల్నించి వలస వచ్చిన సమాజాలు తమతో పాటు తమ మతాల్ని కూడా తీసుకు వచ్చిన కారణంగా రాజ్యాంగాన్ని ఎదుర్కొంటున్న ఆ ఏకశిలా సదృశమైన మతం మారుతూ ఉంది. ఆ కారణంగానే సమాజంలో లౌకిక భావన గురించి తరచుగా భిన్నాభిప్రాయాలు తలెత్తుతున్నాయి.)

మతం ఏకశిలా సదృశం అన్న భావన యూరోపియన్ దృక్పథం. ఈ భావన ఐరోపా ఖండంలోని అన్ని సమాజాల్లోనూ ఉన్నది. ఈ భావననే వలస వాదులు భారతదేశంలోకి తీసుకువచ్చి ఈ దేశంలోని మతాలను అర్థం చేసుకోవటం ప్రారంభించారు. కనుక ఈ దేశంలోని మతాలను గురించిన వాళ్ళ అవగాహనను తిరిగి పరిశోధించాలి. వలస వాదులు భారతీయ సమాజాన్ని రెండు ఏకశిలాసదృశమైన మతాలుగా - హిందూ, ముస్లిం మతాలుగా చూసారు. ఈ రెండు మతాలకు చెందిన వారిని హిందూ, ముస్లిం అనే జాతులుగా గుర్తించారు. ఈ రెండు జాతులు ఒకే ప్రాంతాన్ని ఆక్రమించుకున్నాయి. ఆ రెండిటి మధ్య శతృత్వ భావన ఉన్నట్లుగా చిత్రీకరించారు. ఆ రెండింటి మధ్య పరస్పర ఘర్షణ వాతావరణం ఉంది కాబట్టి, దేశం వెలుపలి నుండి వాటిని అజమాయిషీ చేయించే అధికారిక వ్యవస్థ ఉండాలని యూరోపియన్లు అభిప్రాయపడ్డారు. చాలా మంది చరిత్రకారులు సూచించినట్లుగా భారత దేశ చరిత్రను ముఖ్యంగా మధ్యయుగాల చరిత్రను ఈ దృష్టికోణం నుండే యూరోపియన్ చరిత్రకారులు పరిశోధించారు. ఈ రెండు మతాల మధ్య వాటి భావజాలాల మధ్య పూడ్చలేని అగాథాన్ని వారు సృష్టించారు. ఆ రెండు మతాల ప్రజలు ఒకే చరిత్రలో భాగస్వాములనే అంశాన్ని వీళ్ల గుర్తించలేదు.

మతం ఆధారంగా మెజారిటీ మైనారిటీ మానవ సమూహాలను గుర్తించినదాని ఫలితంగా మతం ఏకశిలాశసదృశం అన్న భావన మరింత బలపడింది. అంతే కాకుండా అది మతసంబంధమైన గుర్తింపు రాజకీయాలను రెచ్చగొట్టింది. మెజారిటీ మతస్థుల హక్కులు మైనారిటీ మతాలకు చెందిన ప్రజల వాంఛలకు వ్యతిరేకమైనవిగా ప్రచారం చేయబడినవి. సాంఘిక, రాజకీయ డిమాండ్లు మతపరమైన డిమాండ్లుగా చిత్రీకరించబడ్డాయి. సమాజాన్ని అట్లా అర్థం చేసుకుంటే ప్రజాస్వామ్యం పనిచేయటానికి అన్నీ అవరోధాలే ఏర్పడతాయి. శాశ్వతమైన మెజారిటీ, మైనారిటీ బృందాలనే భావన ప్రజాస్వామిక విలువలకు భిన్నమైనది. కుల, మత ఆధారిత ఓటు బ్యాంకులను తయారు చేసుకోవటం ప్రజాస్వామ్య పద్ధతికి అనుకూలం కాదు. ప్రజలు వివిధ రకాల గుర్తింపులకు చెందిన వారైనా ఒక నిర్దిష్ట సమస్యకు మద్దతుగా అత్యధిక ప్రజలు ఒకటి కావటమే ప్రజాస్వామికంగా రూపొందిన మెజారిటీకి కొలమానం. అది ఆరోగ్యకరమైనది. అంటే ఒక్కొక్క సమస్య సందర్భంగా ఈ మెజారిటీలో ఉండే బృందాలు మారుతూ ఉంటాయి. శాశ్వతమైన మెజారిటీ సమూహం అంటూ ఏదీ ఉండదు.

ఈ స్థితిని ఎదుర్కోవటానికి వలస వ్యతిరేక జాతీయ భావన ప్రయత్నించింది. విశాల ప్రాతిపదిక మీద జాతీయతను రూపొందించాలంటే అది అన్ని మానవ బృందాలను తనతో కలుపుకు పోయేటట్లు ఉండాలి. అది ఒక ఉమ్మడి చరిత్ర నుండి రూపొందాలి. ఇది చాలా ముఖ్యమైన అంశం. గంజాయి తాగటానికి అలవాటు పడ్డ వాడికి గంజాయి మొక్క ఎలాంటిదో, జాతీయవాదులకు చరిత్ర అలాంటిదని ఎరిక్ హబ్‌స్వామ్ అన్నాడు. అది వనరు. అది ఈ ప్రత్యేక అంశంలో గుర్తింపు భావాలను రూపొందిస్తున్నది. వలస వ్యతిరేక జాతీయత, మత బృందాల ఏకశిలాస్వభావాన్ని ప్రశ్నించలేదు. అందుకు బదులుగా వాటి మధ్య ఉంటే పరస్పర వ్యతిరేకతను నిరాకరించటం మీద అది తన దృష్టిని కేంద్రీకరించింది. మత బృందాల సహజీవనాన్ని చిత్రించటానికి అది ప్రాధాన్యతను ఇచ్చింది. లౌకిక వాదం గురించిన దాని ఆలోచనకు ఇది కేంద్రం అయినది. దాన్నే భారతదేశంలో లౌకిక వాదంగా అది వర్ణించింది. వర్తమానంలో జరుగుతున్న సంఘటనలను పరిశీలిస్తే అది విజయవంతం కాలేదని మనకు అర్థం అవుతుంది. ప్రస్తుతం మత జాతీయవాదులుగా పిలవబడుతున్న వారి భావజాల పునాదులు కూడా భారతదేశంలో మతాన్ని గురించిన వలసవాదుల దృక్పథానికి కొనసాగింపుగా ఉండటం ఒక కారణం. ఆ మత జాతీయవాదాలే నేడు భారత దేశ చిత్రపటాన్ని మత సంబంధమైన చిత్రపటంగా చేసాయి. వందేళ్ళ క్రితం అలాంటి జాతీయవాద బృందాలు రెండే ఉండేవి. ముస్లింలీగ్, హిందూ మహాసభ. రాజకీయ సమీకరణ కోసం మతాన్ని భావజాలంగా వాడుకుంటున్న నేటి పరిస్థితితో పోల్చితే బహుశా ఈ రెండింటి మతమౌఢ్యం స్వల్పమైనదే. ప్రస్తుతం హిందూ, ముస్లిం, సిక్కు తదితర మత నిర్మాణాలన్నీ మత సంబంధమైన జాతీయవాదంలో భాగస్వాములయ్యాయి. వాటికి రాజకీయమైన కోర్కెలున్నాయి. తమ మతాలకు చెందిన ప్రజలను తమ గుప్పిట్లో ఉంచుకోవటానికి అవి చట్టాలపై తమ అజమాయిషీ కొనసాగించాలనుకుంటున్నాయి. చరిత్రలో అవి భాగస్వామ్యం కాలేదు. ఎవరి చరిత్ర వాళ్ళదే అయ్యింది. అది పరస్పర సంఘర్షణకు గోదాగా మారింది.

తొలికాలం నుండి భారత సమాజంలో భాగంగా మతం పనిచేసిన పద్ధతి నిజంగా ఇదేనా? అని మనం ప్రశ్నించాలి. లేదా మన గతం గురించి, మన తొలినాళ్ళ సాంఘిక వ్యవస్థలో మతం పాత్ర గురించి మనం విశ్లేషణాత్మకంగా పరిశీలన జరపలేదా? ఈ నిర్మాణాలు ఏ రూపాలు తీసుకున్నాయి, అధికారాన్ని ఎలా చెలాయించాయి? సమాజంలోని ఏ సెక్షన్‌లు ఎలాంటి సంస్థలకు

మద్దతునిచ్చాయి అనే అంశాన్ని మనం ఎందుకు పరిశీలించకూడదు.

భారతదేశంలో మతాలకు సంబంధించిన చారిత్రక దృశ్యం సీదా సాదాగా లేదు. అది సంక్లిష్టమైనది. మనం పరిశీలించాల్సిన రెండు జతల సంబంధాలున్నాయని నేను అనుకుంటున్నాను. 1. మతం - సమాజం మధ్య పరస్పర చర్య. మత బృందాలు ఏకశిల వంటి బృందాలుగా కాక అనేక రకాల శాఖలుగా (sects) ఉండేవి. కులం సామాజిక లింక్‌గా పనిచేసింది. అది వర్ణ, జాతి, జాత్ అనే భిన్న రూపాలలో ఉండేది. తెగకు, కులానికి ఉన్న సంబంధం మత శాఖకు, రాజ్యానికి ఉండే సంబంధాన్ని ప్రభావితం చేసింది. ఈ శాఖలన్నింటిని ఒకే నిర్మాణంలోకి తీసుకురావటానికి చర్చ వంటిది ఆ సమాజంలో లేదు. రాజ్యం వివిధ తెగలతో సంబంధాలతో కలిసి రావటంతో వాటి మధ్య బాంధవ్యం భిన్నంగా ఉండేది.

వివిధ మత శాఖలకు, కులాలకు మధ్యనున్న సంబంధమే భారతదేశంలో అతిముఖ్యమైన సంబంధం. శాఖ విశ్వాసాలని ప్రచారం చేసేది. కులం తరచుగా దాని సాంఘిక నేపథ్యాన్ని నిర్ణయించేది. ఆ రెండింటి మధ్య ఉండే అంతస్సంబంధం ద్వారా హోదా నిర్ణయించబడేది. వివిధ మతాలలో ఉన్నత కులాలు - అవి కుల పరిమితులను అమలు పరిచినా, లేకపోయినా - మత సంబంధమైన, సాధారణంగా పుస్తకాల్లో పేర్కొన్న లాంఛన ప్రాయమైన మత వ్యక్తీకరణలతో సన్నిహిత సంబంధం కలిగి ఉండేవి. అదే సమయంలో సంఖ్యలో అత్యధికంగా ఉన్న కింది కులాలు వాటి మత గుర్తింపులలో సరళంగా ఉండేవి. చదువుకున్నట్లుగా, చట్టం తెలిసినట్లుగా భావించబడుతున్న వ్యక్తుల నిర్వహణలో అమలవుతున్న సాంఘిక నియమాలను కులం నిర్ణయించేది. మత గ్రంథాలుగాని, సూత్రాల మూలాధారాలుగాని తెలిసిన వాళ్ళు కొద్దిమందే ఉండేవారు. చాలా మంది వినికిడిని బట్టి, నిత్యజీవితంలో తను అనుభవాలను బట్టి, జానపదాలను బట్టి సామాజిక నీతిని గ్రహించేవారు. మతం చెబుతున్నట్లుగా ఈ న్యాయ సంహితలన్నీ దైవ దత్తాలు కావు. వాటిని మానవులే రూపొందించారు. సాంఘిక నియమాలపై కులానికి, తెగకు ఉన్న అధికారాన్ని తొలగించి వర్తమానంలో అందరికీ వర్తించే ఉమ్మడి పౌరస్మృతిని రూపొందించుకోవాలి. ఇలా చేయాలంటే పౌరన్యాయం లౌకికంగా ఉండేటట్లు, సామాజిక న్యాయానికి అనుకూలంగా ఉండేటట్లు చూడాలి. ఈ రెండూ విలువలుగా ప్రసిద్ధి పొందితేగాని సాంఘిక వ్యవస్థలో వీటిని అమలుపరచటం సాధ్యం కాదు.

లాంఛనప్రాయమైన మతానికీ, ఆచరించబడుతున్న మతానికి మధ్య వ్యత్యాసం ఉన్నది. లాంఛనప్రాయమైన మతం, మత గ్రంథాలపైన, మన పెద్దలు నిర్ణయించిన పూజలు, పునస్కారాలపైన ఎక్కువగా ఆధారపడుతుంది. అంతేగాక వీటినుండి తలయెత్తి, ప్రజల జీవన విధానానికి సంబంధించిన అంశాలల్లో అధికార కేంద్రాలుగా రూపొందిన నిర్మాణాల పైన కూడా అది ఎక్కువగా ఆధారపడి ఉంటుంది. మరోపక్క, ఆచరించబడుతున్న మతం మతగ్రంథాలపైన, ప్రచార సంస్థలపైన తక్కువ ఆధారపడుతున్నది. బోధన, ప్రార్థన వంటి అంశాలలో మౌఖిక సాంప్రదాయాల మీద ఎక్కువగా ఆధారపడుతుంది. ఎక్కువ మంది ఈ రెండో రకమైన మత రూపాన్నే అవలంబిస్తున్నారు.

భారతదేశ సామాజిక చరిత్రలో ఈ రెండో మత రూపమే మొదటి దానికంటే ఎక్కువగా అమలులో ఉండేది. మొదటిది రాజకీయ స్థాయిలో ప్రముఖంగా ఉండేది. దానికి సంబంధించిన అంశాలు రాజాస్థాన గ్రంథాల్లోను, శిలా శాసనాల్లోను, మత గ్రంథాలలోను ఉండేవి. దానికి రాజకీయ గుర్తింపు ఉండేది. మతం గురించిన ఆధునిక పరిశోధనలు ఈ రెండు రకాల మత రూపాల మధ్య తేడా గురించిగాని, వాటిల్లో ప్రజామోదం పొందిన వాటి గురించిగాని తగినంతగా పట్టించుకోలేదు. సాధారణంగా మొదటి రకమే (లాంఛనప్రాయమైనది) మతానికి ప్రతినిధిగా గుర్తించబడినది. మతానికున్న రెండో రూపం గొప్ప ప్రాధాన్యతను చరిత్రకారులు గుర్తించటం ఇప్పుడే ప్రారంభమైనది.

### గత వెయ్యి సంవత్సరాలలో భారతదేశ చరిత్ర:

మధ్య యుగంగా భావించబడుతున్న గత వెయ్యి సంవత్సరాల భారత చరిత్రను మత తీవ్రవాదులు, రాజకీయ నాయకులు స క్రమంగా పట్టించుకోక "మనం బానిసలం" అని ఆ దశను వర్ణించారు. ఈ వ్యాఖ్య చేయటంలో వాళ్ళ ఉద్దేశం ఏమిటంటే ఆ మొత్తం దశ అంతా హిందూ ప్రజలు ఇస్లామ్ పాలకుల నియంతృత్వం కింద ఒకే రకంగా అణచివేయబడ్డారని చెప్పడమే. కాని చారిత్రకంగా పరిశీలిస్తే వివిధ స్థాయిలలో దృశ్యం భిన్నంగా ఉన్నది. ఇప్పుడు దేన్నయితే మనం హిందూయిజం, ఇస్లామ్ అని అంటున్నామో వాటి మధ్య సంబంధాలు ఒకే రకంగా లేవు. ఆ కాలంలో పరస్పరం పోటీ పడుతున్న రాజకీయాలు ఈ రెండు మతాల మధ్య ఘర్షణల రూపాలలో వ్యక్తమయ్యాయి. సమాజపు ఉన్నత స్థాయిలలో నెలకొని ఉన్న రాజకీయాధికారాలలో మార్పు వస్తున్నప్పుడు, ముఖ్యంగా ఈ దశల్లో కొత్త భాషను, మతాన్ని, సంస్కృతిని ప్రవేశపెడుతున్న సమయాలలో, ప్రారంభ దినాల్లో ఇలాంటి ఘర్షణలు ఊహించదగినవే. బ్రాహ్మణులకు, శ్రమణులకు మధ్య ఘర్షణలకు ప్రసిద్ధి పొందిన భారతదేశంలో ఇలాంటి విఘాతాలు, ఘర్షణలు కొత్త కాదు. పైగా భారత ఉపఖండం అంతటా ఇవి ఒకే రకంగా లేవు. . దానిలో భాగస్వాములైన బృందాలను బట్టి, ఆ ఘర్షణలు ఎపుడు ఎక్కడ ఎందుకు ప్రారంభమైనవనే దాన్ని బట్టి వాటిలో వ్యత్యాసాలున్నాయి. ఇతర ప్రాంతాల నుంచి, పూర్తిగా బయటి వారైన వలసదారులు దేశంలోకి రావటం కూడా కొత్త అనుభవం కాదు. అప్పటికీ సరిహద్దు ప్రాంతాలలోకి, నదీతీర ప్రాంతాలలోకి పశ్చిమాసియా నుండి, మధ్య ఆసియా నుండి వ్యాపారులు, వలసదారులు వచ్చి ఉన్నారు. ఆ కాలంలోని అనిశ్చితత్వం క్రమంగా తొలిగిపోయి స్థిరత్వం ప్రారంభమైనది.

ఈ బృందాల మధ్య తొలి ఘర్షణలు కొనసాగాయి. వీటికి కొత్తవి జత అయ్యాయి. ఏ చారిత్రక దశలోనూ ఇది అనూహ్యం కాదు. ఆ దశలో 'మనం బానిసలం' అని తొందరపడి అంటున్నవాళ్ళు, ఆ కాలంలో అమలైన అణచివేత భరింపశక్యం కాదని అంటూ వర్ణిస్తున్న వాళ్ళు ఒక అంశాన్ని మర్చిపోతున్నారు. ఆ సమయంలోనే భారత సంస్కృతి పలు పార్శ్వాలలో

సృజనాత్మకంగా, సంపద్వంతమైనది. ఆ సృజనాత్మకతను మనం మనలో భాగం చేసుకొన్నాం. సొంతం చేసుకున్నాం, వాస్తవంగా దాన్ని గౌరవించుకుంటున్నాం. కాని దాని మూలాన్ని పట్టించుకోవటం లేదు. ఇది రెండు రూపాలలో ఉన్నది.

వాటిల్లో మొదటిది 'ఉమ్మడి సంస్కృతి'. దీని గురించి చరిత్రకారులు తరచుగా చర్చించి దానికి ఆ పేరు పెట్టారు. ఈ రోజు మనం హిందూ, ముస్లిం తెగలుగా పిలుస్తున్న వాటి మధ్య పరస్పర ఆదాన ప్రదానాల ఫలితంగా, వివిధ రూపాల సాంస్కృతిక వ్యక్తీకరణల ద్వారా ఇది రూపొందింది. భాష, సాంస్కృతిక సామెతలు, సాంప్రదాయక న్యాయం, ప్రార్థనా రూపాల వంటి అనేక రూపాలలో ఇది వ్యక్తమయింది. ఇది అగ్రకులాలలో మరింత ఎక్కువగా కనపడుతుంది గాని ఇతరులు దాన్ని బహుశా మరింత ప్రశాంతంగా అంతర్లీనం చేసుకున్నారు.

రెండో రూపం ఏమిటంటే జ్ఞాన వ్యవస్థలలోను, సాంస్కృతిక రూపాలలోను జరిగిన పునరుజ్జీవనం. ఇది గతం నుండి తీసుకుని మరింత శక్తివంతమైన కొత్త రూపాలను సంతరించుకున్నది. ఈ రెండవది కూడా మొదటి రూపంతో సమాన ప్రాధాన్యత కలిగింది. తీవ్రమైన అణచివేతకు గురై గత వెయ్యి సంవత్సరాలలో దాదాపుగా అదృశ్యమయిపోయిందనుకున్న సాంప్రదాయానికి సంబంధించి కొన్ని ఉదాహరణలిస్తాను. ఆ కాలంలోని సజీవమైన మేథోపరమైన స్థితి గురించి, సంస్కృతం, పర్షియన్ భాషలలో రేకెత్తిన ఆలోచనలను, రచనలను, ప్రాంతీయ భాషల్లో వెలువడిన రచనలను క్లుప్తంగా పరిశీలిద్దాం. వీటిల్లోని జీవత్వం అంతకు ముందు కాలం కంటే ఏ మాత్రం తీసిపోయింది కాదు. అయితే వ్యక్తీకరణ రూపాలు మారాయి. మన కాలంలో దేన్నయితే హిందూగా గుర్తిస్తున్నామో దానికి సంబంధించిన (అన్నీ కాకపోయినా) అంశాలకు అదొక రూపాన్ని ఇచ్చింది.

హిందూ, ముస్లిం సంస్కృతుల, మతాల మధ్య ఆదాన ప్రదానాలను కాసేపు పక్కనపెట్టినా అణచివేతకు గురైందనుకొన్న సాంప్రదాయంలో కార్యకలాపాలు కూడా గణించదగ్గవే. క్రీ.శ. రెండవ శతాబ్దం అంతటా కాశ్మీర్ నుండి కేరళ వరకు వేదాల నుండి ప్రారంభించి అనేక బ్రాహ్మణీయ మత పుస్తకాలపై మేధోవంతమైన వ్యాఖ్యానాల సంస్కృతిలో వెలువడ్డాయి. ఎవరి పోషణ లేకుండా ఇది జరిగి ఉండేది కాదు. రామాయణం, మహాభారతాలకు సంస్కృతంలోని పద్య రచనలకు, నాటకాలకు ఆ కాలంలోనే వివిధ దృక్పథాలతో కూడిన వ్యాఖ్యానాలు వెలువడ్డాయి.

తత్వవేత్తలు గతానికి చెందిన తాత్విక వర్రాలను క్లుప్తీకరించారు. వారి మధ్య నూతన తాత్విక సిద్ధాంతాల గురించిన చర్చలు కూడా జరిగాయి. 14వ శతాబ్దంలో మాధవాచార్య రచించిన సర్వేదర్శన సంగ్రహ ఆ చర్చలన్నింటిని క్రోడీకరించింది. అందులోనే మొదటి అధ్యాయంలో చార్వాకుడి భౌతికవాద చింతనను విశదీకరిస్తూ దీని పట్ల చాలా మంది ప్రజలలో సానుభూతి ఉంది కాబట్టి దీన్ని నిర్మూలించడం సాధ్యం కాదని రచయిత పేర్కొన్నారు. ఆ కాలంలోనే అద్వైత వేదాంతం గురించిన పలు చర్చలు జరిగి రచనలు వెలువడ్డాయి.

రాజాస్థాన్ సాహిత్యానికి భిన్నంగా జానపద కవులు, గాయకులు ప్రత్యామ్నాయ చరిత్రను గానం చేయడం ద్వారా ప్రజా బాహుళ్యంలోకి తీసుకెళ్ళారు. భక్తి ఉద్యమకారులు కీర్తలను ఉపఖండం అంతటా ఆలపించేవారు. అది ఈ రోజున దేన్నయితే హిందూయిజం అనిపిలుస్తున్నామో దానికి పునాది. హిందూయిజంలో విశ్వాసాలు, దైవ ప్రార్థనలకు సంబంధించిన అంశాలను రూపొందించటంలో సంత సాంప్రదాయం బలమైన శక్తిగా నిలిచింది. గత వెయ్యి సంవత్సరాలలో ఈ సాంప్రదాయం పరిణామ క్రమంలో రూపొందింది.

**కులం, మత మార్పిడి**

హిందువులు బానిసలుగా ఉన్నారు కాబట్టి బలవంతంగా వాళ్ళని ఇస్లాంలోకి తేలికగా మార్చివేయగలిగారన్న ఒక అభిప్రాయాన్ని సృష్టించారు. కానీ ఈ రెండు ప్రతిపాదనలని (హిందువులు బానిసలు కావడం, ఆ మతమార్పిడులు తేలికగా జరగటం - అను) బలపరిచే చారిత్రక సాక్ష్యమేదీ లేదు. ఒక హిందుత్వ తెగ నుండి ముస్లిం తెగలోకి మార్పిడి జరిగినా, తెగలు కులాలు జమిలిగా ఉండేవనే అంశాన్ని మనం దృష్టిలో పెట్టుకోవాలి. పెద్ద సంఖ్యలో బలవంతపు మార్పిడులు జరిగాయని, చాలా మంది భౌతికంగా నిర్మూలించబడ్డారని సుల్తాన్‌ల ఆస్థాన సాహిత్యం చెబుతున్నది. కొంత మందిని బలవంతంగా మత మార్పిడి చేసి ఉండవచ్చు. లేదా సాధారణంగా దురాక్రమణ సైన్యాలు చేసేటట్లుగా కొంత మందిని చంపి ఉండవచ్చును. కాని ఆ రచనల్లో పేర్కొన్నట్లుగా ఒకేసారి 50 వేల మందిని చంపి ఉండటం ఖచ్చితంగా జరిగి ఉండదు. ఎవరు ఖచ్చితంగా మత మార్పిడులకి గురి అయ్యారని మనం ప్రశ్నించాలి. ఈ దేశంలోని బ్రాహ్మణ, శ్రమణ మత తెగల మధ్య మార్పిడిలు లేవు. మతమార్పిడి అనే ఆలోచనే విదేశీయమైన సమాజంలో, మత మార్పిడి అంటే ఏమిటో కూడా మనం ప్రశ్నించాలి.

దీనికి సంబంధించిన సాక్ష్యాలున్న మత తెగలు, కులాలపై దృష్టికేంద్రీకరిస్తే మత మార్పిడులపై మన అవగాహన సూక్ష్మంగా ఉంటుంది. ఉనికిలో ఉన్న ఏ కులం లేదా ఏ తెగ ఇస్లామ్‌లో ఏ తెగలోకి మార్పిడి చెందింది? దాని సాంఘిక పర్యవసానాలు ఏమిటి? హిందువులు ముస్లిమ్‌లుగా మతాంతరీకరణ చెందారని ఊరికే చెప్పటం కంటే వీటి గురించి ఆలోచిస్తే విలువైన వివరాలు అందుతాయి.

కొద్ది సంఖ్యలో జరిగిన వ్యక్తుల మత మార్పిడిలో అత్యధికం అగ్రకులాలలో జరిగినవే. వీళ్ళల్లో చాలామంది వాళ్ళ హోదాను కాపాడటం కోసం వాళ్ళ కుల అస్తిత్వాన్ని అట్లానే ఉంచుకున్నారు. కొన్ని స్థానిక పరిపాలనా కుటుంబాలు మతం మార్చుకున్నాయి. కొన్ని కుటుంబాలు మతం మార్చుకోక పోయినా ముస్లిం పాలనా కుటుంబాలతో వైవాహిక సంబంధాలు ఏర్పరచుకున్నాయి. మొఘల్ పాలకులు రాజపుత్ర రాజ కుటుంబాల స్త్రీలను వివాహం చేసుకున్నారు. అయితే ఆ మహిళలు ఇస్లాంలోకి మారాల్సిన అవసరం లేదు. రాజకీయంగా సంక్లిష్టంగా ఉన్న ఆనాటి స్థితిలో ఇలాంటి రాజీలు జరిగేవన్న దానికి ఇది సూచిక. మొఘల్ - రాజపుత్ర వారసత్వం షాజహాన్‌కు ప్రయోజనకరంగా ఉండేది.

ఒక జాతి లేదా కులం, మతాన్ని మార్పిడి చేసుకున్నప్పుడే మతాంతీకరణ పెద్ద సంఖ్యలో జరిగింది. మతం మారితే మరింత ఉన్నతమైన హోదా లభిస్తుందన్న వాగ్దానం ఫలితంగా ఇలాంటి మార్పిడులు కింది కులాలలో తరుచుగా జరిగాయి. కాని అలాంటి వాళ్ళు ఎక్కడా తాము అనుకున్న హోదాను సంపాదించుకో లేకపోయారు. కులాల హోదా మొత్తంగా మారటం అంటే అది ఒక పెద్ద సాంఘిక అల్లకల్లోలమే.

చాలా సందర్భాలలో జరిగినట్లుగా మతమార్పిడి చేసుకున్న కులం ఆ తర్వాత కూడా తన కుల నామాన్నీ, వృత్తినీ కొనసాగించినపుడు మార్పిడి ఫలితంగా వచ్చే సామాజిక ప్రయోజనం చాలా పరిమితం. కొత్త మతంలో కూడా హోదా ఇంతకు ముందు వలే వృత్తి మీద ఆధారపడి ఉండేది. నిచ్చెనమెట్ల వ్యవస్థలో అది మార్పిడికి ముందు ఎక్కడ ఉందో ఇప్పుడూ అక్కడే ఉంది. కుల వ్యవస్థలో ఏదైనా మార్పు వచ్చిందా అన్నది అర్థం చేసుకోవటానికి వివాహ సంబంధాలను పరిశీలించాలి. ఈ పరిశీలనలో స్పష్టంగా తేలేది ఏమిటంటే, ఈ అంశంలో కులనియమాలు మతమార్పిడి తరువాత కూడా యధాతథంగా కొనసాగాయి. హిందూయేతర సమాజాలు కూడా భారతదేశంలో కుల వ్యవస్థ రూపంలోనే పనిచేసాయని సామాజిక శాస్త్రవేత్తలు పేర్కొన్నారు. తాము మానవులందరినీ సమానంగా చూస్తామని చెప్పుకున్న కులాలు కూడా కుల వ్యత్యాసాలను - ముఖ్యంగా ఉన్నత, నిమ్న కులాల మధ్య - పూర్తిగా నిర్మూలించలేకపోయాయి. స్వకులంలో వివాహాలు విస్తృతంగా ఉండేవి. దళితుల్ని వేరు చేయటంలోను, వాళ్ళ పట్ల వివక్షతను పాటించటంలోను కులం, కుల వ్యవస్థ ప్రత్యేకించి శక్తివంతంగా ఉండేవి. ప్రతి మతంలోను సమాజం నుంచి దూరం చేయబడ్డ దళితులు వేరు వేరు పేర్లతో ఉండేవారు. దేవుడి దృష్టిలో మానవులందరూ సమానులే అని చెప్పిన మతాలలో కూడా దళితులున్నారు. ఇప్పటి వరకు హిందూ మతానికే పరిమితమైన దళితులు 'పాస్మండులు' అనే పేరుతో ముస్లిం కులాల్లోను, 'మహజబీలు' అనే పేరుతో సిక్కులలోను, 'చూరాన్' అనే పేరుతో ఇతరులలోను ఏర్పడ్డారు. వాళ్ళ ప్రార్థనాలయాలు కూడా వేరుగా ఉండేవి.

భారత దేశంలో మతం, అది భారతదేశంలో పుట్టినదైనా లేక తరువాత కాలంలో బయట నుండి వచ్చినదైనా, ప్రతి సందర్భంలోనూ ధర్మ శాస్త్ర నియమాల కంటే కుల సమాజ నియమాలకు అనుకూలంగా పనిచేసాయి. కొన్ని తెగలు కావాలని వీటిని వ్యతిరేకించాయి. కాని చాలా తెగలు మౌనంగా అంగీకరించాయి. కింది కులాల పట్ల, ఇప్పుడు దళితులుగా పిలువ బడుతున్నవి, కుల సమాజానికి బయట ఉన్నవారి పట్ల, ఆదివాసీల పట్ల వివక్షత ప్రామాణిక మతాలన్నింటి స్వభావం.

అదే విధంగా మహిళలు పురుషుల కంటే సామాజికంగా తక్కువ స్థాయి కలవారనే అభిప్రాయం కూడా ఈ మతాలన్నింటికీ ఉన్న సాధారణ లక్షణం. కొద్దిపాటి మినహాయింపులతో, సమాజంలో ఉన్నత హోదా గల వ్యక్తులలో కూడా ఈ అభిప్రాయం ఉండేది. కొన్ని మతాలలో దేవతలను, తల్లి దేవతను పూజించే ఆచారం ఉన్నప్పటికీ ఈ వివక్ష కొనసాగింది. కులదేవతను కొలవటంతో పాటు 'సతి' కూడా కొనసాగింది. లౌకిక ప్రజాస్వామ్య వ్యవస్థలో లైంగిక న్యాయానికి రక్షణ కల్పిస్తూ అందరికి సమానత్వాన్ని సాధించటానికి ఉమ్మడి పౌరచట్టాలుండాలి.

భారతదేశంలోని మతాలలో బహుళత్వం ఉన్నది. అది మత శాఖ రూపంలో ఉండేది. వాటికి కులంతో సంబంధం ఉండేది. ఈ రెండిట్లో ఒకటి బలహీనపడితే రెండోది కూడా బలహీన పడుతుంది. మత సంస్థలు పౌర సమాజాన్ని అజమాయిషీ చేయకుండా దూరంగా ఉంచగలిగితే మరింత సమానత్వంతో కూడిన సమాజం ఏర్పడుతుంది. సమాజాన్ని లౌకికీకరించాలనుకునే వారు మతాన్ని, కులాన్ని కూడా దృష్టిలో ఉంచుకోవాలి. ఆ మేరకు మన దేశంలో మతం గురించిన విశ్లేషణ ఇతర దేశాల్లోని మతాల విశ్లేషణ కంటే భిన్నంగా ఉండాలి. మనం మతాల గురించి వలస వాదుల దృష్టిని అంతర్లీనం చేసుకున్నాం. ఆధిపత్య మత సంస్థలు అభివృద్ధి చెందటం దాని ఫలితమే. ఈ సంస్థలు రాజకీయ సమీకరణకు ఉపయోగపడటాన్ని కూడా మనం అంగీకరించాం. ఈ కారణంగా లౌకికీకరణ గురించి మనం సున్నితంగాను, జాగ్రత్తగాను ఆలోచించాలి. అది వేగవంతంగా జరిగే మార్పు కానప్పటికి, అందరిలోను ఆత్మ విశ్వాసాన్ని నింపుతూ ఎక్కడో ఒకచోట మన ప్రయత్నాన్ని ప్రారంభించాలి. హింసాత్మక దాడులు ఎన్నటికీ పరిష్కార మార్గాలు కావు.

లౌకిక సమాజం అన్నా, రాజ్యం అన్నా మతానికి తిలోదకాలు ఇవ్వడం కాదు. భారతీయుల మత గుర్తింపు - అది ఏ మతానికి చెందినదైనప్పటికీ - భారతీయ పౌరుడనే లౌకికవాద గుర్తింపుకు లోబడి ఉండాలి. ఈ గుర్తింపుతో వచ్చే హక్కులన్నింటికీ రాజ్యం రక్షణ కల్పించాలి. అంటే అర్థం రాజ్యం మానవ హక్కులను కల్పించటం, వాటికి రక్షణ కల్పించటం. ఇప్పుడు అలాంటి స్థితి ఉందని అనలేం. మానవ హక్కులు, సామాజిక న్యాయం, వీటికి కట్టుబడి ఉన్న ఆ గుర్తింపు, అందరికి అన్వయించే లౌకిక చట్టాలకు కూడా లోబడి ఉండాలి.

రెండు పద్ధతుల్లో దీన్ని ప్రారంభించవచ్చు. విద్య, పౌర చట్టాలు తప్పని సరిగా లౌకికంగా ఉండాలి. లౌకిక విద్య అంటే సమస్త జ్ఞానాన్ని ఎటువంటి వివక్షత లేకుండా పొందే అవకాశం కలిగి ఉండటం. విద్యలో పాఠ్యాంశాలు ఎలా ఉండాలంటే నిత్యనూతనమైన జ్ఞానాన్ని సంపాదించటానికి అవసరమైన సమాచారాన్ని అందించాలి. అదే సమయంలో ఒక అంశాన్ని విమర్శనాత్మకంగా పరిశీలించటం అంటే ఏమిటో యువత చేత అర్థం చేయించటానికి, దాన్ని అమలుపరచటానికి అవసరమైన శిక్షణ ఇవ్వాలి.

స్వాతంత్ర్యానంతరం మనం కొన్ని మార్పులు చేసుకున్నా మన చట్టాలన్నీ వలసకాలంలో తయారైనవే. మనం లౌకికంగా మారాలంటే అమలులో ఉన్న చట్టాలన్నింటినీ, అవి ఎటువంటి మినహాయింపులు లేకుండా పౌరులందరికీ సమాన హక్కులు కలిగించేటట్లు ఉన్నాయో లేదో పరిశీలించాలి. ప్రతి మతంలోనూ ఉన్న సాంఘిక నియమాల వెలుగులో పౌర చట్టాలు, మత నియమాల మధ్య ఉన్న విభేదాలను పరిష్కరించాలి. ఈ క్రమంలో మతాన్ని బట్టిగాని, లైంగికతను బట్టిగాని, కులాన్ని బట్టి గాని మైనారిటీలుగా

*(మిగతా 46వ పేజీలో...)*

# మనువు ఆదర్శం - 'రాజ్యం' లక్ష్యం

నల్లూరి రుక్మిణి

బీహార్‌లో బిజెపి ఓటమి దేశ ప్రజలకు ఎంత సంతోషాన్ని కలిగించిందో! మిగిలిన రాష్ట్రాల సంగతి తెలియదు గానీ... మా ఊళ్ళో మాత్రం చాలా మంది స్వీట్లు పంచుకున్నారు. దీపావళి పండుగ నాలుగు రోజులు ముందు వచ్చినట్టుగా ఆనందపడ్డారు.

దీనికి కారణం 'మోదీ', రాజధాని శంకుస్థానకు వచ్చి మట్టీ, నీళ్ళూ తెచ్చి ప్రత్యేక హోదా గురించి గానీ, ప్రత్యేక ప్యాకేజీ గురించి గానీ మాట్లాడకుండా మౌనంగా వెళ్ళిపోవడం ఇక్కడి ప్రజలు అవమానంగా భావించారు. బీహారు ఓటమికి మిగిలిన రాష్ట్రాలలోనూ ఇంతే సంతోషంగా ఎందుకున్నారూ?

నిజానికి బీహార్ చాలా వెనకబడ్డ రాష్ట్రం. అక్కడి ప్రజలు రాజకీయ చైతన్యంతో బిజెపిని ఓడించారా? అంటే, నిర్దిష్టంగా జవాబు చెప్పలేని స్థితే. అయినా ఇప్పటి సన్నివేశంలో ఈ ఎన్నికల ఫలితాలు దేశ ప్రజలకు బహుమతిగా అన్పిస్తోంది. బీహార్ ప్రజలు ఈ విజయానికి ఏ దృక్కోణంతో సంతోషపడుతున్నారో తెలియదుగానీ దేశంలోని పురోగామి శక్తులు, మేధావులు, మైనారిటీలు మాత్రం ఓ పెద్ద ఆపద తొలిగిపోయినట్టుగా భావిస్తున్నారు. నిజానికి ఇందులో అంత పెద్ద సందేశం, అంత భరోసా ఉందా? అనే చర్చ చాలా కీలకమైనది. అయితే దేశంలో ఇంకా వైవిధ్యానికీ, సహనానికీ, ప్రజాస్వామ్య భావజాలానికి చోటు ఉందనే ఆశ కూడా ఇందులో ఉంది. 'అఖండ్ భారత్' నినాదంతో, హిందూమతం పేరుతో ఆధిపత్య బ్రాహ్మణీయ భావజాలాన్ని ఈ దేశం మీద రుద్దే వ్యవహారం మీద ప్రజల విమర్శ ఇందులో ఉందనుకోవచ్చు.

అయితే అంత మాత్రాన ఆపద తొలిగిపోలేదు. దూకుడుకు ఓ చిన్న గులకరాయి అడ్డుపడి, ఓ క్షణం నిలవరించ గలిగింది అంతే! దేశ ప్రజల ముందు భవిష్యత్తు ప్రశ్నార్థకంగా నిలబడే ఉంది. దీన్ని ఎదుర్కోవడం ఎట్లా అన్న మీమాంస సలుపుతూనే ఉంది.

బిజేపీ, దాని మాతృసంస్థ ఆర్.ఎస్.ఎస్, దాని అనుబంధ సంస్థలైన విశ్వహిందూ పరిషత్, హిందూ వాహిని, భజరంగ్ దళ్ వంటి వాటి ఆశయం ఏమిటంటే, ఈ దేశంలో 'అఖండ' పేరుతో హిందూ మతాన్ని స్థాపించి, ఆ సాకుతో బ్రాహ్మణీయ ఆధిపత్యాన్ని స్థిరపరచి రాజ్యం ఏర్పరచాలని. పైకి చెప్పకపోయినా, చరిత్ర పొడవునా అనాది కాలం నుండి సాగుతున్న 'భావధార' ఇదే. దీనికి మతం పేరుతో అన్ని కులాల వారిని, వర్గాల వారిని కలుపుకోవడం కోసమే, హిందూ మతాన్ని ముందుకు తెచ్చారు. మోదీ వంటి సహజాతాలు లేని ఒక బిసిని ముందు పెట్టి, మనలను నమ్మించడానికి చూస్తున్నారు. అయితే వీరి ప్రణాళిక మాత్రం కౌటిల్యుని రాజ్యం, బ్రాహ్మణాధిపత్యం, దానికి మనువు ఆచరణీయం, ఆదర్శం.

ఈ బ్రాహ్మణాధిపత్యం - తాను తల నుండి పుట్టాను కనుక, అన్నీ, అందరూ తనకు సేవ చేయడం, తనకు లొంగి ఉండటం, తను చెప్పినట్లు, తన కనుసన్నలలో రాజ్యం నడపాలన్నదే తాత్పర్యం, కౌటిల్యుని అర్థశాస్త్రం నుండి, మనుధర్మశాస్త్రం వరకు చెప్పిందంతా ఇదే! ఈ రోజుకూ, మన రాజ్యానికీ, పాలకులకు ఇదే శిరోధార్యం.

అయితే ఈ భావజాలాన్ని దేశ ప్రజలు అంగీకరిస్తారా? లేదా అన్న ప్రశ్న అలా ఉండగా! అసలు ఈ భావజాలాన్ని ప్రజల్లో ఎట్లా వ్యాప్తి చెయ్యాలని చూస్తోంది? ఓట్ల ద్వారానా, సీట్ల ద్వారానా?... కానే కాదు! సంస్కృతి ద్వారా ప్రజలలో ఎక్కించాలని చూస్తోంది. అవసరమయితే 'బల ప్రయోగం' అనే చివరి అస్త్రం ఉండనే ఉందనుకోండి!

అట్లా రాజ్యానికున్న అన్ని వనరులనూ అది ఉపయోగించు కుంటుంది. ఇప్పటికే ఓ రకంగా ఈ భావజాలాన్ని సాంస్కృతికంగా, దేశ ప్రజల మనస్సులలోకి బాగానే ఇంజెక్టు చెయ్యగలిగింది. అందుకు మన కళ్ళముందు సామాన్య ప్రజల్లో పెరుగుతున్న భక్తి, దొంగ బాబాలు, గుడులు, గోపురాలు, పూజలే నిదర్శనం. టీవీలు ఆన్ చేస్తే, వాస్తు గురించి, ధనలక్ష్మి తాయెత్తుల గురించి, రంగురాళ్ళు, సంఖ్యాశాస్త్రాల గురించి ఒకటేమిటి! అనేక రకాలైన మూఢాచారాలు సమస్త ఛానళ్ళు చూపిస్తుంటాయి. ఇక భక్తి ఛానళ్ల సరేసరి. ఇటీవల ప్రభుత్వాలు - పుష్కరాల పేరుతో, శంకు స్థాపనల పేరుతో, బోనాలు, బతుకమ్మల పేరుతో లక్ష దీపారాధనలు, స్వస్థత కూటముల పేరుతో సామూహిక ఉన్మాద ప్రేరక కార్యక్రమాలు చేస్తున్నాయి. వీళ్ళకు డబ్బు వస్తుంది సరే! కానీ చూసే ప్రజలకు మూఢత్వం పెచ్చరిల్లిపోతుంది.

ఒకప్పుడు సంస్కరణోద్యమాలకు, హేతువాద, నాస్తికోద్యమాలకు ప్రభావితమైన కోస్తా ప్రాంతం ఇప్పుడెలా ఉంది? చలం, గోరా, త్రిపురనేని వంటి వారి ప్రభావం ఉండటం వల్లనే ఈ ప్రాంత ప్రజలు తరవాత కాలంలో జాతీయోద్యమం వైపు, కమ్యూనిస్టు ఉద్యమం వైపు సునాయాసంగా మరలగలిగారు. తొలిదశలో నామమాత్రంగానేనయినా దళితులను ఆలయ ప్రవేశం చేయించాలనే ప్రయత్నం, మద్య వ్యతిరేక ప్రచారాలు, కులాంతర వివాహాలు అక్కడక్కడా సాగాయి. కానీ ఆ ఉద్యమాల కాలంలోనే క్రమంగా రాజకీయాల కిచ్చిన ప్రాధాన్యత, భావజాల రంగానికివ్వక పోవడంతో ఇటువంటివన్నీ వక్కకు నెట్టబడ్డాయి. ఫలితంగా జాతీయోద్యమంలోనే మత భావాలు వేళ్ళూనుకోవడం చూస్తాం. క్రమంగా అది ఈ రోజుకు ఈ రూపం తీసుకుంది.

ప్రాచీన కాలం నుండి కూడా వేదాలు, పురాణాలు, ఉపనిషత్తులు వంటి ఎన్నో, భావజాలన్ని ప్రభావితం చేసి, మనుషుల బుద్ధినీ,

మనస్సులనూ మరిచే ప్రయత్నానికే అధిక ప్రాధాన్యత నిచ్చాయి. అందులో భాగంగా కులవ్యవస్థను పటిష్టపరిచారు. మనిషి తప్పించుకోలేని కుల వ్యవస్థ నిర్మాణమే - మన పూర్వీకులైన బ్రాహ్మణీయ మేధావుల అఖండమైన, అద్వితీయమైన, 'ప్రతిభా పాటవాలకు' నిదర్శనం. అంబేద్కర్ చెప్పిందిదే, మనుషులను విభజించారని! హిందూ మతం ప్రత్యేకత, విలక్షణత, దుర్మార్గం ఇదే!

అందుకు వారనుసరించిన పద్ధతి ఎంత క్రమబద్ధంగా ఉందో చూడాలి! కౌటిల్యుడుగానీ, మనువుగానీ మరెవరుగానీ ఏఏ అంశాలు చెప్పారూ? 'నస్త్రీస్వాతంత్ర మర్హతి' వంటి రెండు మూడు అంశాలే చెప్పారా? లేక పుట్టింది మొదలు 'కాటికి' పోయేదాకా ఆయా వర్ణాల మనుషులెలా ఉండాలో ఎలా నడవాలో శాసించారా? దాని పర్యవసానం ఇప్పుడెలా ఉందీ? అదీ మనం చూడాల్సి ఉంది. నిజానికి మనిషి అడుగడుగునీ ఏనాడో నిర్దేశించడం వల్ల - ఈ రోజు సమాజంలో 'సహజమే' అనిపించేటంతగా భారతీయ జీవనం బ్రాహ్మణీయ ఆధిపత్య భావజాల ఆచరణ కొనసాగ గలుగుతోంది. అందువల్లే ప్రజలను హిందుత్వం వైపు నడపడానికి హిందూ మత సంస్థలకు సులభతరమవుతోంది.

క్రీ. పూ. 5వ శతాబ్ది మొదలు - కాలానుగుణంగా మనుస్మృతిలో ఎప్పటికప్పుడు తమకనుకూలంగా మార్చుకుంటూ కొత్త కొత్త అంశాలను చేరుస్తూ వచ్చారు. కనుక మొదటిసారి మనువు చెప్పాడన్నదే ఇవాళ అందులో లేదు! అయితే వందల ఏళ్ళగా ఎన్ని మార్పులు జరిగినా - దాని మూలతత్వాన్ని ఇంకింత పటిష్టవంతం చెయ్యడానికే పనికి వచ్చింది తప్ప, మరొకటి కాదు.

మనుస్మృతి ద్వారా పుట్టింటి మొదలు 'పేరు' పెట్టడం, తినడం, గుడ్డలు కట్టుకోవడం చివరకు శవాలను ఎత్తివేయడం వరకు - ఏఏ వర్ణాలు ఎలా ఉండాలో, మనువు మనలను శాసించాడు. అవి ఈ రోజు కూడా సామాజిక శాసనాలుగా చెలామణి అవుతున్నాయి.

మనం పిలుచుకునే పేర్లను బట్టి మన కులం తెలిసిపోతుంది. మనువు ఏం చెప్పాడంటే "బ్రాహ్మణుల పేర్లు శుభాన్ని చూపించేవై ఉండాలి, క్షత్రియుల పేర్లు బలాన్ని తెలిపేవై ఉండాలి - బహుబలి, మహాబలి. వైశ్యుల పేర్లు సంపద సూచికంగా ఉండాలి. శూద్రుని పేర్లు వినయాన్ని, దాసత్వాన్ని చూపించేవై ఉండాలి". కనక ఇప్పటికీ శర్మ, శాస్త్రి, రెడ్డి, చౌదరి వంటి కులాల్ని తెలిపే తోకలను తగిలించుకునే తిరుగుతున్నారు. అది ఇటీవల మరింత ఎక్కువయింది. శాస్త్రి, శర్మ వంటి వాటిని కత్తిరించమని చెప్పే ధైర్యమే లేకుండాపోయింది. ఇటీవల దాకా తోకలు లేకపోయినా పేర్లను బట్టే కులాన్ని చెప్పగలిగేవాళ్ళు.

ఇక బ్రాహ్మణుడు మిగిలిన కులాలకు భిన్నంగా ఎట్లా ఉండాలి అంటాడంటే! "రెండు పూటలా సంధ్యావందనం చెయ్యాలి. అట్లా సంధ్యావందనం చెయ్యని బ్రాహ్మణుడిని 'శూద్రుడిని బహిష్కరించినట్టు' అన్ని కర్మకాండల నుండి బహిష్కరించాలన్నాడు!" అంటే బ్రాహ్మణుల జీవితాన్ని కట్టుదిట్టం చేసి కళంకం కాకుండా కాపాడేందుకు ప్రయత్నం చేశారు.

బ్రాహ్మణునికి జ్ఞానం వల్ల, క్షత్రియునికి వీరత్వం వల్ల, వైశ్యునికి సంపదవల్ల గొప్పతనం లభిస్తుందంటాడు మనువు. కనకనే పదేళ్ళ బ్రాహ్మణుడిని, నూరేళ్ళ క్షత్రియుడిని, తండ్రీకొడుకులుగా భావన చేయవలసి వస్తే - పదేళ్ళ బ్రాహ్మణ పిల్లవాడు తండ్రి స్థానం అలంకరిస్తాడు, గౌరవనీయుడవుతాడు! , ఇదీ బ్రాహ్మణులకు మనువు కల్పించిన స్థానం.

చాలా ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే, ఇంతగా సైన్సు పెరిగిందనీ, శరీర శాస్త్రం అభివృద్ధి అయిందనుకుంటున్న రోజుల్లో కూడా, ఇంకా గర్భాదాన ముహూర్తాలు పెట్టించేవారు తగిన సంఖ్యలోనే ఉన్నారు. ఆ గర్భాదాన ముహూర్తాలు పెట్టడానికి ఆధారం మన 'మను ధర్మమే'. స్త్రీ పురుషులు ఎప్పుడు ఏ రోజుల్లో కలిస్తే మగపిల్లవాడు పుడతాడో, ఎప్పుడు కలిస్తే ఆడపిల్ల పుడుతుందో లెక్కవేసి మరీ రాసిపెట్టాడు. అందువల్ల పితృకర్మలకు, పుణ్య లోకాలకు పోవడానికి మగవాడే దిక్కు. కనక, మగవాడు పుట్టేదే మంచి ముహూర్తంగా చెప్పడం తరచుగా జరుగుతుంటుంది. అట్లా పుట్టుకను కూడా అదుపులో ఉంచడానికీ ప్రయత్నం చేసాడు.

"బ్రాహ్మణేతరులెవ్వరూ బ్రాహ్మణ వృత్తితో జీవించకూడదు. హీన జాతిలో పుట్టినవాడు, ఉన్నత జాతి ధర్మాలతో జీవిస్తే, అలాంటివాడిని కనిపెట్టి రాజు వాడి సంపదనంతా తీసుకుని దేశం నుండి వెళ్ళగొట్టాలి" - అందువల్లనే పూజలు, దేవుడి గుడిలోనూ, చావులు, వ్రతాల్లో బ్రాహ్మణులే ప్రత్యక్షమవుతారు. అంటే వాళ్ళు చేసే పని మరొకరు చెయ్యరాదు. మిగిలిన జాతులన్నీ వాళ్ళకు సేవ చేయడమే లక్ష్యంగా ఉండాలి. పైగా అలాంటివాడి సంపద లాగేసుకోవాలి! ఇదీ మనుధర్మం - బ్రాహ్మణాధిపత్య ధర్మం. ఇది ధర్మబద్ధమేనని శాస్త్రాల ద్వారా నమ్మించడం శాస్త్ర ప్రామాణికతను కల్పించడం వల్ల, అది మనుషులకు దాటరానిదైంది.

దీనికి వ్యతిరేకంగా త్రిపురనేని రామస్వామి కమ్మ బ్రాహ్మలను ప్రవేశపెట్టి బ్రాహ్మణుల ఆగ్రహానికి గురయ్యాడు. అందుకే బ్రాహ్మణులకు కమ్మ వాళ్ళ మీద ఉన్న కోపం మిగిలిన కులాల మీద ఉండదు. అయితే ఈ త్రిపురనేనిగానీ, ఆయన్ను అనుసరించిన వారు గానీ, బ్రాహ్మణులను వ్యతిరేకించడం వరకు చేశారు గానీ, అదే పెత్తనాన్ని ఇతర కులాల మీద వీళ్ళూ చేశారు. ఆయా కులాలను గౌరవించ లేదు. కనకనే త్రిపురనేని వంటి వారి ఉద్యమాలు మధ్యలోనే ముగిసిపోయాయి. ఆ వైరుధ్యం అలాగే కొనసాగుతోంది.

"బ్రాహ్మణులకు విరివిగా దానం చెయ్యాలి. దానివల్ల స్వర్గాది పుణ్యలోకాలు లభిస్తాయి. బ్రాహ్మణుల సొమ్ము దొంగిలిస్తే, మరుసటి జన్మలో గద్దలు తినే ఎంగిలి కూడు తినేవాడుగా పుడతాడు!" ఇది ఎంత భయాన్ని కల్పిస్తుందీ మనిషికి. ఈ భయాన్ని మనుషులలో జీర్ణింప చెయ్యడం అవసరం వాళ్ళకు. ఎందుకంటే బ్రాహ్మణులు స్వయంగా పంట పండించలేరు, గుడ్డలు నేయలేరు, చెప్పులు కుట్టలేరు, కనుక విరివిగా దానాలు ఇస్తేనే తమ జాతికి గడుస్తుంది. కానీ అది అడుక్కోవడంగా ఉండకూడదు, జబర్దస్తీగా లాక్కోవాలి. అందుకు వారు కనిపెట్టిన మార్గం - దానాలు ఇస్తే, మీ మీ కులాలకు స్వర్గాది లోకాలు గిట్టుబాటు అవుతాయి. అక్కడ

రంభ మేనక వంటి వైభోగాలు ఉంటాయని సామాన్య జనాన్ని మాయ చేసి, సఫలీకృతమయ్యారు. ఇక శిక్షలు ఎటువంటివంటే, ఎంత తప్పు చేసినా బ్రాహ్మణులకు శిక్ష వెయ్యకూడదు. "వాళ్ళకు మరణ దండన అంటే గుండు గీయించడమే!" ఎందుకంటే బ్రాహ్మణ్ణి చంపితే మహా పాతకం వస్తుందనేది ఘోరమైన విశ్వాసం. బ్రాహ్మణులను ఎవరైనా బుద్ధిపూర్వకంగా తిట్టినా, కొట్టినా సరే వాడు 21 జన్మలు కుక్కగా పుడతాడు. పొరబాటున గాయమై బ్రాహ్మణుని దేహం నుంచి రక్తం కారితే- అది ఎన్ని చుక్కలు కింద పడుతుందో, అన్ని సంవత్సరాలు కొట్టిన వాడి రక్తం నక్కలు పీల్చుకొని చస్తాడు. మనుషులు ఇది విన్నాక బ్రాహ్మణులను ముట్టుకోవాలంటే ఎంత ధైర్యం కావాలి. చావును మించిన భయం కదా ఇది. అందువల్లే మన సాహిత్యంలోనూ క్రూరులైన రాక్షసులు కూడా బ్రాహ్మణ్ణి చంపడానికి జంకినట్లు చిత్రించారు. మరి ఈ రాజ్యాంగం వచ్చాక, ఉరిశిక్షలు బ్రాహ్మణులకు పడ్డాయో? లేదో?

మిగిలిన వర్ణాల కంటే శూద్రవర్ణాన్ని అణిచిపెట్టడానికి, మనువు అనేక రకాలైన ఆంక్షలు విధించాడు. వేదాలు వినకూడదనే వాడు, ఆస్తి కలిగి ఉండటాన్ని అంగీకరిస్తాడా? శూద్రుడు కాలితో తంతే, చేతితో కొడితే! ఆ అవయవాలను నరికి వెయ్యాలి. అట్లా శూద్రుడిని కఠినతరమైన శిక్షలతో అణిచి ఉంచాలని మిగిలిన వారిని ప్రోత్సహించాడు.

ఏదైనా నిధి దొరికితే, మిగిలిన వర్ణాలు - అంటే క్షత్రియ, వైశ్యుల నుండి ఆ నిధిని తీసుకొని కొంత రాజు ఉంచుకుని, మిగిలింది దొరికిన వారికే ఇవ్వాలి. అలాంటి నిధే బ్రాహ్మణునికి దొరికితే! అది రాజుకు ఇవ్వనక్కరలేదు. అసలు రాజు అడగకూడదు. ఆ నిధే శూద్రుడికి దొరికితే, అది మొత్తం రాజు తీసేసుకోవాలి. శూద్రుడికి సంపద ఉంచుకునే హక్కులేదు. సంపదే కాదు శూద్రుడి జీవితంపై సర్వహక్కులూ పై వర్ణాల వారికి ఉంటుంది. వాడి శరీరం వాడిది కాదు.

తరచుగా ప్రశస్తంగా మనం వినే - "ధర్మో రక్షిత రక్షితః" అంతరార్థమిదే. మనువు ఆనాడు చెప్పిన 'ధర్మాలను' కాపాడమని, పై వాక్యం కూడా చెప్పాడు. అంటే రాజులు ఎల్లవేళలా చాతుర్వర్ణ ధర్మాన్ని కాపాడటానికి కంకణబద్ధులై ఉండాలి. అప్పుడు ఆ ధర్మం వారిని కాపాడుతుంది. అంతేగాని అందరినీ సమానంగా కాపాడటానికి మాత్రం కాదు.

అది ఎంత దూరం పోయిందంటే బ్రాహ్మణుడి శవాన్ని కూడా శూద్రుడు ముట్టుకోరాదు. అదలా ఉంచి ఏఏ వర్ణాల శవాలు ఏ దిక్కుగా తీసుకుపోవాలో కూడా చెప్పాడు. అందరి శవాలూ ఆ మట్టిలోనే కలిసిపోతాయి అయినా పై వర్ణాల వారి శవాలను సహితం ఎంత గౌరవప్రదంగా తీసుకుపోవాలో నిబంధనలు విధించాడు. దాని ఫలితంగానే దళితులు హిందూ దేవుడి విగ్రహాలనైనా సరే గ్రామంలో నుండి తీసుకుపోకూడదని యుద్ధాలు చేయడం మనకు తెలిసిందే! ఇక శవాలకు దిక్కెక్కడ?

"రాజు పెడితే ఆ అన్నం తిన్నాడంటే, తేజస్సునీ, శూద్రాన్నం బ్రహ్మ వర్చస్సునూ, చెప్పులు కుట్టేవాడి అన్నం కీర్తిని నశింపచేస్తాయి" కనుక వీరు పెట్టినా, అన్నం తినరాదు, అయితే సంభావన పుచ్చుకుని వారే వండుకుని తినవచ్చు. దానికి లోటు లేదు. మనువు చెప్పినవన్నీ ఈనాటికీ తూచా తప్పకుండా పాటిస్తున్నవారు బ్రాహ్మణులే. వారిదే ఆ గ్రంథం.

"గృహస్థుడు అంటే మగవాడు - రోలు, రోకలి, చాట, నీళ్ళ కడవ, అలుకు గుడ్డ ముట్టుకుంటే ఐదు హత్యలు చేసినంత పాపం పొందుతాడు" - అందుకే పురుషులు నీళ్ళు తీసుకురావడం, వంట చెయ్యడం నిషిద్ధం. స్త్రీలు కూడా మగవాళ్ళు ఆ పని చేస్తే తమకు పాపం వస్తుందనుకుంటారు. ఈ పాపం పోవాలంటే పంచయజ్ఞాలు చెయ్యాలి. యజ్ఞాలు చేసి వారికి, సుష్టిగా, పుష్టిగా తినబెట్టాలి, దానాలివ్వాలి. కానీ చాలా విచిత్రంగా ఆడవాళ్ళ బహిష్టుకాలంలో వారిని దూరంగా వుంచి బ్రాహ్మణ ఇళ్ళల్లో మగవాళ్లు వంట చెయ్యడం, అనవాయితీగా ఉంది. బ్రాహ్మణులు వంటవాళ్ళుగా కూడా ప్రసిద్ధమే. ఈ పరిణామం ఎలా, ఎందుకు జరిగిందీ? ఆలోచించ దగ్గ విషయం. బహుశ ఇక్కడ 'అంటు' అనేది వ్యవహారంలో అధిగమించింది కావచ్చు. కానీ ఈ నిబంధన స్త్రీ జాతికంతటికీ శాశ్వతమైన శిక్షగా మారింది.

మనువు ఒక చోట - 'మాసికశ్రాద్ధం'లో ప్రశస్తమైన మాంసం పెట్టాలంటాడు. అప్పటికి మాంసాహారం బ్రాహ్మణులకు కూడా తిండి పదార్థంగానే ఉంది. ఆ మాంసాలు కూడా ఏ ఏ రకాల మాంసాలు పెడితే పితృదేవతలు సంతోషిస్తారో వివరంగానే చెప్పాడు పాపం! గొర్రె, చేపలు, జింక, కృష్ణమృగం, దుప్పి వంటి మాంసాలు పెడితే, ఆ రకాలను బట్టి అన్నన్ని నెలలూ పితృదేవతలు తృప్తి చెందుతారంటాడు. కింద తిన్న వీళ్ళ తృప్తే - పైన వాళ్ళకు కూడా నన్నమాట. వింతేమిటంటే శ్రాద్ధకర్మల్లో మాంసాహారాన్ని పెట్టవచ్చని చెప్పినవారే... మాంసం తినే వారిని శూద్రులని, అంటరాని వారని, హీనపరుస్తూ వచ్చి ఇప్పటికి చివరకి 'బీఫ్' తినేవారిని చంపేదాకా హింసావాదులుగా తయారయ్యారు.

'శూద్రుడు వేదాలను వినరాదనే ఆంక్షను గురించి మనం ఎప్పటి నుండో వింటున్నాం. అదేగాక ఎవరైనా బుద్ధిపూర్వకంగా 'పాపం' అని జాలి తలచి శూద్రుడికి ధర్మోపదేశం చేశారంటే - వారు నరకం అనుభవిస్తాడు.

అసలు శూద్రుడు పరిపాలిస్తున్న రాజ్యంలో ఉండరాదు.

అర్థశాస్త్రాన్ని శూద్రుడికి చెప్పరాదు.

రాజు వేదాలు చదువుకున్న బ్రాహ్మణుని పూజించాలి. వారు చెప్పినట్టే నడుచుకోవాలి. బ్రాహ్మణులను పూజించని వాడు రాక్షసులకు పూజ్యుడవుతాడు. ఎంత సంపద ఉన్నా వారిని పూజించని రాజు నాశనమవుతాడు. ఏమీ లేక అడవులలో ఉన్నా వీరి అనుగ్రహం ఉంటే రాజ్యాన్ని పొందుతాడు. అందుకే రాముడు గానీ, పాండవులు గానీ అరణ్యాలలో ఉన్నా బ్రాహ్మణుల కనుసన్నలలోనే మెలిగారు.

రాజు కాలకృత్యాలు తీర్చుకున్న వెంటనే, బ్రాహ్మణుడు మొదటిగా పూజ చేసిన తరవాతే సభా భవనానికి పోవాలి. ఎవడి రాజ్యం శూద్రులతో నిండి, దేవుడు లేడని వాదించే నాస్తికులతో

కూడి ఉంటుందో, బ్రాహ్మణులు లేనిదై ఉంటుందో ఆ రాజ్యం కరువు కాటకాలతో, రోగాలతో నశిస్తుంది.

బ్రాహ్మణులు దేవతలను కూడ శపించగలరు. వారు నీచకార్యాలు చేసినా పూజనీయులు, ఎలాగంటే! , "అగ్ని శవాన్ని దహించినా అపవిత్రం కానట్టుగా".

రాజు ముసలి తనంలో 'ధనం' బ్రాహ్మణులకిచ్చి, రాజ్యం కొడుకులకు అప్పగించాలి.

"యజ్ఞ సంబంధమైన ఏ వస్తువైనా శూద్రుడి ఇంట ఉంటే, దానిని అడిగి తీసుకోరాదు. చెప్పకుండా తీసుకురావాలి".

ఇట్లా మనుధర్మ శాస్త్రం మన కుటుంబాలను, సమాజాన్ని, ఆచారాలను, సంబంధ బాంధవ్యాలను కంట్రోల్ చేసింది. మనం ఈ రోజు ప్రవర్తనల పేరుతో, మంచి నడవడికల పేరుతో ఆచరిస్తున్నవన్నీ చాలా వరకు ఆనాడు గీచిన గీతలే!

మనువు కాలం నుండి ఈ రోజుకు ఎంతో మార్పు వచ్చిందనుకున్నా వాటిలోని మూలసారం మారకపోగా, క్రమంగా మిగిలిన శూద్రకులాలు అదే భావజాలాన్ని పుణికి పుచ్చుకుని ఎవరికి వారే ఆధిపత్యాన్ని ప్రదర్శిస్తూ కింది వాళ్ళను అణగదొక్కే స్థాయికి ఎగబాకారు.

అయితే ఇదంతా ఇప్పుడెక్కడుంది? బ్రాహ్మణుల్లో ఎంతమంది పేదవాళ్ళు లేరూ? ఈ రోజు వాళ్ళ స్థితి దయనీయంగా ఉంది కదా! అనే మాట తరచుగా వింటుంటాం.

నిజానికి అన్ని కులాలల్లో అంతే పేదరికం అనుభవిస్తున్న వాళ్ళు ఎందరో ఉన్నారు. ముస్లింలలో, దళితుల్లో చదువుకుని అంతో ఇంతో కలిగిన వారి శాతం అతి తక్కువగానే ఉంది. చాలా మంది సైకిల్ షాపుల్లో మెకానిక్‌లుగా, టైలర్లుగా, కరెంటు పని చేస్తూ, రోడ్లు ఊడుస్తూ బతుకుతున్నారు. పట్టణాల్లో ఇరుకు సందుల్లో, కంపుకొట్టే మురుగు నీటి మధ్య నివాసాలు ఉండేవాళ్ళు వీళ్ళే! కానీ అదంతా వారికి సహజమేనన్నట్టుగా, పెద్దగా బాధపడరు. కానీ ఓ బ్రాహ్మణుడు లేదా అగ్రకులంవాడు ఇలాంటి పనులు చేస్తుంటే జాలిపడతారు. బాధపడతారు. అయినా ఎంత పేదరికంలో నయినా ఏ బ్రాహ్మణుడూ పై పనులేవీ చెయ్యడు. సమాజం చెయ్యనివ్వదు. మరి ఈ తారతమ్యం ఎట్లా పుట్టి, స్థిరపడింది? ఇది సహజమేనన్నట్టు ఎట్లా భావించు కుంటున్నారు? ఈ భావజాలం సమాజంలో పాతుకుపోవడానికి పనిచేసిన విధం ఏమిటీ?

దీని గురించి ఆలోచించాలి.

మా ఇంటి దగ్గరలో గుడి ఉంది. గుడిలో తుమ్మినా, దగ్గినా మాకు వినిపిస్తుంది. ఆ గుడి పూజారి జీతానికి పనిచేసేవాడే కానీ, కార్తీక మాసాల సమారాధనలు, బ్రహ్మోత్సవాలనీ, పండగలప్పుడూ సామూహిక పూజలు నిర్వహిస్తుంటారు. మా కాలనీ ఆడవాళ్ళు గుంపులు గుంపులుగా పోతుంటారు. ఆ వచ్చిన గుంపులను అదుపు చేయడానికి గుడి పూజారి ఎంతగా ఈసడిస్తూ, కసురుతుంటాడంటే - మైకులో అతని మాటలు విని నేనెంత నొచ్చుకుంటానో? ఏమిటీ ఈ ఆడవాళ్ళూ అనిపిస్తుంది. కానీ అక్కడున్న భక్తులు మాత్రం అదేం పట్టించుకునే ధోరణిలోనే ఉండరు.

కానీ అవే మాటలు, ఆ ధోరణిలో బయట ఎవరన్నా మాట్లాడితే తాట తీసి వదిలేస్తారు. ఇంతగా పట్టింపే లేకుండా, అంత సహనంగా పురోహితుల పట్ల ఎందుకు ఉంటున్నారు? అదీ మనం అర్థం చేసుకోవాల్సింది.

సమాజంలో దేవుడి భక్తి పూజలు వేలం వెర్రిగా మారిపోయాయి. గతంలో బ్రాహ్మణులు, వైశ్యులు గుళ్ళకు పోతుండేవారు. కానీ ఇప్పుడు అన్ని కులాల వాళ్ళూ కొత్త చీరలూ, కొత్త నగలూ పెట్టుకుని - వాళ్ళకంటే కూడా భక్తిని ప్రదర్శిస్తున్నారు. మరి ఈ భక్తి భావం ఎట్లా వ్యాపించింది? దీన్ని వ్యాపింపచేయడంలో సామాజిక, సాంస్కృతిక కారణాలేమిటి? ఇది మన ముందున్న ప్రశ్న.

ఒకప్పుడు ఎన్.టి.ఆర్. ఆస్థాన విద్వాంసుడి పోస్టు పీకేశాడని, బ్రాహ్మణులకు తగిన గౌరవం ఇవ్వలేదని, తెలుగు దేశానికి వ్యతిరేకంగా ఉండేవారు. అందుకే చంద్రబాబు ఈ రోజు అడుగడుగునా వారిని నెత్తిమీద పెట్టుకుంటున్నాడు. బిజెపి కంటే నేనే మీకు దగ్గరనిపించుకోవడానికి నానా తంటాలూ పడుతున్నాడు. గోదావరి పుష్కరాలు, రాజధాని శంకు స్థాపన చేసిన తీరు గమనిస్తే ఇది అర్థమయిపోతుంది.

బిజెపికి కూడా ఎవరు ప్రధానన్నది కాదు! ఎవరి ఆధిపత్యంలో రాజకీయం, వ్యవస్థ నడుస్తుదన్నదే ముఖ్యం. 'మోదీ'ని ఆర్.ఎస్.ఎస్. ఆమోదించిందీ అందుకే. గుజరాత్‌లో మార్వాడీల, బనియాల ప్రయోజనం నెరవేర్చాడు కనకనే.ఈ సంస్థ ప్రధానంగా బనియాల, వ్యాపారస్తుల కంట్రోల్లో ఉంది. దాని అడుగుజాడల్లోనే మిగిలిన ఆయా సంఘాలు నడుస్తుంటాయి. అంతిమ తీర్పు ఆర్.ఎస్.ఎస్. ఇవ్వాల్సిందే!

గుజరాత్‌లో ముస్లిం వ్యాపారస్తులను ధ్వంసం చేశారు. భవిష్యత్తులో వారిని మళ్ళీ తల ఎత్తకుండా చేశారు. అక్కడి బనియాల వ్యాపార ప్రయోజనాలు నెరవేరాయి. దీనికి బ్రాహ్మణీయ ఆధిపత్యపు భావజాలం జత కలిసింది. వీరికి బిజెపి సంగమ స్థలమైంది. అయితే ఈ రెండు వర్గాలు లోలోపల 'కుస్తీ' పడుతుంటాయి. అది వేరే విషయం.

ఈ రెండు వర్గాలకు హిందూ మతం అవసరం. హిందూ మతం మూలాలు ఇద్దరి ప్రయోజనాలను నెరవేరుస్తున్నాయి. అందుకే 'అఖండ భారత్'ను తలకెత్తుకుంటున్నారు. కానీ భారతదేశం వైవిధ్యభరితమైన దేశం, కులాలు, మతాలూ, ప్రాంతాలూ, సంస్కృతీ ఏ ఒక్కటీ ఒకటిగా లేదు. మనం గుర్తెరిగిన చరిత్రలో భిన్న జాతులుగా ఉన్న దేశం మనది. అందుకే వారి అంచనాలకు భారత ప్రజలు అందడం లేదు.

కనక మతం పేరుతో మౌఢ్యాన్ని పెంచి, ప్రేరేపించి - ఏకం చెయ్యాలన్నదే వారి లక్ష్యం. కానీ ప్రజలు హిందువులైనా, ముస్లింలైనా, క్రైస్తవులయినా హింసావాదులు కారు! వారిలో మౌఢ్యం స్థాయికి భక్తి ఎక్కడం లేదు. అందుకే వారిని లక్షగళాలు, లక్ష దీపాలు, గణేష్ ఉత్సవాలు, నరకాసుర వధలు వంటి సామూహిక కార్యక్రమాలను రేకెత్తించి, ఉన్మాదస్థాయికి తీసుకుపోవాలన్నదే వారి లక్ష్యం.

ఇటువంటి ప్రేరణల పర్యవసానమే - దాద్రి ఘటన, కల్‌బుర్గి

హత్యలు వంటివి. అయితే ఆర్యుల తొలివేదమైన రుగ్వేదంలో ఉన్న వాటికి వ్యతిరేకంగా ఎందుకివన్నీ చేస్తున్నారూ? రుగ్వేదాన్ని ఆమోదిస్తూనే ఉన్నారు కదా!

ఈ రుగ్వేద కాలంలో చెప్పిన అనేక అంశాలు క్రమంగా ఎట్లా మారుతూ వచ్చాయో మనం గమనించవచ్చు. సప్త సింధు ప్రాంతంలో తిష్టవేసి ఈ దేశ మూలవాసులపై యుద్ధం ప్రకటించి వారిని అరణ్యాలలోకి నెట్టి వేశారు. అప్పటి నుండి ఆర్యుల ఆధిపత్యం కోసం ఎన్నో యుద్ధాలు చేశారు. ఆ విజయాలతో పాటు ఆనాటి సాంఘిక జీవనాన్ని కూడా రుగ్వేదంలో చూడవచ్చు.

తొలి దశలో ఆర్యుల ఆహారపు అలవాట్లు, సంస్కృతి, సామాజిక స్థితి చూడాలంటే రుగ్వేదమే ప్రామాణికం.

ఆర్యుల ఆహార పానీయాల గురించి - ఆశ్వలాయన గృహ్యసూత్రం 1-4లలో - 'నామాంసో మధుపర్కో భవతి' - అనగా, మాంసం లేకుండా మధుపర్కం లేదు. మధుపర్కం అంటే అతిథికి పెట్టే ఆహారం.

బృహదారణ్యకంలో (6-4-18) "య ఇచ్ఛేత్ పుత్రోమే పండితో విగీతః సమితిం గమః శుశ్రూషితాం వాచం భాషితాజాయేత, సర్వాన్ వేదాం అనుప్రవీత, సర్వమాయురి యాదితి. మాంసోదనం పాచయిత్వా, సర్పిష్మంతం అశ్నీనీయతావ్ ఈశ్వరీ జనయుతవాఔక్షేణ వార్షమే రావా" (అనగా నా పుత్రుడు పండితుడు, ప్రసిద్ధుడు, సామాజికుడు, శ్రోతలు కల వక్తయు, వేద పాఠియు, దీర్ఘాయుష్మంతుడును కావలెనను కోరిక గల తల్లి, నేతితో ఆబోతు లేక ఎద్దు మాంసోదనమును వండుకుని తినవలెను)

బుద్ధుని కాలం నాటికి కూడా గోవులను మాంసానికి ఉపయోగించినట్లుగా మధ్యమ నికాయంలో (3-5-4) చెప్పబడింది. "గో ఘాతకుడు - గోవుని చాతుర్యముతో చంపి, లోపలనున్న మాంసాన్ని కానీ, బయటవున్న చర్మాన్ని కానీ దెబ్బ తినకుండా చేసినట్లు వర్ణించబడింది. గో మాంసాన్ని నరికి బజారులో పోగులు పేర్చుట కూడా వర్ణించబడింది. గోవును చంపిన ప్రదేశాన్ని 'సూనా' అని పిలిచేవారు. ఆవును చంపే కత్తిని 'గో భికర్తనం' అన్నారు (మధ్యమనికాయం 2-4-5)

తరవాత చాలా కాలానికి 'భవభూతి' అతిథికై 'ఆవు పెయ్య'ను చంపినట్లుగా వర్ణించాడు. ఆర్యులు వచ్చింది మొదలు క్రీస్తు శకారంభం వరకు గోమాంసం భక్షణ ఉంది. భారతంలో గోగ్రహణం - మనకు గోవులు సంపద ఉన్నదని తెలియచేస్తుంది. ఈ గో సంపద దేనికోసం?

ఇప్పటికీ ప్రతి క్రతువులో బ్రాహ్మణులు "గో దానాన్ని" ప్రముఖంగా చెప్పడంలోని మూలమిదే. ద్రుపదుడిని 'గోవు' కోసం అడగటానికే కదా! వెళ్ళింది. అట్లా ప్రాచీన కాలం నుండి గోవుల ప్రస్తావన మన సాహిత్యంలోనూ ఉంది. చివరికి చనిపోయాక 'గోదానం' చేస్తే, చనిపోయిన మనిషి పుణ్యలోకాలు పోతాడని చెప్పే కథలు ఇప్పటికీ ఉన్నాయి.

విశ్వామిత్రుడు కరువు కాటకాల్లో 'కుక్కమాంసం' - అదీ ఒక అంటరానివాడి దగ్గర తిన్నట్టుగా భారతంలో రాసే ఉంది.

బుద్ధుని రాకతో యజ్ఞాలను వ్యతిరేకించడంతో, కాలక్రమంలో అనేక మార్పులు జరిగి ఉండవచ్చు. ఇంతగా లిఖిత సాహిత్య సాక్ష్యాలున్నప్పటికీ - మాంసం తిన్నందుకు మనుషులను చంపే ఉన్మాదానికి దిగడం!, హింసను ప్రేరేపించి మతం పేరుతో పరమత ద్వేషాన్ని రగిలించడమే ప్రస్తుత హిందూత్వ వాదుల కర్తవ్యం. ప్రజలు హిందూమతాన్ని అభిమానించేవారు కావచ్చుగానీ - హిందూత్వం తలకెక్కించుకున్నవారు తక్కువ.

అసలు కుల విభజన ఇంత తేటతెల్లంగా ఉండగా! , ఏ కులాధిపత్యం కింద సమీకరణమవుతారు? ఈ రోజు ప్రతి కులం, ఎవరికి వారే ఆధిపత్యం కలిగినట్టు భావించుకోవడానికి - మన కులవ్యవస్థ యొక్క ప్రత్యేక లక్షణమే కారణం. బ్రాహ్మణ భావజాలం ఆ కులంలోనే కాదు... అన్ని కులాలలోను ఈ ఆధిపత్య ధోరణి తలకెక్కింది. దేశంలోనూ, ప్రత్యేకంగా మన రాష్ట్రంలోనూ దళితుల మీద దాడులు చేసే వాళ్ళలో ఇటీవల బీసీలు, శూద్ర కులాలూ ఉంటున్నాయి. పాతపల్లి, లక్ష్మింపేట దీనికి ప్రత్యక్ష ఉదాహరణ.

ఒకప్పుడు తమ స్థానం చెదరదనుకుని కల్పించిన సాహిత్యం, మంత్రతంత్రాలు - ఇప్పుడు పూజల వరకే చెల్లుబడి కావచ్చునేమో గానీ! రాజకీయాల దాకా రానివ్వడం లేదు. అయితే అది ఇప్పటికీ బ్రాహ్మణుల భృతికి లోటు లేకుండానే చేస్తోంది. ఆ మేరకు అది ఆధిపత్య స్థానంలోనే ఉండి... సమాజంలో తమ కులం పవిత్రమైందనే విశ్వాసాన్ని నిలిపి ఉంచుతోంది.

అలాగాక బ్రాహ్మణీయ ఆధిపత్య భావజాలానికి, మనుగడ లేకుండా పోయి - ఎవరైనా సరే, శారీరక శ్రమ చెయ్యనిదే జీవితం వెళ్లబారదన్న పరిస్థితి దాపురిస్తే - ముందుగా నరకయాతన పడేది పూజారి వర్గమే. ఉత్పత్తిలో పాల్గొనకుండా ఒక్క మెతుకు దొరకదన్న విషయం... ఇటువంటి వారికందరికీ భయంకరంగా ఉంటుంది.

అందుకే బిజెపి, ఆర్ఎస్ఎస్ కోరిక మాత్రం మనువు ఆదర్శంగా రాజ్యాధికారం చేపట్టాలన్నదనే. అది వారి లక్ష్యం. అయితే ఈ మారిన సామాజిక నేపథ్యంలో కులంగా బ్రాహ్మణాధిపత్యం పాత పద్ధతిలోనే సాధ్యమా? కాకపోవచ్చు! కానీ ఇతర కులాలను మతం పేరుతో ఎగదోసి తమ భావజాలాన్ని నిలుపుకోవాలన్నదే ఆర్ఎస్ఎస్ ప్రయత్నం. దానికి వాహికలుగా శూద్రకులాలు ఉపయోగపడటం విచారకరం.

ముస్లింలంతా ఉగ్రవాదులు కానట్టే, హిందువులు కూడా హింసావాదులు కాదు. కానీ వారిని హిందుత్వం వైపు మరల్చడానికి సాంస్కృతికమైన కార్యక్రమాలెన్నో ముందుకు తెచ్చి ప్రజల మధ్య చిచ్చురేపి అరాచకం సృష్టించాలనుకుంటున్నారు. ఇందుకు ప్రచార సాధనాలు బాగా ఉపయోగపడుతున్నాయి. కోటి దీపారాధనలు వంటి వాటిని ఛానళ్ళ నిండా నింపుతున్నారు. భక్తి ఇంకెంత మాత్రం వ్యక్తిగత వ్యవహారంగా మిగలడం లేదు.

ఇది నిజంగా మతం మీద, మనుషుల మీద ప్రేమ కాదు. ఆ పేరుతో అధికారాన్ని పొందాలనీ, నిలబెట్టుకోవాలన్నదే వారి లక్ష్యం. దీని కోసం మైనారిటీల మీద దాడి దౌర్జన్యాలు సలుపుతున్నారు. చివరికి మేధావులను చంపేదాక వచ్చారు.



వ్యాసం

# న మాంసో మధు పర్కోం భవతి

కారసాల విజయకుమార్

'న మాంసో మధు పర్కోం భవతి' అనగా విందు భోజనంలో మాంసం కూర లేకుంటే, అది అసలు విందు భోజనమే కాదు అని అర్థం. (అశ్వలాయన గృహ్య సూత్రం1-4). పండితుడు, ప్రసిద్ధుడు, సామాజికుడు, శ్రోతలున్న వక్త, వేదపాఠి, దీర్ఘాయుష్మంతుడు అగు పుత్రున్ని కనాలనే కోరికగల తల్లి ఆంబోతు లేక ఎద్దు మాంసాన్ని నేతిలో వండుకుని తినవలయునని బృహదారణ్యకం (6-4-18) లో చెప్ప బడింది, దీనికి శంకరాచార్యులవారు మాంసాహారానికి ఉపయోగించే పశువు, వయస్సులో నున్న లేక ముదురు వయస్సులో ఉన్న ఎద్దునే వాడాలనంటారు.

రుగ్వేదంలో "వేద కాలమున మాంసం నిషేధం కాదు. మాంసం తినుట తినకుండుట ఆచారము, అలవాటు మీద ఆధారపడి ఉన్నది. ఈ కాలమున మాంస భక్షక జాతులే ఆధిపత్యము కలిగి ఉన్నవి. అయిననూ మాంస భక్షణము ఒకనాటి ఆచారము, రాముడు మాంసమును ఆరగించినాడు ఇది నాటి ఆచారము" అని 26 సూక్తము, ఆలోచనామృతములో రాయబడి ఉంది. అలాగే రుగ్వేదం 122 సూక్తం 9వ శ్లోకంలో "గుఱ్ఱం మాంసం మీద ఈగలువాలును, కోయునపుడు కత్తికి అంటుకొనును, కోయువారి చేతులకు గోళ్లకు అంటుకోనును. అవి అన్నియును దేవతలకు చెందవ లెను". 10వ శ్లోకంలో "ఉదరమునందలి అజీర్ణ వస్తువు బయటికి వచ్చును, అపక్వ మాంసమును మలినములను దూరము చేయవలెను. శుద్ధము అయిన మాంసమును దేవతల కొరకు చేయవలెను". 11వ శ్లోకంలో "అశ్వమును అగ్నిలో పచనము (కాల్చు) చేయునపుడు వచ్చు రసపదార్థము. శూలమునకు అంటిన మాంసం భాగములను నేలమీద పడనీయ్య రాదు. గడ్డిలో కలువనియ్య రాదు, దేవతలు ఉవ్విళ్ళూరుచున్నారు. వారికి సంపూర్ణ హవిస్సులు (కాల్చిన మాంసపు ముక్కలు) అందవలెను". 12 శ్లోకంలో "గుఱ్ఱం మాంసం వండునపుడు చుట్టూర నిలిచి చూసువారుందురు. వంటకము వాసన చూసి దేవతలకు అర్పించు వారుందురు. మాంస భిక్షకొరకు మూగిన వారుందురు. వారందరూ మావలెనే సత్సంకల్పము కలిగి ఉండవలెను". 13వ శ్లోకంలో "మాంసం వంటను కలుపుటకు తెడ్డును వాడుదురు. రసమును ఉంచుటకు ఆకులు వాడుదురు. వేడినిలుపుటకు ఆచ్ఛాదనము వాడుదురు. అశ్వపు అవయువములు గుర్తించుటకు అంకము వాడుదురు. అవయవములను ఛేదించుటకు ఛురికను వాడుదురు. అవి అన్నియు అశ్వమాంసమును వ్యక్తపరంచును". 18 శ్లోకంలో "అశ్వము దేవతల బంధువు, దాని రొమ్మునకు ముప్పదినాలుగు వంకల ఎముకలున్నవి, వాటిని కోయుటకు ఖడ్గమును ఉపయోగింతురు, అశ్వ ఛేదకులారా అశ్వపు అవయవములను విచ్ఛిన్నము కాకుండా కోయుడు. చూచుచు శబ్దము చేయుచు ఒక్కొక్క భాగమును విడదీయుడు". 20 శ్లోకంలో "అశ్వమా నీవు దేవతలను చేరుదువు. అపుడు ప్రియమైన దేహమునకు బాధ కలుగదు.కత్తులు నీ దేహమును ఎక్కువగా గాయాలుచేయరాదు.మాంసమును అభిలషించు వారు. అనభిజ్ఞులు అయిన ఛేదకులునీ విభిన్న అంగములను వదలి దేహమును బాధించరాదు" 21 శ్లోకంలో "అశ్వమా నీవు మరణించవు. నిన్ను లోకము హింసించదు. నీవు ఉత్తమ మార్గమున దేవతలను చేరుచున్నావు".

"అదితి దేవతాకమునకు చూడి గోవును వధించవలెను, మరు దేవతాకమునకు తెల్లనిదియు, బాల్యముననే గర్భిణీ అయిన గొవును వధించవలెను" యజుర్వేదయు 19వ అనువాకము. అలాగే 6వ శ్లోకము "సంతానము కోరువాడు ఓషధులకు గర్భవినాశిని అగు గోవును బలిఇవ్వవలేను". 7వ శ్లోకము బలము కోరువాడు ఇంద్ర దేవతాకమగు ఎర్రని పశువును వధించ వలెను. అయిదవ అనువాకములో 7వ శ్లోకము లో "ఐశ్వర్యము కోరువాడు ఒక సారి ఈనని గొడ్డు మోతుదైన గోవును వధించవలెను". 8వ శ్లోకము లో యజ్ఞములందు గోవు దక్షణగా ఇవ్వబడుచున్నది.

దీన్ని బట్టి మాంసాహారానికి మూలాలు వేదాలలో కూడా ఉన్నవని చెప్పవచ్చును. వేదాలను ఆర్యులు సృష్టించారనీ, ఇరానీయుల పవిత్ర గ్రంథమైన "జంద్ అవెస్తా" నుండి సేకరించిన భావాలనే భారత్‌లో వేదాలుగా అభివృద్ధి పరచారనీ, సంస్కృత భాషకు జంద్ అవెస్తా భాషకు చాలా దగ్గర పోలికలున్నాయనీ, అసలు ఆ రెండూ దాదాపు ఒకటిగానే ఉంటాయనీ, ఇరాన్ నుండి ఆర్యులు ఈ గొప్ప నేలకు గుంపులు గుంపులుగా ప్రవేశించారనీ, పండిట్ జవహర్ లాల్ నెహ్రూ రచించిన "డిస్కవరి ఆఫ్ ఇండియా" అనే గ్రంథంలో స్పష్టంగా చెప్పబడినది.

ఇక నాలుగు వేదాలను పరిశీలిస్తే ఈ నేలపై ఆర్యుల దండయాత్ర సిద్ధాంతాన్ని చరిత్రకారులు వివాదాస్పదం చేసినప్పటికీ, హిందూ మత ఆధ్యాత్మిక గ్రంథాలైన వేదాలు, రామాయణం, మహాభారతాలు మాత్రం స్పష్టంగానే తెలియ జేయుచున్నవి. వీటిని నాలుగు వేల సంవత్సరాల కాలంనాటి ప్రాచీన చరిత్రకు సంబందించిన గ్రంథాలుగా కాకుండా, అనేక మార్పులు చేసి హిందూ ఆధ్యాత్మిక గ్రంథాలుగా, ఇతిహాసాలుగా ప్రచారం చేయడమే కుట్రగా భావించవచ్చును. ఇంద్రుడు, అగ్ని, బృహస్పతి, అదితి, కుత్సుడు, సముద్రుడు, వరుణుడు, మిత్ర, వైశ్వామిత్ర, వధుచ్చంద్రుడు, పరాశరుడు, విదాట్టుడు, సరస్వతి, ఛందస్సు, గాయత్రి, విశ్వదేవతలు, విష్ణువు, ప్రజాపతి తదితరులు ఆర్యుల రాజులగా మనం భావించవచ్చును. వీరందూ అమితంగా ఇష్టపడే హవిస్సులు (హోమంలో కాల్చిన మాంసపు ముక్కలు) సోమరసము

(మాదక ద్రవ్యాలతో తయారుచేసిన భంగు లాంటి మత్తు పానియం) చిత్తుగా తాగి తిని మూలవాసులైన ద్రావిడుల (దస్యులు) పై భీకర దాడులు చేశారని వేదాలలో స్పష్టముగా చెప్పబడినది. ఈ విషయాలు హిందూ పీఠాధిపతులకు, మఠాధిపతులకు, ఆధ్యాత్మిక గురువులకు, పూజారులకు, జాతీయ, అంతర్జాతీయ ఆర్య సమాజానికి తెలియని కొత్త విషయాలేమీ కావు.

ఈ దేశ మూలవాసులైన ఎస్సి, ఎస్టి, బిసి, మైనార్టీలు పుష్టి కర ఆహారం తిని బలిష్టంగా మారితే ఈ నేలపై వారి ఆకాంక్షలు నెరవేరవని వారి నమ్మకం కావచ్చు. కనుక "దస్యులు, దొంగలు దేవతల గోవులను దొంగిలించారు, వాటిని దుర్గమగు గుహలలో ఉంచారు, వాటిని విడిపించుటకు ఇంద్రులు ఎంతో ప్రయత్నం చేశాడు, సాధ్యపడలేదు, మరుత్తుల సాయంతో గోవులను విడిపించినాడు (ఆలోచనామృతం-ఋగ్వేదం). వేల సంవత్సరాలుగా ముఖ్యంగా దళితులకు అంటరానితనాన్ని అంటగట్టి ఊరికి దూరంగా వెలివేసిన చరిత్ర ఈ హిందూ మత చరిత్ర. ద్రావిడులుగా పుట్టి, తమ ప్రమేయం లేకుండానే హిందువులుగా మార్చబడ్డారు. ఈ దేశంలో జంతువులను సహితం దేవాలయాలలో ప్రతిష్టించి పూజలు చేస్తున్న సందర్భంలో, అంటరానివారి గాలి తగిలితే సమాజం మైల పడుతుందని, మనిషిగా పుట్టిన దళితులకు మూతికి ముంత ముడ్డికి చీపురు కట్టిన చరిత్ర. ఎంతో అభివృద్ధి జరిగిందనీ, విజ్ఞానం అంతరీక్ష పరిశోదనల వరకూ విస్తరించిన యుగంగా చెప్పుకునే రోజులివి.

దైవ దర్శనానికని హిందూ దేవాలయానికి వెళ్ళగా, దేవాలయ పూజారి అడ్డగించి, అంటారాని కులంలో పుట్టి పవిత్ర దేవాలయంలోకి వస్తావా, అని గొడ్డలితో నరికి అందరూ చూస్తుండగానే తగలపెట్టినా, దేవాలయ పూజారి స్వేచ్ఛకు ఎవ్వరూ అడ్డుచెప్పని సంస్కృతి. ఇదీ నవీన యుగపు వర్తమాన చరిత్ర, దీన్ని బట్టి భూతకాలపు దళితులు ఎటువంటి వివక్షకు, దాడులకు, చిత్రహింసలకు, యదేచ్చ మారణ కాండలకు బలయ్యారో అర్థం చేసుకోవచ్చు. మీసాలు తీసేసి, గడ్డం పెంచుకుని, నెత్తిన టోపీ పెట్టుకుని ముస్లింగా మారితే, అల్లా దళితుల దేహాన్ని ఆలింగనం చేసుకున్నాడు, మస్‌జీత్ గోడ దళితులకు నీడగా అండగా నిలిచింది. నొసుట బొట్టుతీసేసి, మెడలో శిలు వేసుకుని క్రైస్తవుడిగా మారితే, దళితులకు ఈ బ్రాహ్మణ సమాజం అంటించిన అంటరాని తనాన్ని కడిగి, ఏసు ప్రభువు వారిని ముట్టి పరిశుద్ధ పరిచాడు.ఈ రెండు చోట్లా దళితుల కుల సమస్యకు ఊరట దొరికింది. ఇక్కడ దళితుడు నిరుపేదైనప్పటికీ అంటరాని వాడు మాత్రం కాదు, ఆర్యులు తమ పాలనను ఈ నేలపై స్థిర పరుచుకుని ద్రవిడ స్థానాన్ని హిందుస్థాన్‌గా మార్చుకున్నప్పటి కాలం నుండి ఈ దేశ దళితులు కడుపు నిండా తిండి దొరకని పరిస్థితి, పుట్టిన నేల పైననే స్థానికేతరులతో అంటరానివాడుగా ముద్ర వేయించుకుని, సమాజానికి దూరంగా, ఊరి చివర, చీకటిలో ఒంటరిగా కాలే కడుపులకు కుళ్ళిన జంతు కళేబరాలే రవ్వంత ఆసరాగా మారి తమ పూర్వీకుల ఎండిన డొక్కల ఆకలి తీర్చాయి. ఈ మృత దేహాలే దళితులకు మాత్ర దేవతలై ఆకలి తీర్చాయి. ఈ దేశంలో మాంసం తింటున్నాడని దేవాలయ గోపురం ద్వారా పూజారి చిన్న ప్రకటన చేస్తేనే మూకుమ్మడిగా ఒక గుంపు ఆ కుటుంబంపై విరుచుకుపడి మహమ్మద్ ఇఖ్లఖ్‌ను రాళ్ళతో కొట్టి చంపేశారు. గొడ్డు కూరతో విందు ఇచ్చినందుకు ఏకంగా ఎంఎల్ఎ రషీద్ పై సాక్షాత్తు జమ్ము కాశ్మీర్ శాసన సభలోనే దాడి చేయడం జరిగింది. ఈ దాడులకు నిరసనగా ఎద్దు కూర పండుగ చేసుకుంటామంటే తల్వార్లతో మరో దాద్రీని సృష్టిస్తామని బెదిస్తారు. కోర్టు కూడా పెద్దకూర పండగపై తాత్కాలిక నిషేదం విధించింది. ప్రజాస్వామ్యం ముసుగులో మతోన్మాదులు మా ఆహారాన్ని అవమానించి నిషేధిస్తే, దళితులను అవమానించి నిషేదించినట్లుగానే భావించి, ఇక నుండి నీ దుర్మార్గపు కుట్రల చరిత్రను డప్పు కొట్టి ప్రపంచానికి చెబుతాం.



---

*(40వ పేజీ తరువాత...)*

చూడబడుతున్న వారిపట్ల అమలవుతున్న అన్యాయాల్ని, వివక్షతను రద్దు చేయాలి. కొన్ని సమూహాలకు సంబంధించిన ప్రత్యేక నియమాలను - అవి కులపంచాయితీల ద్వారా రూపొందించ బడినవైనా, మూడుసార్లు తలాక్ చెప్పటం వంటివైనా కొనసాగాలా, వద్దా అనేదాన్ని పునఃపరిశీలించాలి. వ్యత్యాసాలను కొనసాగించ టానికి దుర్వినియోగం చేయబడే చట్టం చట్టమే కాదు. సమాజాన్ని లౌకికీకరించే ప్రయాణంలో ఇది అత్యంత సమస్యాత్మకమైన సమస్య. చైతన్యవంతమైన ప్రారంభానికి ఇది సమయం కాదా!

మన చుట్టూ ఉన్న ప్రపంచంలో ప్రజలలో పెరుగుతున్న మత అనుకూలతత్వాన్ని వాస్తవానికి మించి చిత్రీకరిస్తున్నాయేమో అనిపిస్తుంది. బహుశా, నిజ జీవితంలో ఎదురవుతున్న సమస్యల్ని ఎదుర్కోలేకపోవటం, అభద్రతా భావం ఎక్కువవుతున్న పోటీ సమాజంలో మనం నివసించాల్సి రావటం దీనికి కారణం అయి ఉండవచ్చు. మత సంబంధమైన పండుగలలో ఆడంబరాలు మితిమీరి పోతున్నాయి. వ్యక్తులు తమ సంపదను ప్రదర్శించటానికి ఈ ఆడంబరాలు ఉపయోగపడుతున్నాయి. ప్రజలలో అత్యధికులు వీటిని పాటించగల స్థితిలో లేరు. నిజంగా మతం మీద నమ్మకం ఉన్న వ్యక్తి అతి సాధారణ రీతిలో పండుగలు, ఉత్సవాలు జరుపుకోవటం చాలు అనే అనుకుంటాడు. కొన్ని సమయాలలో ఇది కూడా అవసరం లేదని అనుకుంటాడు. ఈ క్రతువులన్నీ కూడా మన సంక్షేమాన్ని కాపాడమని మానవాతీత శక్తికి విన్నవించుకోవటమే. ఇందుకు బదులుగా దేశ పౌరులుగా మన సాంఘిక సంక్షేమం, శ్రేయస్సు, మన చుట్టూ ఉన్న ప్రపంచం పట్ల అవగాహన, మన జీవితాల్ని ఉన్నతీకరించుకోవటం వంటి అంశాల్ని, మనమీద మనం ఆధారపడి ఎలా వాస్తవీకరించుకోవాలో ఆలోచించలేమా? సమాజాన్ని లౌకికీకరించటం రాత్రికి రాత్రి జరిగిపోయే విప్లవం కాదు. అది ఒక చారిత్రక క్రమం. అది సమయం తీసుకుంటుంది. రాజ్యం, సమాజం ఒక నూతన మార్గంలో పనిచేయటం ద్వారా ఈ మార్పుకు దోహదపడగలవు. మానవ సంబంధాల నైతికతను ఉన్నతీకరించటం ప్రజాస్వామ్యంలో ఇమిడి ఉన్నది. ఆ నైతికతను ముందుకు తీసుకుపోవటమే సమాజాన్ని లౌకికీకరించటం.

(డాక్టర్ అస్గర్ అలీ ఇంజనీర్ స్మృతిలో రోమిల్లా థాపర్ ముంబైలో 26-10-2015న చేసిన ప్రసంగానికి సంక్షిప్త అనువాదం)



వ్యాసం

# ఎవరిదీ ఈ హిందుత్వ?

బి.ఎస్.రాజు

**హిందుత్వ తాత్విక పునాది:**

ఇండియాలో 'సంఘ్ పరివార్' ఊది ఊది నిప్పు రాజేస్తూ, ఎగదోస్తున్న 'హిందుత్వ'కు పునాది బ్రాహ్మణ్య కులతత్వం, అగ్రకులాహంకారం, పరమత అసహనం, భిన్నాభిప్రాయాల పట్ల కక్ష, కుహనా దేశభక్తి, కుహనా జాతీయవాదం, చరిత్ర వక్రీకరణ, పచ్చిఅబద్ధపు పెంటకుప్పల విష ప్రచారం, మత మౌఢ్యం, మోసపూరిత హిందూ సాంప్రదాయత, సంస్కృతి. కలగలసి.. ప్రశ్నకు, హేతుబద్ధ ఆలోచనకు తావులేని, ఇతర అభిప్రా యాలకు ఆస్కారం లేని, అసలు ప్రశ్నలన్నవే ఉదయించకూడని మూఢమతుల వికృత మూస కాషాయ ఫాసిస్ట్ మౌఢ్యమే - ఈ దేశంపై రుద్ద దల్చుకున్న సంఘ్ పరివార్ 'హిందుత్వ'. అన్నిమతాల మూఢ తాత్వికత ఇంచుమించు ఒకటే ఐనప్పటికీ, భగవంతుని ప్రార్ధనా స్థలాల్లోనైనా సమానత్వాన్ని ఏమాత్రమూ సహించని, పాటించాలనే ఆలోచనను కూడా రానివ్వని పాషాణనీతి హిందుత్వకే సొంతం.

**భరత మాత-దేశ భక్తి:**

దేశమంటే భరత మాత. పూజిత మహా శక్తి. నిలువెత్తు విగ్రహం. దేశమంటే పవిత్రమైన మట్టి. దేశభక్తంటే త్రిశూల కాషాయ ఆహార్యం. నుదుట సింధూర తిలకం. దేశమంటే హిందూ పులి, హిందూ సింహం. దేశమంటే విల్లంబుల అయోధ్య రాముడు. దేశమంటే రామపాదాల దగ్గర మోకరిల్లే వీర భక్త హనుమంతుడు. దేశ భక్తంటే కాషాయ ఝుండా. దేశ భక్తంటే జై రామ్! జై హనుమాన్!జై భగవాన్! దేశమంటే మనుషులు కాదు. దేశమంటే బహుజన, పలుజన సందోహాల సంస్కృతుల సమాహారం కాదు. మనువాద వ్యత్యాసాలతో రక్తమోడుతూ కళ్ళకు కన్పిస్తున్నసమాజం కాదు. అది సింధు జలధి, అది పవిత్ర గోమాత.

**జాతీయత -హిందుత్వ:**

జాతీయత అంటే మనువాద బ్రాహ్మణీయ కులదొంతరల అంతరాల పిరమిడ్. జాతీయతంటే గోల్వాల్కర్ సిద్దాంతం. జాతీయతంటే బ్రాహ్మణ్య ఆర్.ఎస్.ఎస్-రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్ కాషాయ కషాయం. ప్రశ్నకు, చర్చకు తావులేని, విభేదనకు వీలు లేని, హేతువుకు హారతి పలికే ఏకశిలా జనిత పవిత్ర తీర్థం హిందుత్వ జాతీయత. తను చెప్పినది కాక ఎవరైనా వేరే ఏమైనా మాట్లాడితే అది దేశ ద్రోహం, అది జాతిద్రోహం, అది రాజద్రోహం. తనతో విభేదించే వారెవరైనా జీవనార్హులు కారు. వారు చంపబడాల్సిందే. ఈ దేశంలో భాగమైన దళితులు, ఆదివాసులు, ముస్లింలు, క్రిస్టియన్లు, సిక్కులు, శ్రమించి పొట్ట పోసుకునే శ్రామికులు, దేశభక్తుల్లో కాదో, జాతీయ వాదులో కాదో.. పలు రకాల ఆలోచనాపరులుగా, భావజాల శ్రేణులుగా ఈ దేశంలో భాగమై ఉన్న అంబేద్కర్ వాదులు, హేతువాదులు, బౌద్దులు, నాస్తికులు, కమ్యూనిస్టులు, మార్క్సిస్టులు, మావోయిస్టులు.. దేశభక్తుల్లో కాదో, జాతీయ వాదులో కాదో.. గుర్తింపు పత్రాలు సంఘ్ పరివార్ నాగపూర్ కేంద్రం నుండి పొందాల్సిన పనిలేదని, కాషాయ భావజాలానికి భిన్నమైన భావజాలం కల్గిఉండడం వారి జన్మహక్కని అన్నందుకే సంఘ పరివార్ ఫాసిస్టు రాజ్యం జవహర్ లాల్ విశ్వ విద్యాలయ విద్యార్థి సంఘ నాయకుడు 'కన్హాయ్య కుమార్' పై దేశద్రోహ నేరం మోపి, జైల్లోకుక్కి, చిత్రహింస లు పెడుతోంది. న్యాయస్థానపు ఆవరణలోనే కొట్టి చంపాలనే కక్షతో ఊగిపోతోంది, ఈ కాషాయ రాజ్య బ్రిగేడ్. సరిగ్గా ఇటువంటి భాష మాట్లాడుతున్నాడనే, ప్రచారం చేస్తున్నాడనే ఢిల్లీ యూనివర్సిటీ కి చెందిన ఆంగ్ల భాషా అధ్యాపకుడు, 90% అంగవైకల్య బాధితుడు ఐన ప్రొఫెసర్. జి.ఎన్.సాయిబాబాను అండాకార అధ్వాన్నపు జైలు గదిలో కుక్కి వేధించి వేధించి చావుకు చేరువ చేస్తోంది.

అబద్ధపు ప్రచారం, చరిత్ర వక్రీకరణలు వద్దు, నిజాలు మాట్లాడదాం, చరిత్రను శాస్త్రీయంగా విశ్లేషిద్దాం అంటేనే హేతువాద ప్రజాస్వామిక వాదులైన గోవింద్ పన్సార్, నరేంద్ర దబోల్కర్, కలబుర్గిలను కాషాయ గుప్త సేన చంపేసింది. హైదరాబాద్ కేంద్ర విశ్వ విద్యాలయంలో దళిత విద్యార్థి రోహిత్ ను తన బ్రాహ్మణ్య అహంకారానికి, వెలివేతకు గురిచేసి చావుకు నెట్టేసింది.

ఇస్లామిక్ టెర్రరిస్టులుగా ముద్ర వేయబడుతున్న, ఉరితీయ బడుతున్న, ఎన్కౌంటర్ చేయబడుతున్న వారంతా ఈ దేశస్తులే నని, వారు జాతి వ్యతిరేకులు కారని, భారత రాజ్యాంగం వారికి కల్పించిన హక్కులు వారికి తిరస్కరించబడరాదనీ వాదించే వారంతా జాతి వ్యతిరేకులేనని, వారందరినీ చంపి వేయాలని హిందుత్వ కాషాయ సేన కంకణం కట్టుకున్నట్లు ఇప్పుడు మనకంటి ముందు నడుస్తున్న చరిత్ర క్రమం రుజువు చేస్తోంది.

తన సచ్చు పుచ్చు కుళ్ళు హిందుత్వ తాత్వికతకు వత్తాసుగా దళిత ఆదివాసీ యువతను; మధ్యతరగతి మేధావుల, ఆలోచనాపరుల మద్దతును కూడగట్టు కోవడానికి బేషరంగా, కుట్రపూరితంగా డాక్టర్. బాబా సాహెబ్ అంబేద్కర్ ను, షహీద్ భగత్ సింగ్ ను తన ఖాతాలో జమకట్టుకోవడానికి వారి బొమ్మలను మెడలో వేలాడ దీసుకుని ఊరేగే పని పెట్టుకుంది. ఏ ప్రజాస్వామిక,

సంస్మరణ వ్యాసం

# కవిత్వం పోరాట గీతం...

**అరసవిల్లి కృష్ణ**



2016 జనవరి 13న మరణించిన కవి, విమర్శకుడు, వక్త అద్దేపల్లి రామమోహనరావు. తెలుగు సాహిత్యాల్ని సాహిత్య బాటసారిగా ప్రచారం చేసిన సాహిత్యజీవి. ఎనభై ఏళ్ళ అద్దేపల్లి రామమోహనరావు జీవితంలో సుమారు అరవై ఏళ్ళ సాహిత్య సాంస్కృతిక జీవితమున్నది. తెలుగు సమాజపు రాజకీయార్థిక సాంస్కృతిక పరిణామాలను అద్దేపల్లి తన సాహిత్య సృజనలో పలికించిన వాడు. హృదయానికి దగ్గరగా వచ్చే అతని సంభాషణ నూతన రచయితలను కవులను తయారు చేసింది. సృజనశీలురను తయారుచేయడమేమిటి? అనే ప్రశ్న రావొచ్చుగాని, కొత్తగా రాస్తున్న వారి రచనలను పరిశీలించి వాటి మేలిమిని చెప్పగలిగే సీనియర్ రచయితలు అరుదు. అద్దేపల్లి కొత్త తరాన్ని ప్రోత్సహించడంలో ఎల్లకాలం సిద్దంగా ఉండేవారు. వామపక్ష ప్రజాతంత్ర శక్తులతో కలిసి ప్రయాణం చేసిన వాడు. ప్రజా రచయితల సంఘంలో బాధ్యతలు నిర్వహించినా, చనిపోయేంతవరకు ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక సమాఖ్య (యువ వికాస వేదిక)కు గౌరవ అధ్యక్షురాలిగా ఉన్నా ఆయన చూపు ప్రగతిశీలత వైపే. నిరాడంబరత, సమాజంలో భాగం కావడం, ప్రపంచ తీరుతెన్నులును నిశితంగా గమనించడం, వాటి చలనాన్ని కవిత్వం చేయడం కాకుండా, ఓ విమర్శకునిగా తెలుగు సాహిత్య ఉద్యమాలను, ధోరణులను నిక్కచ్చిగా అంచనా వేసిన విమర్శకుడు. అభ్యుదయ విప్లవ కవిత్వాలు, సిద్ధాంతాలు-శిల్పరీతులు అనే సిద్ధాంత గ్రంథంలో అభ్యుదయ విప్లవ కవిత్వం గురించి లోతయిన పరిశీలన చేశారు. దళిత స్త్రీ మైనారిటీ వాదుల్లోని విశిష్టతను స్వాగతించాడు. అస్తిత్వ స్పృహతో వచ్చిన, కవిత్వం, కథలు తెలుగు సాహిత్యంలో బలమైన గొంతుకలుగా ఉన్నాయని, వాటిని విశ్లేషించడమే కాదు, ప్రచారం చేసిన కవి అద్దేపల్లి రామమోహనరావు.

కవిగా విమర్శకునిగా ఊరూరు తిరుగుతూ సాహిత్య వాతావరణాన్ని ప్రభావితం చేయడమే కాదు, సృజనకారుల కలయిక వలన వారిలోని సాహిత్య సృజన మరింతగా ప్రోది అవుతుందనే ఆలోచనలు చేసినవాడు. అద్దేపల్లి కవిత్వం, విమర్శ

---

సమానత్వ, సామాజిక, ఆర్థిక, రాజకీయ విలువలకై వారు తమ జీవితాంతం కృషి చేసారో ఆ విలువల పట్ల ఏహ్యతను, విష వ్యతిరేకతను గుండెల్లో నింపుకు ని, వారి బొమ్మలను పైకెత్తి, వారి అసలు తాత్వికతను భూస్థాపితం చెయ్యడమే సంఘ్ పరివార్ హిందుత్వ లక్ష్యం.

ఈ రోజు కన్హయ్య కుమార్ పై దేశ ద్రోహ నేరం మోపడం, న్యాయ స్థానాల్లో అతనిపై విరుచుకు పడడం, అతన్నిఢిల్లీ పాటియాలా కోర్టు ఆవరణలోనే కొట్టి చంపాలనే కుట్ర ఎవరిది ? ఈ కుట్ర మనువాద బ్రాహ్మణ్య హిందుత్వది కాదా? ఈ కుట్ర నాగపూర్ కేంద్ర రచన కాదా?

కన్హయ్య కుమార్ అక్రమ అరెస్ట్ కు ముందు అతని ప్రసంగం ఈ దేశ సామాజిక స్థితిగతులకు అద్దం పట్టింది. అతను పలికిన ప్రతి పలుకూ అక్షర సత్యం. అందుకే సంఘ్ పరివార్ కు అతని పై అంత కక్ష, కసి. రోహిత్ వేముల అయినా, ఉమర్ ఖలీద్ అయినా కక్ష అందుకే.

ఇంతగా దేశభక్తి మీద, జాతీయత మీద ఈగవాలకుండా కాపుకాస్తున్నా మంటూ, భరతజాతికి, భరతమాతకు తామే బాడీ గార్డులమని వీరంగ మాడుతున్న హిందుత్వ వాదులకు భారత రాజ్యాంగం పై ఎంత భక్తి, ఎంత గౌరవము ఉందో.. జె ఎన్ యు, పాటియాలా ఆవరణల్లో తేలిపోయింది కదా!

ఇది ఎప్పుడో తేలిపోయిన విషయమే ఐనప్పటికీ, హిందుత్వ కపట బూటక జాతీయవాదం, దేశభక్తి పదే పదే బయట పడుతున్నప్పటికీ, ప్రస్తుత సందర్భంలో అది అధికారాన్ని అడ్డం పెట్టుకుని, మెజారిటీ హిందువుల కాపలాదారుగా, ఫాసిస్టు నియంతగా అది స్థిరపడ దల్చుకున్నానని చెప్పకనే చెబుతోంది.

ఇప్పుడది తన కాషాయ ఆహార్యానికి మేక్ ఇన్ ఇండియా, డిజిటల్ ఇండియా, స్మార్ట్ ఇండియా, లిబరల్ ఇండియా అనే కొత్త నగిషీలు, చమ్కీలు కుట్టుకుని, భుజ కీర్తులు తగిలించుకుని పవిత్ర భరతమాతను, భరతజాతిని సామ్రాజ్యవాద అంగడిలో కారుచవకగా అమ్మేయడానికి వెనకాడటం లేదు. సామ్రాజ్యవాద పెట్టుబడి పాదాలచెంత భరతమాతను ఊడిగానికి పెట్టడానికి వెనకాడటం లేదు.

మదపుటేనుగు అంబారీ పై ఒబామాను చక్రవర్తి స్థానంలో కూర్చోబెట్టి, ప్రధాని మోడీని మావటీడుగా ప్రముఖ పత్రికలో చిత్రించుకుని కులికినప్పుడే సంఘ్ పరివార్ దేశభక్తి, జాతీయవాదం ఏపాటిదో తేటతెల్లమైపోయింది. ఇక దీనికి పదే పదే వివరణలు, నిర్వచనాలు ఇవ్వ పనిలేదు. ఇక మిగిలిందల్లా ఈ దేశంలో నిత్య అణచివేతకు, దోపిడీ దౌర్జన్యాలకు, పెట్టుబడి దాష్టీకానికి, నిత్య విస్థాపనకు గురౌతున్న దేశవాసులు, సకల శ్రామిక జనావళి, మేధావులు ఈ కుహనా దేశభక్త, జాతిభక్త చీడ పీడలను ఎలా వదిలించు కోవాలన్నదే ఆలోచించాల్సిన విషయం. 

రెండింటిని సమానంగా చూసి కృషి చేసి తొంభైవ దశకం తర్వాత రెండు ప్రధాన అంశాలు భారతీయ సమాజంలోకి బలంగా వచ్చాయి. 1. హిందూత్వ, 2. ఆర్థిక సంస్కరణలు. ఈ రెండింటి ప్రభావం భారతీయ సమాజంలో సాంస్కృతిక రంగంలో ప్రజల జీవన సంబంధాల్లో పెనుమార్పులకు కారణమయ్యాయి. వేగవంతంగా మారుతున్న నూతన సాంకేతిక విజ్ఞానం, సమాజం మార్కెట్‌గా మారడం, మనిషి అస్తిత్వం బదులు ఒక వస్తువుగా కుదించబడటం. అదే కాలంలో హిందుత్వ రాజకీయాలకు ఊతం పెరగడం ఈ రెండు దశల మధ్య తన కవిత్వ, విమర్శను కొనసాగించిన అద్దేపల్లి ఈ రెండున్నర దశాబ్దాల కాలాన్ని దాని యొక్క రాపిడిని మాత్రమే స్వీకరించి, ఆర్థిక సంస్కరణల మొదటి రెండవ దశలు చేసిన సామాజిక ఆర్థిక విధ్వంసాన్ని గురించి, దాని ఛాయలను అత్యంత బలంగా కవిత్వం చేసినవాడు అద్దేపల్లి. తొలినాళ్ళలో అభ్యుదయ విప్లవ ప్రగతిశీల శక్తులతో నడిచిన కవి. తర్వాతి దశలలో ప్రపంచీకరణ ప్రభావం, అది మనుషుల పట్ల చూపుతున్న ఆర్థిక సాంస్కృతిక పెత్తనాన్ని నిరసిస్తూ తన మొత్తం రచనా వ్యాసాంగంతో వాటి మూలాలవైపు దృష్టి సారించిన కవి. ఆర్థిక రాజకీయ లొంగుబాటు అనివార్యంగా సాంస్కృతిక పతనానికి దారి తీస్తుంది. సంస్కృతిని కోల్పోతే ఒక జాతి తన అస్తిత్వాన్ని కోల్పోయినట్లే అని విశ్వసించి స్థిరంగా నేనిటు వైపు నిలుస్తాను అని ప్రకటించుకొని రచనలు చేసిన అద్దేపల్లి తన ప్రసంగాలలో ప్రపంచీకరణ దాడిని బలంగా నిరసించేవాడు.

అంతర్జ్వాల, మధుజ్వాల, రక్తసంధ్య గోదావరి నా ప్రతిబింబం, సంఘం శరణం గచ్ఛామి, మెరుపు పువ్వు అయినా ధైర్యంగానే, పొగ చూరిన ఆకాశం, ఆకు పచ్చని సజీవ సముద్రం, నా నేల కాలం మీద సంతకం అనే కవితా సంపుటిలు, శ్రీశ్రీ కవితా ప్రస్థానం, విమర్శ వేదిక సాహిత్య సమీక్ష, జాషువా కవితా సమీక్ష కుందుర్తి కవితా వైభవం. కుందుర్తి కవిత, మహాకవిత గీటురాయి, స్త్రీవాద కవిత్వం, దృష్టిపథం, అభ్యుదయ విప్లవ కవిత్వాలు : సిద్ధాంతాలు - శిల్పరీతులు అనే విమర్శనా గ్రంథాలను రచించిన అద్దేపల్లి నిరంతర రచనా వ్యాసాంగంలో ఉన్నవాడు. తన చుట్టూ సాహిత్య వాతావరణాన్ని సజీవంగా ఉంచుకోవడమే కాదు. ఆ వాతావరణం తెలుగు నేల అంతటా ఉండాలని కోరుకున్నవాడు. అద్దేపల్లి రామమోహనరావు అనేక మంది కవులకు రాసిన ముందు మాటలు సంఖ్యారీత్యా ఎక్కువే అయినా, అందరికీ ముందు మాటలు రాస్తారు అనే విమర్శ ఉన్నా కొత్తగా రాస్తున్న కవులలోని మెరుపును స్వీకరించినవారు. కవిత్వం ఎక్కడ పదునుపెట్టాలో విడమరిచి చెప్పినవాడు. ఆ తర్వాత కాలంలో ఎదిగి వచ్చిన రచయితలున్నారు. కవులున్నారు, ఆగిపోయిన వారుండవచ్చు. కాని తాను మాత్రం కవిలోని నిజాయితీని స్వాగతించినవాడు.

అద్దేపల్లిలో రచనా జీవితంలో రెండు స్రవంతులున్నాయి. 1. కవిత్వం, 2. విమర్శ. ఒకే కాలంలో కవిత్వం, విమర్శను రాసినవాడు. అంతేనా సాహిత్యంలోని ఈ రెండు ప్రక్రియలను సమానంగా స్వీకరించినవాడు. కవిగా విస్తరిస్తున్న దశలో విప్లవ సాహిత్యోద్యమ ప్రభావానికి లోనుకావడం, విప్లవ దశను స్వీకరించడం. తన పరిణామ క్రమంలో తెలుగు సాహిత్యంలో బలంగా వస్తున్న దళిత, స్త్రీ మైనారిటీ వాదాల పట్ల మొగ్గు చూపడం అంతిమంగా ప్రపంచీకరణవైపు నిలబడటం స్పష్టమైన ఆలోచనా ధారతో ప్రగతిశీల అంశాల పట్ల మొగ్గు చూపడం కవిగా తాను చెప్పవలసిన రాయవలసిన అంశాల పట్ల మమేకత మాత్రమే కాదు, ధ్వంసమవుతున్న మానవ విలువల పట్ల ఆవేదన. ఆ ఆవేదనను పలికించడానికి అద్దేపల్లికి కవిత్వం ఆలంబన అయింది. వ్యక్తి ఆలంబనేలా అనే ప్రశ్న రావచ్చు. కవిగా అతని ఆవేదన సమంజసమయినదే కావొచ్చు గాని సమూహంలో అతనెక్కడ? అతని కవితాస్థానమెక్కడ? అనే ప్రశ్న కూడా తలెత్తవచ్చు. అయితే అద్దేపల్లిది సామూహిక గానమే. అతని మాటల చివర ప్రజలున్నారు. ప్రజలు ఉండటమంటే ప్రజాపక్షం వహించడమే. కవితా స్థాయి దాని నిర్మాణం జోలికి పోవడం లేదు గాని మొత్తంగా అద్దేపల్లి కవిత్వంలో ప్రజలున్నారు. ఆ కవితా స్వరూపం మారవచ్చు. వస్తువు యొక్క తీవ్రతలో తాను తీసుకున్న చెప్పదలచుకున్న అంశాలు మారవచ్చు. 70లలో విప్లవోద్యమాన్ని సమర్థించిన కవి చివరి దశలో ఆర్థిక సంస్కరణల దగ్గర ఆగవచ్చు. కవి యొక్క రాజకీయ తీవ్రత ఈ దశలో ఆగవచ్చు. కవి పరిణామ క్రమంలో అన్ని కాలాలలో ఒకే రాజకీయ దృక్పథం ఉండవచ్చు, ఉండకపోవచ్చు. అద్దేపల్లిలో కూడా రాజకీయ తీవ్రత మొదటి దశలలో ఉన్నట్లు ఉండకపోవచ్చు అయితే ఆర్థిక అంశాలు ఎలా మనిషిని చిన్నాభిన్నం చేస్తున్నాయో కలత చెంది ఆ బిందువు దగ్గర నుండి చివరి వరకు కవిత్వం రాసినవాడు.

చారిత్రక రక్త సంధ్యలో చెలరేగిన
సామ్యవాద దావాగ్నికి
శ్రీకాకుళ పర్వతంతో జరిగిన పాణిగ్రహణాన్ని

దోపిడీదార్ల గుండె మీదికి సూటిగా విసిరిన ప్రశ్న కొడవల్లి (1972) అంటూ విప్లవోద్యమాన్ని ఎత్తిపెట్టిన అద్దేపల్లి తదనంతర కాలంలో మనిషిని కాదు సాంస్కృతిక విలువల్ని కేంద్రంగా చేస్కొని కవిత్వం రాశారు. ప్రగతిశీల భావనలు ఉండవచ్చుగాని పూర్తిగా ఓ పరిధికి కుచించుకొని ప్రపంచీకరణ వైపు ఆయన కవిత్వం చూసింది. వివిధ దశ, కాలాలలో కవి చూపు ఎటువైపు మొగ్గుతున్నది? లేదా కవి ఆలోచనా స్రవంతిలో మార్పులు చోటు చేసుకోవడం. ఒకనాడు నమ్మిన, ప్రచారం చేసిన విప్లవ భావనలు స్థానే సమాజంలో మార్పు కోసం, సంస్కరణ వాదంలోకి మారిపోవడం, లేదా సంస్కరణ వాదన సరి అయినది అనుకోవడం, ప్రపంచీకరణ స్పందనలు వ్యక్తీకరిస్తే మొత్తం సమాజం మారుతుందనే ఆలోచనకు రావడం అద్దేపల్లిలో గమనించవచ్చు. బహుశా ఈ ధోరణి అద్దేపల్లిది మాత్రమే కాదు. సమాజం మార్చడానికి అగ్గిపుల్లలు కావాలని నినదించిన కవులు

కాలం వంతెనపై నడిచాకా అగ్గిపుల్లలు అవసరం లేదు నీటి ధారలు ఉంటే చాలు అనుకోవడంలోనే అసలు సమస్య. తెలుగు సాహిత్యానికి సంబంధించి నిప్పురవ్వలుగా ఎగిసిన కవులు లేదా రచయితలు తమ అనుభవ పరిధి విస్తరిస్తున్న కొలది జీవితం వివిధ దశలలోకి వెళ్ళే క్రమంలో కవిత్వ రచనలో లోగొంతుక వినపడింది. సమాజ దోపిడీలో నుండి వచ్చిన కల ప్రజల వైపున నిలిచిన కవి తదనంతర కాలంలో సంస్కరణ వాదం దగ్గర నిలబడటం కారణంగా పార్లమెంటరీ రాజకీయాలను విశ్వసించే వామపక్షాల అనుబంధ సాహితీ సంస్థ అద్దేపల్లి రామమోహనరావు తమ సంస్థ బాధ్యుడు అని చెప్పుకోవడానికి ప్రయత్నం చేస్తుంది. రాజకీయ విశ్వాసాలు బలంగా ఉన్న కవి ప్రభావితం చేసిన భావాలను సమర్థించని రాజకీయ పక్షం తరువాతి కాలంలో కవి చెప్పిన అనేక అంశాల పట్ల ఏకీభావన కలిగి ఉంటుంది. ఉదాహరణకు ప్రగతిశీలనుకునే రచయితలు, ఉపన్యాసకులు శ్రీశ్రీ మహా ప్రస్థానాన్ని చూడ నిరాకరిస్తారు. కారణం కవి రాజకీయ విశ్వాసాలు మారడమే. అద్దేపల్లి విప్లవ పంథా నుండి సంస్కరణవాదం వైపు మళ్లినాక కవిగా అద్దేపల్లిని సొంతం చేసుకోవడానికి లేదా ఎత్తిపట్టడానికి తమ భావజాలంలోకి తీసుకోవడానికి సిద్ధంగా ఉంటాయి. అద్దేపల్లి విషయంలో జరుగుతున్న తంతు అదే.

నిజానికి వ్యక్తిగతంగా అద్దేపల్లి స్నేహశీలి, అరమరికలు లేని జీవితం. యువ కవుల పట్ల ప్రేమను కనబరిచే వ్యక్తి హృదయంలోని సున్నితత్వం ఉండేది ఎనిమిది పదుల వయస్సులోను. ఆ సున్నితత్వాన్ని సజీవంగా ఉంచుకున్నారు. అదే సమయాన ఆగ్రహం. ఆవేదన, "ఈ దేశాన్ని చూస్తే భయమేస్తుంది" అనగలిగిన కవి నిజానికి ఈ భయం మానసికమైనదికాదు. ఈ దేశ పాలక వర్గాన్నీ అవి అనుసరిస్తున్న మార్గాన్ని చూసి పలవరించిన భయం. ప్రజల పట్ల ఆర్తిని మాత్రమే కాదు, ఈ దేశం సాంస్కృతిక క్షీణ దశకు చేరుతుందనే ఆందోళన, స్త్రీ మార్కెట్ సరుకుగా మారుతోందనే కలవరం, కుటుంబంలో పిల్లల్ని లాగుతున్న మార్కెట్ విష సంస్కృతి బహుశా తన చివరి రెండున్నర దశాబ్దాల కాలంలో ఈ వలను చూచినవారు అలాంటి వల అల్లికకు కారణమవుతున్న రాజకీయార్థిక ప్రభావాలను గమనించి కలత చెందినవారు. అంత మాత్రమేనా! ఈ కాలంలో తన ఆలోచనా ధార వల్ల స్థానీయత నుండి పల్కించినవాడు. గోదావరి నా ప్రతిబింబం అని అనగలిగిన కవి.

నువ్వు ఆర్యుడివైతే ఏమిటి? ద్రావిడువైతే ఏమిటి?
బహుళ జాతుల రక్తం నీలో ఇంకిపోతున్నప్పుడు -
నువ్వు ప్రభుత్వమైతే ఏమిటి? ప్రజలవైతే ఏమిటి?
అందరం పరాయి ప్రభువుకు బానిసలమై పోతున్నప్పుడు
నువ్వు కళ్ళు తెరచుకుంటే ఏమిటి? మూసుకుంటే ఏమిటి?
కనుపాపల్ని గద్ద తనుకుపోతున్నప్పుడు
నువ్వు మగాడివైతే ఏమిటి? ఆడదానివైతే ఏమిటి?
ఇంకేడి మార్కెట్టుకి సరుకులైపోతున్నప్పుడు -
నువ్వు గతంలో జీవిస్తే ఏమిటి? భవిష్యత్తులో బతికితే ఏమిటి?
వర్తమాన కాలంలో మరణించిపోతున్నప్పుడు -
నువ్వు మాట్లాడితే ఏమిటి? మౌనంగా ఉంటే ఏమిటి?
పరాయికరణ భావాలకి మంట పెట్టలేకపోతున్నప్పుడు -

ప్రపంచీకరణకు నిరసనగా అద్దేపల్లి తాత్వికత ఇది. కళ్ళు మూసుకున్నా తెరిచినా కనుల ముందు కురుస్తున్న పరాయికరణ భావాలను బలంగా నిరసం చినవాడు. రాసినా మాట్లాడినా అతని గొంతులో ముఖంలో నిరసన ధ్వని ఉండేది.

హిందుత్వం, అమెరిక నిజాన్ని
నెత్తిన కిరీటంగా పెట్టుకొని
మైనారిటీ ద్వేషమొక్కటే
విభిన్న ముఖాల మధ్య చెట్లు కూలగొట్టి
ఎడారుల్ని పరుస్తోంది
ఓహ్! హిందుత్వమా
నువ్వు నిజానికి అమెరికనిజానివా!

సామ్రాజ్యవాదం, హిందుత్వం ఈ దేశంలో అణగారిన ప్రజల పట్ల ఎలా వ్యవరిస్తుందో తెలిసిందే. ప్రజల మధ్య అడ్డుగోడల్ని మాత్రమే కాదు ద్వేషమనే చెట్లను నాటుతుంది. హిందుత్వం ఒంటరిది కాదు అమెరికన్ సామ్రాజ్యవాదపు వ్యక్తీకరణే. ఇవాళ సంఘ పరివార్ అనుసరిస్తున్న మార్గాన్ని గమనించినప్పుడు సామ్రాజ్యవాదం హిందుత్వం కలిసినడుస్తున్న స్థితి కనబడుతుంది.

విమర్శకునిగా అద్దేపల్లికి తెలుగు సాహిత్యం పట్ల అవగాహన మాత్రమే కాదు, విశాల దృష్టి ఉన్నది. శ్రీశ్రీ కవితా ప్రస్థానంపై రారా విమర్శను అటుంచితే సాహిత్య విమర్శలో ఎక్కడ స్పందించాలో తెలిసిన విమర్శకుడు. తన దృష్టిపథం నుండి ఏ సాహిత్య ఉద్యమాన్ని, వాదాన్ని, ధోరణులను నిశితంగా గమనించి తను చెప్పదలచుకున్నది చెప్పిన విమర్శకుడు. దళిత, స్త్రీ మైనార్టీ ప్రాంతీయ వాదాలను అంచనా వేయడమే కాదు. సాధికారంగా విశ్లేషించిన విమర్శకుడు. ఆధునికాంతరవాదాన్ని నిరసించినవాడు.

కవిగా విమర్శకునిగా పాలక పక్షంలో చేరనివాడు. ప్రతిపక్ష గొంతుక ఉన్న కవి. ఎక్కడా రాజీ ధోరణి లేదు. చివరి వరకు అసమానతలను క్షీణ సాంస్కృతిక విలువల్ని ప్రశ్నించినవాడు, ధిక్కరించినవాడు. అరవై ఏళ్ళుగా దేశంలో జరుగుతున్న మార్పులకు సాక్షిగా ఉన్నవాడు. 80వ ఏట మూత్రపిండాల వ్యాధితో మరణం అంచులకు వెళ్ళిన కవి. విమర్శకుడు.

కవిత్వం కంటే జీవితం గొప్పది.
కవిత్వం పెదవి కదపక ముందే,
జీవితం రాగాలాపవ చేస్తుంది
కవిత్వం పోరాట గీతం రాయకముందే
జీవితం పోరాటంగా మారిపోతుంది

జీవితాన్ని కవిత్వాన్ని వేరు వేరు విషయాలుగా చూడని కవి - విమర్శకుడు అద్దేపల్లి రామమోహనరావు.



సాహిత్య వ్యాసం

# కాలాన్ని జయించిన ప్రేంచంద్ కథ "ఈద్గా"

మహమూద్

కొన్ని కథలు కలకాలం నిలిచిపోతాయి. అలాంటి కథలో ప్రేంచంద్ రాసిన కథ "ఈద్గా" ఒకటి.

ఒక పేద ముస్లీం కుటుంబం 'ఈద్' చేసుకోలేని దయనీయ స్థితిని తెలిపే కథ. పైకి చాలా సాధారణమైన కథలా అనిపిస్తుంది కానీ చాలా లోతుగా ముస్లీం సమాజాన్ని అర్థం చేసుకొని రాసిన కథ ఈద్గా.

కథ "ఈద్" రోజు మొదలౌతుంది. ఉపవాసాలైపోయాయి. తల్లిదండ్రులు లేని హమీద్ అనే ఆరేళ్ళ కుర్రాడ్ని వాళ్ళ జేజి ఆమీనా కటిక పేదరికంలో పెంచుతుంటుంది. పండగ పూట బిర్యాని మాట అటుంచితే సేమియాలు కూడా చేసుకోలేని స్థితి వాళ్ళది. మిగతా పిల్లలంతా కొత్త బట్టల్లో కళకళలాడుతుంటే హమీద్ మాత్రం బోసిగా ఉంటాడు. మిగతా పిల్లల చేతుల్లో డబ్బులు గలగలమంటుంటే హమీద్ దగ్గర మూడు పైసలుంటాయి. ఈద్ సమాజ్ ముగిసాక పిల్లలు రంజాన్ కోసం ఏర్పాటు చేసిన మేలాలో రకరకాల వస్తువులు కొంటుంటారు. హమీద్ దగ్గర ఉన్న మూడు పైసలతో అతనేం కొనగలడు? మిఠాయిలూ, ఆట వస్తువులు ఒక పక్క ఆకర్షిస్తున్నా హమీద్ మాత్రం ఆరు పైసలు విలువ చేసే చిమ్టాను మూడు పైసలకు బేరం చేసి కొనుక్కుంటాడు. స్నేహితులు ఘెల్లుమంటారు. జేజి రోజూ పెనం మీది రొట్టెలను చేత్తో తిప్పుతూ వేళ్ళు కాల్చుకుంటుంటే ఆమె బాధను దూరం చేయాలనే దూరదృష్టితో ఆ చిమ్టా కొంటాడా అబ్బాయి. ఆ చిమ్టాను చూసి, "ఏ మిఠాయో, బొమ్మలో కొనుక్కోకుండా ఏం పనికొస్తుందని దిన్ని కొన్నావు" అని కసురుకుంటుంది ముసలావిడ. ఆ చిన్ని నోటి నుండి అసలు విషయం తెలుసుకొని గుండెలకు హత్తుకొని కన్నీళ్ళు పెట్టుకుంటుంది. క్లుప్తంగా ఇది కథ. ముస్లీం పేదరికాన్ని చూసి జాలిపడమని చెప్పే కథ కాదు 'ఈద్గా'. అదే ప్రేంచంద్ ఉద్యేశ్యమైతే ఆ కథకి ఈద్గా అని పేరు పెట్టేవాడు కాదు ప్రేంచంద్.

ముస్లీం సమాజంలోని ఆర్థిక అసమానతలను ఒకవైపు ఎత్తి చూపుతూనే మతం చివరికి ఎవరి పక్షాన నిలుస్తుందీ? అది ఎవరి ప్రయోజనాలు కాపాడుతుంది అని చర్చించడం కథ అసలు ఉద్దేశంగా కనబడుతుంది.

ఒక హిందువైన ప్రేంచంద్ ముస్లీంల గురించి చేసిన పరిశీలన అబ్బురపరుస్తుంది. చాలా లోతైన విషయాన్ని ఒక చిన్నపిల్లవాడి వైపు నుండి చెప్తూ సమాజంలోని డొల్లతనాన్ని బహిర్గతపరిచిన కథాశిల్పం అద్భుతం.

ఇస్లాం ప్రకారం ఉపవాసల అసలు ఉద్దేశం పేదల ఈతిబాధల్ని షావుకార్లు అర్థం చేసుకోడానికైతే, రంజాన్ రోజు ఫిత్రా సేమియా కూడా చేసుకొని తినలేని 'గరీబులు' పండుగ సంతోషాన్ని అనుభవించడానికి, ఆ రోజన్న రెండు ముద్దలు ఎక్కువ తినడం కోసమే!

హమీద్ విషయంలో ఫిత్రా ఉద్దేశ ప్రయోజనం నెరవేరలేదు. పేదల కోసమే ఉపయోగించవలసిన ఫిత్రా ఎక్కడికి పోయిందీ? హమీద్‌కు పండుగ సంతోషాన్ని కలిగించకపోతే దాని అవసరం ఏమిటి? హమీద్ లాంటి బీదవాళ్ళకు దొరకని ఫిత్రా ఎవరికి ఉపయోగపడిందీ? పేదలకు ఉపయోగపడేదే అయితే హమీద్‌కు ఎందుకు ఆ పండుగ ఆనందం దొరకకుండా పోయింది. హమీద్‌కు తల్లిదండ్రులు లేరనేది సమాజానికి తెలియదా? హమీద్ ఆర్థిక పరిస్థితి గురించి సమాజానికి తెలియదా? హమీద్ స్నేహితులేమో మంచి స్థితిపరులని కథలో చూపబడింది. మిగతా పిల్లల లాగా బాల్యాన్ని ఆటపాటల్లో గడపాల్సిన హమీద్ లేని పెద్దరికాన్ని తెచ్చిపెట్టుకోవాల్సిన స్థితికి సమాజం అతన్ని దిగజార్చింది. పండుగ ఆనందం చివరికి ఎవరికి దొరికింది ఎవరికి దొరకలేదూ? రంజాన్ అసలు ఉద్దేశాన్ని నెరవేర్చడంలో సమాజం ఘోరంగా విఫలమైంది కానీ ఒక పిల్లాడు జేజి కష్టాన్ని అర్థం చేసుకొని రంజాన్ బోధించే త్యాగగుణానికి ప్రతీకగా నిలచాడు. సమానత్వాన్ని బోధించే ఇస్లాం మతం కూడా ఇక్కడ వర్గ వైరుధ్యాన్ని పరిష్కరించలేకపోయింది. అంటే సమాజాన్ని నడిపిస్తున్నది ఇస్లామ్ సూత్రాలు కాదు వేరే ఆర్థిక శక్తులు నడిపిస్తున్నాయని కథ ద్వారా పాఠకుడు తెలుసుకుంటాడు. ఆ శక్తుల వల్లే హమీద్ కుటుంబానికి రెండు పూటల తిండి కూడా కష్టమైపోయిందని అర్థం చేసుకుంటాడు. ప్రేంచంద్ ముస్లీం సమాజాన్ని లోతుగా అర్థం చేసుకోగలిగాడు కాబట్టే ఆ కథ రాయగలిగాడు. కథ ముస్లీం పేదరికాన్ని ఒకవైపు చూపుతూనే మతం ఆర్థిక అంతరాలను పరిష్కరించ గలుగుతుందా? అనే ప్రశ్నను ముందు పెడుతుంది. ఈద్గా అన్న పేరు ఎందుకు పెట్టాడు? అసలది ఎవరి ఈద్గా? ఈద్గా చుట్టూ ఏమున్నది? అన్న ప్రశ్నలు పాఠకుడికి వదిలేసాడు. ఈద్గా చుట్టూ మార్కెట్ ఉంది ఆ మార్కెట్లో ఉన్న వస్తువులు సాధారణమైన మనుషులు కొనగలిగేవి కూడా కాదు. హమీద్ కొనగలిగింది చిమ్టా మాత్రమే! మతం కన్నా వర్గ వైరుధ్యాలే సమాజంలో ప్రమాఖమైనవి. మార్కెట్ ప్రముఖమైంది. వర్గ వైరుధ్యాలు పరిష్కారమైనవుడే ఆర్థిక వైరుధ్యాలు పరిష్కారమౌతాయని ఈ కథ ద్వారా పాఠకుడు తెలుసుకుంటాడు. ఈ కథ ఒకేసారి వస్తు, శిల్ప ప్రయోజనాన్ని సాధించగలిగింది.

సంఘ పరివార్ దాని అనుయాయులు ముస్లీంలను మత ప్రాతిపదికన చిన్నచూపు చూస్తున్నదాని వెనుక ఉన్నది వర్గ

(మిగతా 59వ పేజీలో...)

# మార్క్స్ పెట్టుబడి - రచనా క్రమం

ఫ్రాన్సిస్ వీన్
అనువాదం: ముక్తవరం పార్థసారథి

(4)

గత సంచిక తరువాయి...

1848 తొలి వారాలలో మానిఫెస్టో రాసే నాటికే, "బూర్జువా పెట్టుబడిదారీ విధానం" వచ్చిన పని పూర్తి చేసుకుని, ఇక తను స్వయంగా సృష్టించుకున్న వైరుధ్యాలలో సమాధి కాక తప్పదని గట్టిగా నమ్మాడు మార్క్స్. ఇన్నాళ్లు చెదరు మదురుగా, ఎవరికి వాళ్లుగా బతుకుతున్న కార్మికులను ఫ్యాక్టరీలలోకి, మిల్లులలోకీ గుంపులుగా చేర్చి, వాళ్ల ఐకమత్యానికి పునాది వేసింది పెట్టుబడిదారీ వ్యవస్థ. ఇక వాళ్లు అజేయశక్తిగా రూపొందుతారు. "అందువల్ల, పెట్టుబడిదారీ విధానం, తన సమాధి తవ్వేవాళ్లను తానే తయారుచేసుకుంటుంది" తను మరణశయ్య మీదున్న వ్యవస్థ గురించి రాస్తున్నాడు గనుక దాని గురించి నాలుగు మంచి మాటలు చెప్పాలనుకున్నాడు. "బూర్జువా విజయాలను కవితాత్మకంగా గానం చేశాడు" అన్నాడొక విమర్శను (మానిఫెస్టో గురించి) దీన్ని మొదటిసారి చదివిన వాళ్లెవరైనా ఆయన పెట్టుబడిదారీ విధానాన్ని ప్రశంసించటం చూసి ఆశ్చర్యపడక తప్పదు.

"బూర్జువా వర్గం, చారిత్రకంగా, ఒక విప్లవాత్మకమైన పాత్ర పోషించింది. తనది పై చేయి అయినప్పుడల్లా అది భూస్వామ్య, పితృస్వామ్య, సెంటిమెంటల్ సంబంధాలకు చరమగీతం పాడింది. కొందరు జన్మతః ఉన్నతులనే భూస్వామ్య భావనలనిది నిర్దాక్షిణ్యంగా నాశనం చేసి మనిషికీ మనిషికీ మధ్య ఉన్నది స్వప్రయోజనం, డబ్బు లావాదేవీలు తప్ప మరేమీ కాదని నిరూపించింది. మత పారవశ్యాన్ని, వీరుల సాహసాలను, ప్రశాంత జీవితాల్ని, "నేను ముఖ్యం" వంటి భావనలకు కాలం చెల్లిందని నిరూపించింది. వ్యక్తుల మధ్య సంబంధాలను వస్తు మార్పిడి సంబంధాలుగా మార్చివేసింది. ఉత్పత్తి సంబంధాలతో, సామాజిక సంబంధాలలో కూడా విప్లవాత్మకమైన మార్పులు తీసుకురావడం ద్వారానే బూర్జువా వర్గం తన మనుగడ కొనసాగించగలదు."



ఇదే ఇతివృత్తాన్ని Das Kapital లో మరింత లోతుగా, మరింత సంక్లిష్టంగా, మరింత విపులంగా చర్చిస్తాడు మార్క్స్. అయితే, ఇప్పుడతనికి ఇంతకన్నా ఎక్కువ రాయటానికి తీరికలేదు. మానిఫెస్టోలోని తొలి వాక్యం - ("యూరోప్‌ను ఒక భూతం ఆవహించింది - కమ్యూనిస్టు భూతం), అలాగే చివరి వాక్యం (కమ్యూనిస్టు విప్లవాన్ని చూసి అధికార వర్గాలు గజగజలాడనీ... అన్ని దేశాల కార్మికులారా ఏకం కండి.) ఈ కరపత్రం ఆందోళనకారుల కరపత్రమని రుజువు చేస్తున్నాయి. కానీ రచనలోని మేధోపటిమ అసామాన్యం. తిరుగుబాట్లు అనివార్యమనిపిస్తున్న దశలో, హడావిడిగా మానిఫెస్టో రచన ముగించాడు. దీనితో సంబంధం లేకపోయినా, మానిఫెస్టో ప్రభావంతో జరిగిందన్నటుగా 1848 ఫిబ్రవరిలో ఇది ప్రచురితమైన వెంటనే, మొదట పారిస్‌లో, తరువాత దావానలంలా యూరోప్‌లోని ఇతర దేశాల్లో విప్లవ జ్వాలలు ఉవ్వెత్తున ఎగిశాయి : ఫ్రాన్సులో లూయీ ఫిలిప్ రాజు గద్దె దిగటంతో ఆదేశాన్ని రిపబ్లిక్‌గా ప్రకటించారు. ఈ పరిణామంతో ఉలిక్కిపడ్డ బెల్జియం ప్రభుత్వం మార్క్స్‌ను ఇరవై నాలుగ్గంటల్లో దేశం విడిచివెళ్లి, మళ్లీ ఎప్పుడూ తిరిగి రాకూడదని ఆదేశించింది. అదృష్టవశాత్తూ, అప్పుడే ఫ్రాన్సులోని తాత్కాలిక ప్రభుత్వం అతడికి ఆహ్వానం పంపింది.

"నిరంకుశత్వం మిమ్మల్ని బహిష్కరించింది. విముక్తి పొందిన కొత్త ఫ్రాన్సు మిమ్మల్ని, మానవ జాతి విముక్తి కోసం ఉద్యమిస్తున్న అందర్నీ రెండు చేతుల్లా ఆహ్వానిస్తుంది." అయితే, పారిస్‌లో నెల రోజులు మాత్రమే గడిపి, జర్మనీలో విప్లవ బీజాలు నాటడానికి కొలోన్ బయల్దేరాడు మార్క్స్. ఎప్పటిలాగే, ఆయన ఆయుధం - అక్షరమే. అక్కడ కొత్త వార్తా పత్రిక న్యూ రైనిష్ జైటుంగ్ ప్రారంభించాడు. ప్రభుత్వం నుండి రకరకాల నిర్బంధం ఎదుర్కొందిది. అభాండాలు వేసినందుకు కోర్టులో ఆయన మీద విచారణ జరిగింది. సెప్టెంబర్‌లో మార్షల్‌లా విధించిన తర్వాత ఒక నెల పాటు పత్రికా ప్రచురణ నిలిపేశారు. ఆ తర్వాత ఫిబ్రవరిలో, విప్లవాన్ని ప్రోత్సహించాడని ఈయన మీద కేసు పెట్టారు గాని, కోర్టులో ఒక బ్రిలియంట్ ఉపన్యాసం తర్వాత మార్క్స్‌ను విడుదల చేశారు. చివరికి 1849 మేలో ప్రష్యన్ అధికారులు, మార్క్స్‌తో సహా ఇతర సంపాదకవర్గ సభ్యుల్ని దేశం వదిలిపొమ్మని ఆదేశించారు.

జూన్ 1849లో పారిస్‌కు తిరిగి వచ్చాడు మార్క్స్. అయితే, అప్పటికే రాజకీయ వాతావరణం మారిపోయింది. విప్లవకారులకు బదులు, రాచరిక సమర్థకులు అధికారంలోకి వచ్చారు. నగరంలో కలరా మహమ్మారి ప్రబలింది. మార్క్స్‌ను మలేరియా తీవ్రంగా ఉన్న (బ్రిటనీ)లోని మార్బిహాన్ నగరానికి వెళ్లాలని ఆదేశించింది ప్రభుత్వం. ఇక, గత్యంతరం లేక యూరోప్‌లో ఇంకా విప్లవకారులందరికి ఆశ్రయమిస్తున్న ఒకే ఒక దేశానికి బయల్దేరాడు మార్క్స్. 1849, ఆగస్ట్ 27 నాడు ఇంగ్లాండుకు సముద్ర ప్రయాణం ప్రారంభించాడు. జీవితాంతం, అంటే 1883 నుండి మరణించిందాక అక్కడే గడిపాడు. "నువ్వు త్వరగా లండన్ చేరుకోవాలి. మన కృషి పునః ప్రారంభించాలి" అని స్విట్జర్‌లాండులో ఉన్న ఎంగెల్స్‌కు వర్తమానం పంపారు.

లండన్ చేరిన కొన్నాళ్ల తర్వాత, ఎలక్ట్రిక్ రైల్వే ఇంజిన్ మాడల్ నొకదాన్ని ఒక షాపులో చూసి మహదానందపడిపోయాడు మార్క్స్. ఆయనను ఆకర్షించి దాని సాంకేతిక నైపుణ్యం కాదు. దానివల్ల ఆర్థికపరంగా సమాజంలో వచ్చే మార్పులు ఆయనలో కొత్త ఆలోచనలు రేకెత్తించాయి. సమస్య అర్థమైంది.

పరిణామాలు అనూహ్యంగా ఉండబోతున్నాయి. రాజకీయాలు ఆర్థిక విప్లవాన్ని అనుసరించకతప్పదు. ఎందుకంటే, ఆర్థిక జీవితానికే మరో అర్థం రాజకీయం అన్నాడు. షాప్ షోకేస్‌లో ఇంజన్ మాడల్‌ను చూసిన మరెవరైనా ఇలా ఆలోచించారో లేదో తెలియదు. మార్క్స్‌కు మాత్రం ఆర్థిక విప్లవానికి నాంది పలికిందది.

1850 జూన్‌లో బ్రిటిష్ మ్యూజియం రీడింగ్ రూంలో ప్రవేశించటానికి అనుమతి సంపాదించి, మరుసటి సంవత్సరమంతా ఆర్థిక శాస్త్ర గ్రంథాలూ పాత సంచికలూ చదువుతూ గడిపాడు. 1851 ఏప్రిల్ నాటికి, "ఎంత సమాచారం సేకరించాడంటే, అయిదు వారాల్లో ఆర్థిక విషయాల గురించి పూర్తి అవగాహన వచ్చింది. ఇంటి దగ్గర కూర్చుని పొలిటికల్ ఎకానమీ రచన పూర్తి చేసి, మ్యూజియంలో మరో శాస్త్రధ్యయనం ప్రారంభిస్తాను" అన్నాడు. రోజూ ఉదయం తొమ్మిదింటి నుండి సాయంత్రం ఏడింటి దాకా రీడింగ్ రూంలో గడిపాడు. కానీ ఆ చదువుకు అంతూ పొంతూ కనిపించలేదు. "పరిస్థితి చాలా గడ్డుగా ఉంది. ఆరు నుండి ఎనిమిది వారాలు కావాలి పని పూర్తి చెయ్యటానికి" అని రాశాడు జూన్‌లో. "ఇతర ఇబ్బందులు కూడా అడ్డుపడుతున్నాయి. మేమున్న ఈ పరిస్థితుల్లో ఈ చికాకులు సహజమే."

. లండన్ చేరిన క్షణం నుండీ కార్ల్, జెన్నీలను ఇంటి సమస్యలు వేధించాయి. వాళ్ళకు అప్పటికే ముగ్గురు పిల్లలు. నవంబర్‌లో నాలుగోసారి ప్రసవించింది జెన్నీ. అద్దె కట్టలేనందుకు, చెల్సీ ఫ్లాట్‌ను బలవంతంగా ఖాళీ చేయాల్సివచ్చిన మార్క్స్ దంపతులు. డీన్‌స్ట్రీట్‌లోని ఒక యూదు వ్యాపారి ఇంట్లో తాత్కాలికంగా తలదాచుకొని తరువాత మరో నివాసానికి మారారు. జెన్నీ మళ్లీ గర్భవతి. ఆమెను అనారోగ్యం వెంటాడింది. జర్నలిస్టుగా బతకాలనే తన కోరికను చంపుకుని, మాంచెస్టర్‌లోని ఎర్మెన్ అండ్ ఎంగెల్స్ ఆఫీసులో చేరాడు ఎంగెల్స్. తరువాతి ఇరవై సంవత్సరాలు అక్కడే గడిపాడు. ఇలా చెయ్యటానికి ఒకే ఒక్క కారణం, మార్క్స్‌కు ఆర్థికంగా సహాయం చెయ్యాలనుకోవటమే. అదనంగా పెట్టుబడి దారీ వ్యవస్థ గురించిన ప్రత్యక్ష సమాచారం, కాటన్ వ్యాపారం గురించిన రహస్యాలు మార్క్స్‌కు ఎప్పటికప్పుడు చేరవేసి ఆయనకు గ్రంథ రచనలో సహాయం చేశాడు. అంతర్జాతీయ విపణి గురించి కూడా మార్క్స్‌కు అనేక విషయాలు తెలియ చేశాడు. ఇలా చేస్తూనే, ప్రతి ఉత్తరంతోపాటు కొన్ని కరెన్సీ నోట్లు కూడా పంపి, ఆదుకున్నాడు (ఇవన్నీ, తండ్రి ఆఫీసు నుండి దొంగిలించినవే...)

అయితే, ఎంగెల్స్ ఎంత సహాయం చేసినా, మార్క్స్ కష్టాలు తీరలేదు. ఎప్పుడూ దారిద్ర్యమే. వాళ్ల రెండు గదుల అపార్ట్‌మెంటులో ఉన్నవన్నీ విరిగిన కుర్చీలు, టేబుళ్లు, అన్నీ చిరిగిన గుడ్డలే. గదుల్లో ఎక్కడ చూసినా దుమ్ము పేరుకుపోయి ఉంటుంది. ఇంటిల్లిపాదీ - తల్లిదండ్రులు, పిల్లలు, లెంచెన్ (కుటుంబ సభ్యురాలుగా బతికిన పనిమనిషి - ఆయా హెలెన్ డీమూత్.) అందరూ వెనక గదిలో పడుకుంటే, ముందుగదిని మార్క్స్‌కు స్టడీరూం, ఆటల గది, వంటలగదిగా ఉపయోగించారు. ఆ ఇంటి మీద నిఘా పెట్టటానికి వచ్చిన ఒక ప్రష్యన్ గూఢచారి, అధికారులకు ఇలా నివేదించాడు. "అది ఇల్లనిపించదు. వీథిలో బతుకుతున్నట్టే ఉంది. మార్క్స్ నిజంగా కాందిశీకుడిలాగే గడుపుతున్నాడు. దేశదిమ్మరి మేధావి అతడు. కొన్ని రోజులు ఏ పనీ చెయ్యకుండా తిరుగుతాడు. మరికొన్నాళ్లు రాత్రింబవళ్లు నిర్విరామంగా పనిలో మునిగిపోతాడు. నిద్రపోవటానికీ, లేవటానికీ ఫలాని సమయమంటూ లేదు. తరచు రాత్రంతా మెలకువగా ఉంటాడు. ఫుల్‌డ్రెస్‌లో రోజంతా సోఫాలో నిద్రపోతాడు. ఈలోగా ఎవరు ఇంటికి వచ్చినా, పోయినా ఆయనకు పట్టదు. అసలే,

**కోటేషన్స్ :**

## గోతె గురించి

గోతెకు దేవుడి గురించి మాట్లాడటం ఇష్టం లేదు ఆయన ఆలోచనలన్నీ మనిషి గురించే మత మౌఢ్యాన్ని అధిగమించిన మనిషి, మతం సంకెళ్లను తెంచుకున్న కళా సృష్టి గోతే ధ్యేయం. ఈ విషయంలో ఆయన షేక్స్‌పియర్ కన్నా ఉన్నతుడు.

## డాంటె గురించి

గతంలో పెట్టుబడిదారీ విధానం పోషించిన విప్లవాత్మక పాత్రకు పూర్తి న్యాయం చేసింది (కమ్యూనిస్ట్) మానిఫెస్టో. తొలి పెట్టుబడిదారీ దేశం ఇటలీ. భూస్వామ్య, మధ్యయుగాల ముగింపు కాలం, ఆధునిక పెట్టుబడిదారీ విధానం ఆవిర్భావ దశలో ఒక మహానుభావుడిక్కడ సంచరించాడు. ఆయనే డాంటె. ఒక ఇటాలియన్. మధ్యయుగాలకే కాదు, ఆధునిక కాలానికి కూడా మహాకవి. చారిత్రకంగా ఇప్పుడు మరో కొత్త తరం పురుడు పోసుకుంటోంది. ఈ కొత్త కార్మిక తరానికి తన కవిత్వంతో ప్రేరణ కలిగించగల మరో డాంటెను ఇటలీ మనకు ప్రస్తావిస్తుందా?

'కమ్యూనిస్ట్ మానిఫెస్టో' ఇటాలియన్ ఎడిషన్‌కు రాసిన ముందుమాటలో ఎంగెల్స్.

## రచయిత - వృత్తి

తను బతకాలన్నా, రచనా జీవితం కొనసాగించాలన్నా ఎంతో కొంత సంపాదించక తప్పదు. కాని అతడు బతకడం కోసం సంపాదించడం కోసమే రాయకూడదు.

రచయితకు తన రచనలు ఒక ఆదాయ వనరు కాగూడదు. అవి ఒక లక్ష్యం దిశగా వేసిన అడుగులు కావాలి. చివరికి అతడు "రచన ముఖ్యమా, ఆదాయం ముఖ్యమా" అని ఎవరైనా అడిగితే రచనే ముఖ్యం అనాలి. నిజమైన భక్తుడు 'నాకు మనుషుల కన్న భగవంతుడే ముఖ్యం' అంటాడు. ఆ భక్తుడూ మనిషే. మనుషుల మధ్యనే, మనుషుల అవసరాలతోనే బతుకుతున్నాడు. అందరికున్న కోరికలే అతడికి ఉంటాయి. అయినా అతడికి దేవుడే ముఖ్యం. కానీ మనం దర్జీని ఒక మంచి కోటు కుట్టమన్నామనుకోండి. ఆనాటి ఫాషన్ ప్రకారం అందమైన కోటు కుడతాడతడు. అంటే, ఆనాటికి ఏది డిమాండ్‌లో ఉంటే ఆ పద్ధతినే అతను అనుసరిస్తాడు. రచనకున్న తొలి స్వేచ్ఛ అది వ్యాపార సరుకు కాకపోవటమే. ఈ మౌలిక సూత్రాన్ని విస్మరించిన రచయిత - సంపాదన కోసం కాక, లక్ష్యం కోసం రాయగలిగే స్వేచ్ఛను కాదనుకున్న వ్యక్తి తన స్వేచ్ఛను స్వచ్ఛందంగా కోల్పోయాడు. అలాంటి మనిషికి మరో నిర్బంధం కూడా అవసరమే. అదే సెన్సార్ అనబడే శిక్ష. ఇలాంటి వాళ్లకు ఇది తప్పనిసరి.

- కార్ల్‌మార్క్స్ Debates on Press Freedom
MEGA, Part I



నిక్కష్టంగా రోజులు గడుస్తున్నాయనుకుంటే, వరుస విషాదాలు మరింత కుంగదీశాయా కుటుంబాన్ని. నవంబర్ 1850లో కొడుకు గుయిడో అకస్మాత్తుగా మూర్ఛ జబ్బుతో మరణించాడు. ఏడాది పిల్ల ఫ్రాంజిస్కా బ్రాంకైటిస్‌తో 1852లో కన్నుమూసింది. మార్చి 1855లో, మార్క్స్ ప్రాణప్రదంగా ప్రేమించిన మరో కుమారుడు ఎడ్గార్ క్షయవ్యాధితో ఈ లోకాన్ని వదిలాడు. ఈ బాధల్ని, వియోగాల్ని భరించలేని మార్క్స్, కొడుకు శవపేటికను సమాధిలోకి విడుస్తున్నప్పుడు, తనూ అందులోకి దూకటానికి ప్రయత్నించాడు.

"మీరు మంచి ఇంటికి మారగలిగితే, ఆరోగ్యకరమైన పరిసరాల్లో ఉండగలిగితే ఎంత బాగుండేది!" అని ఫ్రాంజిస్కా మరణం తర్వాత మార్క్స్‌కు తన సంతాపంలో తెలియచేశాడు ఎంగెల్స్. "పేదరికం, ఆకలి ఆ చిన్నారిని బలిగొన్నాయో లేదో స్పష్టంగా చెప్పలేంగాని, ఇంట్లోని మిగతావాళ్లందరూ తిండికి లేక, అప్పుల వాళ్ల బాధతో నిత్య నరకం అనుభవించారు. మాంసం అమ్మేవాడికి, బ్రెడ్డు అమ్మేవాడికి బాకీలు పెరిగిపోయాయి. ఇక అప్పు పుట్టదు. కోర్టు జవాన్లు సమాన్లు పట్టుకొని ఇంటికి రావటం మామూలైంది. తక్షణం అప్పు తీర్చకపోతే, అరెస్టు వారెంట్ రెడీగా ఉంటుంది. "వారం రోజుల క్రితం నా బాధలన్ని తీరిపోయినట్లని పించింది. పైన వేసుకునే కోటు కూడా తాకట్టు పెట్టాను గనక, వీధిలోకి వెళ్లలేను. మాంసం కొనటానికి డబ్బులేదు. వారం పదిరోజులుగా ఇంటిల్లిపాదీ కేవలం బ్రెడ్డు, బంగాళాదుంపల మీదే బతుకుతున్నారు. ఈ సుఖమైనా ఎన్నాళ్లుంటుందో తెలియదు. ఈ కష్టాల నుడిగుండం లోంచి బయటపడటమెలాగో వూహకందటం లేదు" అని ఫిబ్రవరి 1852లో ఎంగెల్స్‌తో తన బాధపంచుకున్నాడు మార్క్స్. అప్పటికి అతడు న్యూయార్క్ డెయిలీ ట్రిబ్యూన్‌కు యూరోపియన్ విలేఖరిగా వారానికి రెండు వ్యాసాలు రాస్తూ, వ్యాసానికి 2 చొప్పున సంపాదిస్తున్నాడు. కానీ ఈ సంపాదనా, ఎంగెల్స్ చేస్తున్న సాయమూ సరిపోలేదు. మార్క్స్ మాస్టర్‌పీస్ ఆలస్యం కావటానికి ఇవన్నీ కారణాలే.

"ఎన్ని సమస్యలున్నా పని ఆగలేదు. ఇంచుమించు ముగింపు దశకు వచ్చింది. ఇకనేనే బలవంతంగా కొన్నాళ్లు విశ్రాంతి తీసుకుంటున్నాను" అని రాశాడు జూన్ 1851లో. ఇది హాస్యాస్పదం. తన కృషి గురించి ఆయనకు అవగాహన లేదనుకోవాలా! మార్క్స్ తలవంచుకుంటే మిత్రులనూ, రాజకీయాలనూ పక్కన పెట్టి పని కొనసాగించగలడు. కాని ఆయనకా ఉద్దేశం లేదు. ముఖ్యంగా ఈ 'పని' హడావిడిగా, ఆషామాషీగా ముగించదలచుకోలేదు. వందల పేజీల గణాంకాలు, చరిత్ర, తత్వశాస్త్రాల అధ్యయనం, వాదోపవాదాలు - పెట్టుబడిదారీ విధానం యొక్క నగ్న స్వరూపం ప్రపంచానికి బహిర్గతం చెయ్యాలంటే ఇవన్నీ అవసరమేమరి. పరిశోధన పెరిగింది. కొత్త విషయాలు తెలుస్తున్నాయి. దానితో పాటే తను చెయ్యాల్సిన పని ఇంకా చాలా మిగిలే ఉందన్న అవగాహనా పెరిగింది. "ఒక పెద్ద పుస్తకంతో నువ్వు పాఠకుల ముందుకు రావాలి. ఇన్నాళ్లు నువ్వు జర్మన్ పుస్తకాల మార్కెట్‌లో లేనందున ఇలాంటి పుస్తకం తప్పదు" అంటూ నవంబర్ 1851లో సలహా ఇచ్చాడు ఎంగెల్స్.

కాని పుస్తకానికి ఇంకా అవాంతరాలు తొలగిపోలేదు. 1851 డిసెంబర్‌లో ఫ్రెంచి తిరుగుబాటు తర్వాత, అమెరికన్ వారపత్రిక Die Revolution కోరిక మేరకు The Eighteenth Brumaire of Louis Bonaparte రాశాడు. ఆ తర్వాతి సంవత్సరాలు తోటి కాందిశీకులతో పోట్లాటల్లో, వివాదాస్పద కరపత్రాలు, పుస్తకాలు రాయటంలో గడిచాయి. ఈ పోట్లాటలూ, ఈ కరపత్రాలూ అవసరమని మార్క్స్ అభిప్రాయం. తను ఇలా అడ్డుపడకపోతే ఈ దొంగ సోషలిస్టు ప్రవక్తలు, సింహాసనాల మీద కూర్చున్న చక్రవర్తుల కన్న ఎక్కువగా జన సామాన్యాన్ని తమ ఆధీనంలోకి తెచ్చుకుంటారు" ప్రాణాలొడ్డి వీళ్లతో పోరాడతాను. ఈ కుహనా విప్లవకారులు ప్రజల్ని బురిడీ కొట్టించనియ్యను" అన్నాడు. ☆

*విరసం 25వ మహాసభల ఆహ్వాన సంఘ కరపత్రం*

# విరసం మహాసభలను విజయవంతం చేయండి

విప్లవ రచయితల సంఘం 25వ మహాసభలను కృష్ణాజిల్లా విజయవాడలో చలసాని ప్రసాద్ నగర్‌లో, అనసూయమ్మ వేదికపై, నిర్వహించబోతున్నది. అయిదు దశాబ్దాలుగా తెలుగు సాహిత్యరంగంలో విరసానిది ఎన్నదగిన భూమిక. ప్రగతిశీల భావజాల రంగంలో విరసం సాహిత్య సాంస్కృతిక కృషి విస్మరించలేనిది. ఈ కాలంలో ముఖ్యంగా తెలుగు సమాజంలో అనేక ప్రగతిశీల ఉద్యమాలను విరసం ఎత్తిపట్టింది. కథ, కవిత, పాట, నవల, నాటకం, వ్యాసం, సాహిత్య విమర్శ వంటి సాహిత్యప్రక్రియల్లో విప్లవ గతితార్కిక ముద్రను వేయగలిగింది. ఇప్పుడు కృష్ణాజిల్లా విజయవాడ వేదికగా విప్లవ రచయితల సంఘం తన 25వ మహాసభలకు సన్నద్ధమవుతోంది. కృష్ణాజిల్లా అనేక ప్రగతిశీల ఉద్యమాలకు ఊపిరులూదిన ప్రాంతం. వామపక్ష ప్రజాతంత్ర ఉద్యమాలకు చైతన్యస్ఫూర్తి. చల్లపల్లి భూపోరాటంలో అసువులు బాసిన అమరులు, అధికార మార్పిడి జరిగాక మలబార్ సైన్యం విరుచుకుపడిన కాటూరు-ఎమ్రు ఘటనల ద్వారా తీవ్రమయిన నిర్బంధ కాలాలను దాటి ప్రజాపక్షం వహించిన ప్రాంతం. మరోవైపు హేతువాద, నాస్తిక, చార్వాక భావాలను తెలుగు సమాజంలో ప్రోదిచేసిన ప్రాంతం. ఇక్కడి నుండి ప్రగతిశీల భావ ప్రకంపనను స్వీకరించిన యువతరం తమ జీవిత కాలమంతా ఆ పోరాట స్ఫూర్తిని నిలుపుకున్నారు.

ఇటీవలే అమరులైన చలసాని ప్రసాద్, ద్రోణవల్లి అనసూయమ్మ ఆ పోరాట ఉరవడిలో ముందు భాగాన నిలిచిన వారు. ఆ వెలుగులోనే జీవితకాలమంతా విప్లవ సాహిత్య రంగంలో క్రియాశీల భూమిక నిర్వహించిన చలసాని ప్రసాద్ విరసం స్థాపనలోనే కాక తన చివరి ఊపిరి దాకా విప్లవ రచయితల సంఘాన్ని నడిపించడంలో అవిశ్రాంతంగా శ్రమించిన వారు. విరసం నాయకుడిగా విప్లవ మానవుడిగా విరసం ఆయనను జ్ఞాపకం చేసుకుంటుంది. తొలితరం కమ్యూనిస్ట్ కార్యకర్తగా, ఓ గెరిల్లాగా సాయుధ పోరాటంలో పాల్గొని ఆంధ్రప్రదేశ్ రైతు కూలీ సంఘం ఉపాధ్యక్షురాలిగా ద్రోణవల్లి అనసూయమ్మది చెరగని స్ఫూర్తి. చలసాని ప్రసాద్, ద్రోణవల్లి అనసూయమ్మ స్ఫూర్తిని ప్రతిబింబిస్తూ ఆ ఇరువురూ పుట్టి పెరిగి, కమ్యూనిస్టు ఆచరణ క్రమంలో రాటుదేలిన ప్రాంతంలోనే విరసం 25వ మహాసభలు జరగతున్నాయి.

భారతదేశంలో భారతీయ జనతాపార్టీ తన హిందుత్వ సిద్ధాంత పోకడలతో అధికారంలోకి వచ్చాక, సాంస్కృతిక రంగంలోనే కాదు, ప్రజల ప్రాథమిక స్వేచ్ఛపైనే దాడి చేస్తోంది. సమస్త మానవ రంగాలలో సంఘ పరివార్ జోక్యం ఎక్కువవుతోంది. రచయితలపైనా, మేధావులపైనా కత్తిగట్టింది. అయినా తెలుగు సమాజపు బుద్ధిజీవులు, రచయితలు, సంఘ పరివార్‌కు వ్యతిరేకంగా గొంతు విప్పుతున్నారు. మరోవైపు తెలుగు రాష్ట్రాల్లో వచ్చిన కొత్త ప్రభుత్వాలు, అటు కేంద్ర ప్రభుత్వం తమ విధానాలతో ఆత్మహత్యల పరంపరను వేగవంతం చేశాయి. రైతుల ఆత్మహత్యలు, విద్యార్థుల ఆత్మహత్యల గొలుసు విస్తరిస్తోంది. అభివృద్ధి పేరిట ప్రజల్ని నిరాశ్రయులను చేసే ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఈ సంక్షోభ సమయంలో రచయితలు, బుద్ధిజీవుల పాత్ర సమాజంలో ఎంతో కీలకమైనది. విరసం మహాసభలు వీటన్నిటినీ చర్చించబోతున్నాయి.

నాలుగున్నర దశాబ్దాల కాలంలో విరసం తన సాహిత్యసాంస్కృతిక వెలుగును, తెలుగు సమాజంలో నింపగలిగింది. తెలుగు సమాజంలోని అన్ని ప్రగతిశీల ఆలోచనల మెలుగును తనలో నింపుకుంది. మొదటిసారిగా విరసం మహాసభలు విజయవాడలో జరగబోతున్నాయి. ఇవి విరసానికి, సాహితీ మిత్రులకు, సాహిత్య సాంస్కృతిక రంగాలకు మరింత స్ఫూర్తిని నింపగలవు. మహాసభ నిర్వహణలో భాగం కావాలని ప్రగతిశీల ఆలోచనాపరులను, సాహిత్య సాంస్కృతిక రంగాల్లో కృషి చేస్తున్న వారిని వినమ్రంగా కోరుతున్నాం.

- ఆహ్వాన సంఘం

## ఆహ్వాన సంఘం :

అధ్యక్షులు : ఖాదర్ మొహియుద్దీన్
కార్యదర్శి : వరలక్ష్మి
సహాయ కార్యదర్శి : అరసవిల్లి కృష్ణ

## సభ్యులు :

కొత్తపల్లి రవిబాబు, జనసాహితి
కొండపల్లి మాధవరావు, అరసం
సత్యరంజన్, సాహితీస్రవంతి
విశ్వేశ్వరరావు, సాహితీమిత్రులు
మందరపు హైమవతి, ప్రజాస్వామిక రచయిత్రుల వేదిక
కొల్లూరి, ఎక్స్ రే సాహిత్య సంస్థ
అశోక్ కుమార్, శ్రీశ్రీ సాహిత్యనిధి
సి. ఉమామహేశ్వరరావు, సంగమం
ఎన్. అంజయ్య, సోషల్ సైన్సెస్ ట్రస్ట్
బుడ్డిగ జమిందార్, అభ్యుదయ వేదిక
జంపా కృష్ణకిషోర్, జనవిజ్ఞానవేదిక
రవికిషోర్, ప్రజా సైన్స్ వేదిక
డా.ఎస్. రామకృష్ణ, వసుంధర, కె.వి.ఆర్.శారదాంబ స్మారక కమిటీ
గుత్తికొండ సుబ్బారావు, కృష్ణాజిల్లా రచయితల సంఘం
సి.వి.
నాగళ్ళ గురుప్రసాదరావు, సాహితీవేత్త
పెద్దిభొట్ల సుబ్బరామయ్య, కథకులు
పి.సత్యవతి, కథారచయిత
తాటి శ్రీకృష్ణ, విమర్శకులు
సామల రమేష్ బాబు, అమ్మనుడి మాసపత్రిక
పి. రామకృష్ణ, రచయిత, విమర్శకులు
నండూరి రాజగోపాల్, చినుకు మాసపత్రిక
చలపాక ప్రకాష్, రమ్యభారతి త్రైమాస పత్రిక
మాతంగి దిలీప్‌కుమార్, ప్రసారం
శిఖాఆకాష్, కవి
బండి రుక్మిణి ప్రసన్న, కవి
కె. ఆంజనేయకుమార్, కవి
చిత్తలూరి సత్యనారాయణ, కవి
బండ్ల మాధవరావు, కవితా సంపాదకులు
మంజరి లక్ష్మి, విమర్శకులు

## ఆత్మహత్యలు, హిందుత్వ హత్యలుమంద్రస్థాయి యుద్ధ సందర్భం

# విప్లవ రచయితల సంఘం

# 25వ రాష్ట్ర మహాసభలు

**జనవరి 9,10-2016, కా. చలసాని ప్రసాద్ నగర్, కా. ద్రోణవల్లి అనసూయమ్మ వేదిక,**

**(సిద్ధార్థ ఆడిటోరియం, పి.బి.సిద్ధర్థ కాలేజి, మొగల్రాజపురం, విజయవాడ)**

### కార్యక్రమం

**09.01.2016 శనివారం**

ఉదయం 10 గంటలకు : పతాకావిష్కరణ

(నరేంద్ర ధభోల్కర్, గోవింద పన్సారే, కలబుర్గి, అఖ్‌లాక్‌ల ప్రాంగణం)

**11.00 గంటలకు : ప్రారంభ సమావేశం**

(కా. ద్రోణవల్లి అనసూయమ్మ వేదిక)

సభల ప్రారంభం : సి.వి

**ఆహ్వాన సంఘ స్వాగతోపన్యాసం : ఖాదర్ మొహియుద్దీన్**

**కార్యదర్శి నివేదిక**

**సౌహార్ద సందేశాలు**

**1.00 - 2.00 భోజన విరామం**

**2.00 గంటలకు :**

**మంద్రస్థాయి యుద్ధసందర్భం కీనోట్-వరలక్ష్మి**

**2.30కు**

**అంశం:**

**కార్పొరేట్ విద్య-విద్యార్థుల ఆత్మహత్యలు**

**అధ్యక్షత : జగన్,**

**వక్త: ప్రొ.లక్ష్మీనారాయణ**

**పుస్తకావిష్కరణలు : 3.30గంటలకు**

**4.30 గంటలకు:**

**కార్పొరేట్ వ్యవసాయం-రైతుల ఆత్మహత్యలు**

**అధ్యక్షత: గీతాంజలి, వక్త: ఇక్బాల్**

**5.30గంటలకు : కవిగాయక సభ**

**నిర్వహణ : సజ్జా వెంకటేశ్వర్లు, వడ్డెబోయిన శ్రీనివాస్**

**6.30 గంటలకు: సాంస్కృతిక కార్యక్రమాలు**

**'నవ్యాంధ్ర భూదోపిడి'-ప్రజాకళామండలి నాటిక ప్రదర్శన, విరసం, ప్రజాకళామండలి పాటలు**

దేశం డిజిటల్ వెలుగుల్లో తేలిపోతుంటుంది. టెక్నాలజీ టవర్లు గ్రామాలకూ, ఆదివాసీ గూడేలకూ విస్తరిస్తుంటాయి. చేతివేళ్లకు ప్రపంచం అందుతుంటుంది. మనుషులు మాత్రం రాలిపోతుంటారు. ఉత్పత్తిదారులు ఉరిపోసుకుంటారు. భవిష్యత్తు పౌరులు రెండు పదులు దాటకుండానే బతుకు మీద విరక్తితో బలవన్మరణాలకు పాల్పడతారు. లేలేత శరీరాలు ఎన్‌కౌంటర్ అవుతాయి. విశ్వాసాలు విద్రోహాలవుతాయి. ఇండియాలో ఉండాలంటే హిందువుగానే బతకాలని ఫాసిజం కత్తుల ఊరేగింపుతీస్తుంది. మధ్యయుగాల మూర్ఖత్వం శాస్త్రీయభావాలను గేలి చేస్తుంది. ఇది వర్తమాన విషాద విధ్వంస దృశ్యం. ఇది మంద్రస్థాయి యుద్ధ సందర్భం. విరసం మహాసభలు ఈ మంద్రస్థాయి యుద్ధ సందర్భాన్ని రాజకీయార్థిక సాంస్కృతిక కోణాల నుండి చర్చించబోతున్నాయి. విద్యార్థుల, రైతుల ఆత్మహత్యలను, హిందూ ఫాసిస్టులు చేస్తున్న హత్యలను మంద్ర స్థాయి యుద్ధం నేపథ్యంలో విశ్లేషించబోతున్నాయి.

మంద్రస్థాయి యుద్ధం ప్రజలపై, ప్రజాఉద్యమాలపై, రూపొందించబడిన దీర్ఘకాలిక సైనిక రాజకీయార్థిక సాంస్కృతిక వ్యూహం. అది అమెరికన్ సామ్రాజ్యవాదం, అంతర్జాతీయ పెట్టుబడి రూపొందించిన భిన్న పార్శ్వాల ప్రతీఘాతుక యుద్ధతంత్రం. దాన్ని మన దేశ పాలకవర్గం ఉత్పత్తిదాయకమైన ప్రజలపై, విప్లవకర సముదాయాలపై, విప్లవోద్యమాలపై, జాతుల ఉద్యమాలపై అమలు చేస్తోంది. మంద్రస్థాయి యుద్ధం కేవలం సైనిక సంబంధమైనదే కాదు. భావజాల యుద్ధాన్ని గెలవగలిగితే మరే యుద్ధమూ కష్టం కాదని అది అంటుంది. గుత్తపెట్టుబడి తన మీడియాతో 'జనానికి ఏం కావాలో అది ఇవ్వడం కాదు, మనం ఏది ఇవ్వాలో అది జనం తీసుకునేలా చేయాలి' అని చెప్తుంది. సరుకు నుండి యుద్ధం దాకా అన్నిటికీ భావజాల నమ్మతిని ఉత్పత్తి చేస్తుంది. అది నిరంతరం ఒక 'శత్రువు'(ఉగ్రవాదం)ను, ఆ శత్రువుపై మందుగుండును తయారుచేస్తూ ఉంటుంది. మానవ విలువల్ని దిగజార్చే సాంస్కృతిక పొరను అల్లుతూ ఉంటుంది. ప్రజాయుద్ధాలను నివారించడానికి ప్రజల మధ్య యుద్ధాలను సృష్టిస్తుంది. ఇవి మేమంటున్న మాటలు, రాస్తున్న రాతలు కావు. ఇలాంటి మరెన్నో ఎత్తుగడల్ని 'లో ఇంటెన్సిటీ కాన్‌ఫ్లిక్ట్' (ఎల్ఐసీ: మంద్రస్థాయి యుద్ధం) అని పేరు పెట్టుకున్న ప్రతీఘాతుక యుద్ధ వ్యూహం కోసం రూపొందించిన డాక్యుమెంటులో స్వయంగా అమెరికానే రాసుకుంది.

ఈ యుద్ధతంత్రాన్ని భారత ప్రభుత్వం దండకారణ్యంలో అమలు చేస్తున్నది. దేశమంతా అమలు చేస్తున్నది.

ఏ పాలకవర్గానికైనా వ్యవస్థను పరిరక్షిస్తూ, దానితో ఘర్షణ పడే పురోగామి శక్తులను అణచివేసే వ్యూహం ఒకటుంటుంది. భారత బూర్జువా వర్గం ఒరలో ఇవాళ మంద్రస్థాయి యుద్ధ తంత్రం ఉన్నది. అందులో బలప్రయోగమూ ఉన్నది. దానికి సమ్మతిని కూడగట్టుకొనే సాంస్కృతిక భావజాలాల నిరంతర ఉత్పత్తి కూడా ఉన్నది. దీనికి మనదేశ నిర్దిష్ట పరిస్థితుల్లో సనాతన ధర్మం ఉపయోగపడుతున్నది. పాలకవర్గానికి మంద్రస్థాయి యుద్ధంలో హిందుత్వ ఒక సాంస్కృతిక ఆయుధంగా పదునెక్కుతోంది.

సంఘపరివార్ సాంస్కృతిక భావజాలం సనాతన బ్రాహ్మణీయ ఆధిపత్య వ్యవస్థలో ఉంది. బ్రిటిష్ వలసవాదంతో వివిధ సమూహాలు తలపడే సమయంలో జాతీయవాదానికి సనాతనధర్మానికి ముడిపెట్టి హిందుత్వ సిద్ధాంతాన్ని అది రాజకీయ రంగం మీదికి తెచ్చింది. దాని రాజకీయ ప్రతినిధి తిలక్ అయితే భావజాల, సాంస్కృతిక ప్రతినిధి వివేకానందుడు. భారత బూర్జువా, ఫ్యూడల్ వర్గాల ప్రతినిధి అయిన గాంధీది, జాతీయ కాంగ్రెస్‌ది కూడా హిందూ సాంస్కృతిక జాతీయవాదమే. పటేల్ నుండి నెహ్రూ దాకా అందరూ అందులో ఒదిగిపోయి ఆ వర్గప్రయోజనాలు కాపాడారు.

బ్రాహ్మణీయ హిందూ సాంస్కృతిక జాతీయవాదం ఒక్క సంఘపరివార్ భావజాలమే కాదు, అది మొత్తంగా భారత పాలకవర్గాల భావజాలం. సనాతన ధర్మం, కులం అర్ధవలస, అర్ధభూస్వామ్య ఉత్పత్తి సంబంధాల మీద ఆధారపడి పునరుత్పత్తి అవుతున్నాయి. అందువల్ల వలసానంతరం ఏర్పడ్డ భారత రిపబ్లిక్ సెక్యులరిజాన్ని వక్రీకరించిన అర్థంలో స్థిరపరిచింది. రాజ్యం చేతిలో మతం ఒక ఆయుధంగా ఉంటూ వచ్చింది. వ్యవస్థ పనితీరులో సెక్యులరిజం నిజమైన అర్థంలో భాగం కాలేదు కాబట్టే అది సంఘపరివార్ విస్తరణకు, ఎదుగుదలకు అన్ని అవకాశాలు ఇచ్చింది. కాంగ్రెస్ గానీ, మరే పాలకపక్ష పార్టీ గానీ దాన్ని అడ్డుకోవడం మాట అటుంచితే, దానికి ప్రత్యక్ష, పరోక్ష సహకారాలను అందించాయి. మతం రెడీమేడ్ ఆయుధం గనక స్వయంగా కూడా అవి హిందుత్వ ఆయుధాన్ని ధరించాయి. కశ్మీర్ జాతి అణచివేత, సిక్కుల ఊచకోత మొదలు అయోధ్య నుండి ముజఫర్‌నగర్ దాకా అటువంటి అనేక ఉదాహరణలున్నాయి. ప్రజాస్వామ్యంలో అతి ప్రధాన అంశం భిన్నత్వాన్ని అంగీకరించి గౌరవించడం. భిన్న సమూహాల్ని సామాజికంగా, ఆర్థికంగా అభివృద్ధి చేయడం. కానీ మన పార్లమెంటరీ ప్రజాస్వామ్యం భిన్నత్వాన్ని వాడుకునే ఓట్ల రాజకీయాల సంకుచిత పరిధిలోనే ఉండిపోయింది. అది ప్రజల నిర్ణాయకశక్తిని ఎప్పుడూ వెలికితీయదు. ఈ స్థితిలో ఉన్న సమాజంలో పాలకవర్గ అనుకూల మెజారిటీ భావజాలాన్ని తయారుచేయడం కష్టం కాదు. నిరంతరం దాన్ని జనం మెదళ్ళలోకి చొప్పిస్తూ సమయానుకూలంగా దాన్ని ఎగదోస్తూ ఉండటం కూడా ప్రతీఘాతుక యుద్ధవ్యూహమే. భారతదేశ రాజకీయార్థిక వ్యవస్థ కులవ్యవస్థను, మతతత్వ భావజాలాన్ని పునరుత్పత్తి చేస్తూనే ఉంది.

సామ్రాజ్యవాదం వలసవాదంగా వచ్చి మన దేశంలోని సనాతన ధర్మాన్ని, హిందుత్వను వాడుకున్నట్లే.. వలసానంతరం కూడా ప్రపంచ వ్యాప్తంగా మతంతో దానికి విడదీయలేని సంబంధం ఏర్పడింది. భారత బూర్జువా వర్గం సామ్రాజ్యవాద ఆర్థిక ఆదేశాలకు లోబడి ఉంటుంది కాబట్టి దేశీయ సంస్కృతి గురించి ఎంత మాట్లాడినా సంఘపరివార్‌కు సామ్రాజ్యవాద మార్కెట్ పట్ల అనుకూలత ఎక్కువ. ఎంతగానంటే సంఘపరివార్ రాజకీయ ముఖానికి అతివాద రూపమైన మోడీ కార్పొరేట్ ఇండియాకు, బహుళజాతి పెట్టుబడులకు ప్రతినిధి అయ్యాడు. అటు బహుళజాతి మార్కెట్ తన లక్ష్యాలను, ఇటు సంఘపరివార్ తన సాంస్కృతిక జాతీయవాద ఎజెండాను మోడీ ద్వారా వేగవంతంగా ముందుకు కదిలించాలని అనుకున్నాయి. దేని పాత్ర అది నిర్వర్తిస్తూ వస్తోంది. దేశమంతా ఒక పక్క అసహనం గురించి చర్చ జరుగుతోంటే, మరోవైపు పెద్ద చర్చ కాకుండానే అతి పెద్ద ప్రభుత్వ రంగ సంస్థ రైల్వేల ప్రైవేటీకరణ నిర్ణయం జరిగిపోయింది.

---

**10.01.2016 ఆదివారం**
**ఉదయం 10 గంటలకు**
**అంశం:**
**హిందుత్వ హత్యలు-సాంస్కృతిక మూలాలు**
**అధ్యక్షత: చంద్రయ్య**
**వక్త : బాసిత్**
**పుస్తకావిష్కరణలు : 11.00 గంటలకు**
**12.00 గంటలకు**
**అంశం :**
**రిజర్వేషన్ వ్యతిరేక ఆందోళనలు-అగ్రకులతత్వం**
**అధ్యక్షత : కిరణ్**
**వక్త : కాశీం**
**1.00 - 2.00 : భోజన విరామం**
**2.00 గంటలకు:**
**అంశం:**
**మంద్రస్థాయి యుద్ధం-ప్రజాప్రతిఘటన**
**అధ్యక్షత: పాణి**
**వక్త: రివేరా**
**4.00 గంటలకు : బహిరంగ సభ**
**అధ్యక్షత : కొత్త కార్యదర్శి**
**వక్తలు:**
**వరవరరావు**
**కళ్యాణరావు**
**దుడ్డు ప్రభాకర్**
**అరసవెల్లి కృష్ణ**

అటువంటి కనీసం పది పదిహేను నిర్ణయాలు ఒక్క ఏడాది కాలంలోనే కనీస చర్చ లేకుండానే పార్లమెంటులో పాసైపోయాయి. సంఘపరివార్, కార్పొరేట్ శక్తుల ప్రయోజనాలు ఒక్కచోటే కలిసిన స్థితికి చేరుకునేసరికి హిందుత్వ హత్యలు, దేశవ్యాప్తంగా లక్షలాది రైతుల ఆత్మహత్యలు నమోదవుతున్నాయి. వ్యవస్థ సంక్షోభానికి రెండూ సాంస్కృతిక, ఆర్థిక ప్రతిబింబాలు. అంతేకాదు, మంద్రస్థాయి యుద్ధానికి దేశ సామాజిక పునాదిపై గురి చూడటమనే లక్ష్యం ఉన్నది. దీని వల్ల ఆర్థిక వ్యవస్థ సంక్షోభంలో పడిపోతుంది. ఎల్‌పిసీలో భాగంగా భారత పాలకవర్గం ఈ పని చేస్తూ ఉంది. రైతుల, విద్యార్థుల ఆత్మహత్యలు దాని పర్యవసానమే.

భూస్వాముల ప్రయోజనాలు కాపాడటం కోసం దేశంలో అపరిష్కృతంగా వదిలేసిన భూమి సమస్య అలా ఉండగా, వ్యవసాయం బహుళజాతి మార్కెట్ పాలబడింది. దేశీయ వ్యవసాయ ఉత్పత్తుల మార్కెట్‌ను, ఉత్పత్తి విధానాన్ని, రైతు అనుకూలంగా, ప్రజల అవసరాలు తీర్చే విధంగా సంస్కరించకుండా ప్రభుత్వాలు అనుసరించిన కార్పొరేట్ అనుకూల ఆర్థిక విధానాల ఫలితంగా మొత్తం వ్యవసాయం సంక్షోభంలోపడి రైతులకు మోయలేని భారమైపోయింది. ఆత్మహత్యలు రోగగ్రస్త వ్యవస్థకు సంకేతాలైతే మరి విద్యార్థుల ఆత్మహత్యలు అంతకన్నా హీనమైన స్థితికి సంకేతాలు కావాలి. వ్యవసాయ సంక్షోభం తారాస్థాయికి పోయి కనిపించని శత్రువుతో ఘర్షణ పడలేని రైతులు లక్షలాదిగా చనిపోతున్నారు. భవిష్యత్తును తీర్చిదిద్దడం ఏమోగానీ కనీసం జీవించి ఉండడానికి ఆత్మవిశ్వాసాన్ని కూడా విద్యావ్యవస్థ ఇవ్వడం లేదు. ఒకప్పుడు సమాజాన్ని విప్లవాలబాట నడిపించిన విద్యార్థుల గురించి మాట్లాడుకున్న వాళ్లం ఇప్పుడు వ్యవస్థ క్రౌర్యానికి నిస్సహాయంగా ప్రాణాలు విడుస్తున్న యువతను ఎందుకని చూస్తున్నాం? ప్రపంచంలోని ఏ సమస్యకైనా స్పందించే విద్యార్థులను, విద్యార్థి ఉద్యమాలను నీరుగార్చే ఒక పకడ్బందీ ఎల్‌పిసీ వ్యూహం కనీసం వియత్నాం యుద్ధకాలం నుండి అమలు జరుగుతోంది. విద్య లక్షల కోట్ల లాభాల మార్కెట్ సరుకయ్యింది. చాలా విచిత్రంగా హిందూ సనాతన ధర్మాన్ని యూనివర్సిటీల్లో చొప్పించే ప్రభుత్వమే విదేశీ విశ్వవిద్యాలయాలకు అనుమతులిస్తోంది. బహుశా అక్కడ కార్పొరేట్ ఆధ్యాత్మికత బోధిస్తారు కావొచ్చు.

హిందుత్వతో సమాజం అనివార్యంగా పడాల్సిన ఘర్షణ, తేల్చుకోవలసిన స్థితి ఇక ఇప్పుడు వచ్చింది. ఎందుకంటే అది పుస్తకాలు రాసినందుకు, మాంసం తిన్నందుకు కూడా హత్యలు చేసే స్థితికి వచ్చింది. అయితే కేవలం సాంస్కృతిక పోరాటమే దీనికి సరిపోదు. హిందుత్వ ఏ వర్గభావజాలానికి పుడుతున్నదో ఆ వర్గంతో రాజకీయ పోరాటం తప్పనిసరి. ఆ దిశగా భావజాల, సైద్ధాంతిక పోరాటమూ అనివార్యం. ఈ నేపథ్యంలో జరుగుతున్న విరసం మహాసభలకు అందరికీ అహ్వానం.



*(52వ పేజీ తరువాత...)*

ప్రయోజనమే! భారతదేశంలో ముస్లీములంతా దాదాపుగా కష్టజీవులే! కష్టం చేసుకునే వాళ్ళ శ్రమను దోచుకోడానికి వాళ్ళను రెండో తరగతి పౌరులుగా, నిత్యం భయంలో, అభద్రతలో కొట్టుమిట్టాడుకునేలా చేయడం ద్వారానే సాధ్యమౌతుంది. దానికున్న సవాలక్ష సాధనాల్లో మతం ఒక అదనపు ఆయుధం. ముస్లీంల ఆర్థిక పరిస్థితి మీదనే వారి గురి. వాళ్ళకు అది లేకుండా చేయడమే వాళ్ళ లక్ష్యం. కాగా ముస్లీంల బీదరికం వెనుక ఉన్న రాజకీయార్థిక అంశాలను ఏ మాత్రం పట్టించుకోకుండా వారిని కార్యశూరులుగా తయారు చేయవలసింది పోయి వారి సమస్యకు పరిష్కారంగా ఐదు పూటల నమాజులో చూపే ప్రయత్నం చేయడానికి ముస్లీం బూర్జువా వర్గం ప్రయత్నిస్తుంటుంది. ఈ రెండు శక్తుల మధ్య సాధారణ ముస్లీం నలిగిపోవడమే ఈ దేశంలో ముస్లీంల చరిత్ర.

ఈద్గా కథ స్వాతంత్ర్య పోరాటం కాలం నాటిది. అరవై ఏళ్ళ స్వేచ్ఛా భారతంలో ముస్లీంల పరిస్థితి అప్పటికంటే భిన్నమైందేమీ కాదు. ఇప్పుడింకా దయనీయంగా ముస్లీంల పరిస్థితి తయారైందని సచార్ కమిటీ తేల్చి చెప్పింది. పుండు మీద కారం చల్లినట్టూ ఇప్పుడు ఎవరైతే అధికారంలో ఉండకూడదో వాళ్ళే ఉన్నారు. కథలో చెప్పినట్లు అల్లా కూడా పేదవాళ్ల మొర విననప్పుడు వాళ్లెక్కడి పోవాలి. ముస్లీం షావుకార్లు రాజకీయనాయకులకు తొత్తులుగా మారిపోయారు. ముస్లీం బూర్జువా వర్గం ఈ దేశంలో ఇస్లాం మతాన్ని శాసిస్తున్నదనీ అర్థం అవుతున్నది. ముస్లీంల వెనుకబాటు తనం మీద పోరాటం చేయడానికి ఇక్కడ ఒక్క నాయకుడు పుట్టకపోవడం వెనుక కారణాలనూ చరిత్ర పరిణామ క్రమాన్ని అర్థం చేసుకోవాల్సిన అవసరాన్ని ఈద్గా కథ గుర్తు చేస్తున్నది.



కరపత్రం

### దండకారణ్యంపై వైమానిక దాడులు, కేంద్ర సైనిక బలగాల మోహరింపు

# గ్రీన్‌హంట్-3, సల్వాజుడుం-2లను వ్యతిరేకించండి

### దండకారణ్యంలో ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనాకు, క్రాంతికారీ జనతన సర్కార్‌కు అండగా నిలవండి!

2005 నుంచి దండకారణ్య ఆదివాసులు క్రాంతికారీ జనతన సర్కార్‌ను నిర్మించుకొని నిర్వహించుకుంటున్నారు. ఈ విప్లవ ప్రజాస్వామిక రాజ్యాధికార వ్యవస్థను ధ్వంసం చేయడానికి భారత ప్రభుత్వం 2009లో ఆపరేషన్ గ్రీన్‌హంట్‌ను ప్రారంభించింది. లక్షల బలగాలు హత్యలు, అత్యాచారాలు చేస్తున్నాయి. ఆదివాసులు నిర్మించుకున్న అభివృద్ధి వ్యవస్థలను ధ్వంసం చేస్తున్నాయి. ఆపరేషన్ విజయ్, ఆపరేషన్ హాకాలను దాటి గ్రీన్‌హంటే 3వ దశను మోదీ ప్రభుత్వం కొనసాగిస్తున్నది. ఇందులో భాగంగా దండకారణ్యంపై వైమానిక దాడులు మొదలయ్యాయి. ముఖ్యంగా దక్షిణ బస్తర్‌పై వైమానిక దాడులు జరుగుతున్నాయి. కేంద్ర మంత్రి వర్గం దండకారణ్యంలోకి సైన్యాన్ని పంపాలని నిర్ణయం తీసుకుంది. సల్వాజుడుం ఆరంభకుడు మహేంద్రకర్మ కుమారుడు ఛవీంద్రకర్మ సల్వాజుడుం - 2ను ప్రారంభించి ఆదివాసులపై దారుణమైన దాడులు చేస్తున్నాడు.

గ్రీన్‌హంట్-3, సల్వాజుడుం-2 మొదలయ్యాక దక్షిణ ప్రాంతంలో తీవ్రస్థాయి అణచివేత కొనసాగుతున్నది. 2015 సెప్టెంబర్-నవంబర్ వరకు జరిగిన దాడులు, హత్యల వివరాలు ఇలా ఉన్నాయి. 2015 సెప్టెంబర్, నవంబర్‌లలో పోలీసు ఉన్నతాధికారులు ఢిల్లీ, రాయపూర్‌ల నుంచి కేంద్ర ప్రభుత్వ రక్షణ సలహాదారుడు అజిత్‌జోవల్, ప్రత్యేక శిక్షణ సలహాదారు కె. విజయకుమార్ జగ్దల్‌పూర్, సుక్మా, దంతెవాడ, బీజాపూర్‌లలో పోలీసు అధికారులతో సమావేశమైనట్లు మీడియాలో వచ్చింది. ఆ తర్వాత ఆ ప్రాంతాల్లో తీవ్రమైన దాడులు, హత్యలు జరుగుతున్నట్లు తెలుస్తోంది. ఆపరేషన్ గ్రీన్‌హంట్-3లో భాగమే ఇదంతా అనే వార్తలు వస్తున్నాయి.

వైమానిక దాడుల కోసం బీజాపూర్ జిల్లాలో అక్టోబర్ 2015 రెండో వారంలో కోబ్రా బలగాలు, డిఆర్‌జి, డిఫ్ బలగాలు హెలికాప్టర్‌లలో గరుడ కమాండోలు దాడులు చేసి డ్రిల్స్, రిహార్సల్ చేశాయి. ఈ మేరకు ఐ.జి. కల్లూరి రాయ్‌పూర్‌లో అక్టోబర్ 21న పత్రికా సమావేశం నిర్వహించాడు.

తెలంగాణ, ఛత్తీస్‌ఘడ్ సరిహద్దుల్లో ఏర్‌స్ట్రైక్ డ్రిల్ చేసినట్లు, స్థానికులు ఆ శబ్దాలు విన్నట్లు తెలుస్తోంది. దక్షిణ బస్తర్‌లో బాసగూడెం తదితర ప్రాంతాల్లో ప్రజలపై తీవ్ర స్థాయిలో దాడులు జరుగుతున్నాయి. మహిళలపై అత్యాచారాలు జరుగుతున్నాయి. ముఖ్యంగా బుడిగిన్‌లో 25 మంది మహిళలను, పెద్ద గెల్లూర్‌లో 22 మంది మహిళలను భౌతికంగా దాడి చేసి వేధించారు. నలుగురు మహిళలపై (ఇందులో 13 ఏళ్ల బాలిక కూడా ఉంది) అత్యాచారం చేశారు. దర్భా మోపాడ్‌లో ప్రజలపై దాడి చేసి కొట్టారు. 15 మందిని అరెస్టు చేశారు. మాడ్ డివిజన్‌లో ఒక సంఘ కార్యకర్తను అరెస్టు చేసి లాకప్‌లో చిత్రహింసలు పెట్టి చంపేశారు. పశ్చిమ బస్తర్‌లో అక్టోబర్ 6న బండారుపల్లి గ్రామంపై దాడి చేసి మహిళలను విపరీతంగా కొట్టారు. ఈ దుర్మార్గాన్ని ఖండిస్తూ ప్రజలు తమ నిరసనను అనేక రూపాల్లో తెలియజేస్తున్నారు.

ఇదే పరిస్థితి దక్షిణ బస్తర్‌లో కూడా ఉంది. నవంబర్ 3న దోర్నపాల్ ఏరియాలో అర్లంపెల్లి గ్రామంపై పోలీసులు దాడి చేసి ముగ్గురు సాధారణ ప్రజలు దూది భీమా, వెట్టి లచ్చు, సోడి మూయలను కాల్చి చంపారు. ఈ ఘటనను నిరసిస్తూ గ్రామ ప్రజలు దోర్నపాల్ పోలీసు స్టేషన్ ముందు ధర్నా నిర్వహించారు. కాంగ్రెస్ పార్టీ కూడా ఈ దుర్మార్గమైన హత్యలను ఖండించింది.

నవంబర్‌లో పెద్ద గెల్లూర్ వద్ద జరిగిన ఫైరింగ్‌లో ఇద్దరు ఆదివాసి కార్యకర్తలు చనిపోయారు. అలాగే నవంబర్ 19న బెజ్జి దగ్గర జరిగిన ఎన్‌కౌంటర్‌లో ఇద్దరు ఆదివాసి కార్యకర్తలు చనిపోయారు. గ్రీన్‌హంట్-3లో భాగంగా సెప్టెంబర్ 26న కుంట-వింజరం మధ్య టంకెన్‌తొర్రె అనే ఏరియాలో రోడ్ పైన పోలీసు క్యాంపు ఏర్పాటు చేశారు. ఇక ఆ ప్రాంతంలో ఎలాంటి అణచివేత ఉండబోతోందో ప్రజాస్వామికవాదులు ఎవరైనా ఊహించగలరు. పశ్చిమ బస్తర్‌లో కూడా గ్రీన్‌హంట్‌లో భాగంగా నిరంతరం కూంబింగ్ జరుగుతున్నట్లు, గ్రామాలపై దాడులు జరుగుతున్నట్లు వార్తలు వస్తున్నాయి. జూన్ నుండి నవంబర్ 10 వరకు మద్దేడ్ ఏరియాలో విప్లవకారులపై అనేక సార్లు కాల్పులు జరిగినట్లు వార్తలు వచ్చాయి. సెప్టెంబర్ 26న గంగులూర్ ఏరియాలోని పుంబాడ్ గ్రామంపై పోలీసులు పూనెం రుక్ని, పొట్టెం మంగూ అనే ఇద్దరు కార్యకర్తలను చంపేశారు. మంగూను పట్టుకొని చెట్టుకు కట్టేసి చేతులు కాల్చేసారు. కత్తులతో పొడిచారు. నాలుకను కోశారు.

నవంబర్ 13లో బైరంగడ్ ఏరియాలోని ఆత్పూర్ గ్రామ తుడెం పార వద్ద జరిగిన కాల్పుల్లో రైను, రుక్ని, మడ్కం జున్నిక, పాయిలను కాల్చేశారు. నవంబర్ 20న కమలూర్ ఏరియాలో జిర్కా గ్రామం దగ్గర జరిగిన ఎన్‌కౌంటర్‌లో ఒక మహిళ చనిపోయింది.

దర్భా డివిజన్‌లోని కాంగేర్ ఘాట్‌లో నిత్యం దాడులు జరుగుతున్నాయి. నవంబర్ మొదటి వారంలో కోలేంగ్ అనే గ్రామంలో కొత్తగా పోలీస్ క్యాంప్ వేశారు. సెప్టెంబర్ 19న సోనాధర్, లక్ష్మణ్‌లను పోలీసు బలగాలు కాల్చేశాయి. అక్టోబర్ 7న కాంగేర్ ఘాట్ దగ్గర చాంద్‌మెట్ట దగ్గర దూది పీసో అనే మహిళను కాల్చేశారు. నవంబర్ 22న నాగల్‌గూడెం దగ్గర నలుగురు మహిళలను కాల్చేశారు. అక్టోబర్ 7న మలింగేర్ ప్రాంతంలో మాడావి భీమాల్ అనే ఆదివాసిని కాల్చేశారు.

ఇవన్నీ వేర్వేరు పత్రికల్లో వచ్చిన వార్తల్లో కొన్ని మాత్రమే. అందరూ చూసే ఉంటారు. అయితే ఇవన్నీ ఇలా క్రోడీకరించడం ఎందుకంటే... ఆపరేషన్ గ్రీన్‌హంట్-3ను మోదీ, రాజ్‌నాథ్ ప్రారంభించాక దండకారణ్యంలో పరిస్థితి ఎలా ఉందో మరోసారి తెలియజేయడానికే, నరేంద్ర మోడీ ఆర్భాటంగా ప్రకటించిన మిషన్-2016 లక్ష్యమే విస్థాపన వ్యతిరేక ఉద్యమాన్ని ఉక్కుపాదంతో అణచివేసి, ఆదివాసులకు అండగా నిలిచిన విప్లవోద్యమాన్ని నిర్మూలించడం. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు మధ్య భారతంలోనూ, మహారాష్ట్రలోని గడ్చిరోలి అడవుల్లోను ఉన్న ప్రకృతి సంపదను బహుళజాతి కంపెనీలకు కట్టబెట్టడానికే ఈ హింసా విధ్వంసాలకు, దాడులకు పూనుకుంటున్నాయి.

ఇందుకోసం దండకారణ్యంలో ఒక సైనిక శిక్షణా కేంద్రాన్ని, హెలీ ప్యాడ్‌లను, వైమానిక బల (ఎయిర్ ఫోర్స్) స్థావరాలను (స్టేషన్లను) నెలకొల్పారు. మాడ్‌ను చత్తీస్‌గడ్ మిగిలిన ప్రాంతాల నుంచి గడ్చిరోలీ నుంచి ఏకాకిని చేయడానికి ప్రత్యేక దుర్గమ అర్థ సైనిక దుర్గాలను నిర్మించారు. ఎందుకంటే రాజ్యం మాడ్‌ను విప్లవోద్యమానికి గుండెకాయని భావిస్తున్నది.

ఒకవైపు ప్రజలపై ఇంత పెద్ద ఎత్తున యుద్ధం చేస్తూ, మరో వైపు చత్తీస్‌ఘడ్ ముఖ్యమంత్రి మావోయిస్టులతో చర్చల ప్రతిపాదన చేయడం నయవంచన తప్ప మరేమీ కాదు. చత్తీస్‌గడ్‌లో కేంద్ర భద్రతా సలహాదారు అజిత్ డోవల్, సీనియర్ భద్రతా సలహాదారు కె. విజయ్‌కుమార్ పర్యటన తర్వాత మావోయిస్టు పట్టు బలంగా ఉన్న ప్రాంతాల్లో వైమానిక దాడులు జరుగుతుండగా రమణ్‌సింగ్ చర్చల ప్రతిపాదన చేయడం గమనించవలసిన ద్వంద నీతి.

ఈ నేపథ్యంలో మన దేశ ప్రకృతి సంపదను మనమే కాపాడుకోవాలని, మన దేశ సార్వభౌమత్వం అత్యున్నతమైనదని భావించే దేశభక్తులు, ప్రజాస్వామికవాదులు ఈ గ్రీన్‌హంట్ ఆపరేషన్ మూడవ దశకు చేరుకున్న ప్రజలపై యుద్ధాన్ని విశాలమైన ఐక్యతతో ప్రతిఘటించాలని విజ్ఞప్తి చేస్తున్నాం.

# సూర్యోదయం కుట్రకాదు! కవిత్వం కుట్ర కాదు!
# విరసం కార్యవర్గ సభ్యుడు కా. కాశీం పై కుట్ర, రాజద్రోహ కేసును వెనక్కి తీసుకోవాలి అప్రజాస్వామిక ఊపా చట్టాన్ని రద్దు చేయాలి

తెలంగాణ రాష్ట్రంలో తొలి కుట్ర కేసు నమోదైంది. అదీ ఒక రచయిత మీద. కుట్ర కేసుల చరిత్ర చూస్తే అదేమీ ఆశ్చర్యం కలిగించదు. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో పార్వతీపురం కుట్ర కేసు మొదలు సికింద్రాబాద్, రాంనగర్, తిరుపతి, ఔరంగాబాద్ కుట్రకేసుల దాకా అన్నింటిలో రచయితలపై కుట్ర ఆరోపణలు చేసింది రాజ్యం. ఇప్పుడు కాశీంపైనా అదే కుట్ర. కా. కాశీం కనీసం ఇరవై ఏళ్లుగా, అంటే మలితరం తెలంగాణ విద్యార్థి ఉద్యమం నుండి ప్రజా ఆచరణలో ఉన్నవాడు. తెలంగాణ రాష్టం కోసం విద్యార్థి దశ నుండి ఎన్నో పోరాటాల్లో భాగమైన వాడు. అదేమీ కుట్ర కాదు. ఆయన మట్టి పరిమళాల, బతుకు అలజడుల కవిత్వం రాసిన వాడు. సాహిత్య విమర్శకుడు, సైద్ధాంతిక రాజకీయ విశ్లేషణలు అందించే మేధావి, వక్త. 'నేను తెలంగాణోన్ని మాట్లాడుతున్న (వ్యాసాలు)', 'తెలంగాణ ఉద్యమాలు - పాట (వ్యాసాలు)', 'కాశీం కవిత్వం', 'తెలంగాణ సాహిత్య వ్యాసాలు', 'పాలమారిన పాలమూరు (దీర్ఘకవిత)', 'గుత్తికొండ (దీర్ఘ కవిత)', 'మానాల (దీర్ఘకవిత)', 'వర్గీకరణ నాలుగు వ్యాసాలు', 'ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు-విద్రోహ రాజకీయాలు (వ్యాసాలు)', 'ప్రపంచీకరణ వ్యతిరేక సాహిత్యం (పిహెచ్‌డి సిద్ధాంత గ్రంథం)', 'ప్రపంచీకరణ వ్యతిరేక కవిత్వం (ఎంఫిల్ పరిశోధన పత్రం)' వంటి పదికి పైగా పుస్తకాలు ప్రచురించాడు. తెలంగాణ రాష్ట్ర ఉద్యమంలోనే కాదు బహుశా రెండు తెలుగు రాష్ట్రాల్లో ఈ పరిచయమంతా అక్కరలేని పేరు ఆయనది. కాశీం విప్లవం ద్వారా సమాజిక మార్పు సాధ్యమనే ప్రాపంచిక దృక్పథం కలవాడు. ప్రజాస్వామిక తెలంగాణను కోరుకున్నాడు. అది నేరం కాదు. ఆయన సంపాదకత్వం వహిస్తున్న 'నడుస్తున్న తెలంగాణ' మాసపత్రిక తెలంగాణలో బలమైన ప్రతిపక్ష గొంతుక. ఈ నెల 20న మేదక్ జిల్లా ములుగు పోలీస్ స్టేషన్‌లో మావోయిస్టు కొరియర్‌గా అనుమానిస్తున్న ఎం. శ్యాంసుందర్ రెడ్డి అనే వ్యక్తితో పాటు కా. కాశీంను రెండవ ముద్దాయిగా చూపుతూ మావోయిస్టులకు లేఖలు రాశాడని అభియోగం మోపారు పోలీసులు. ఐ.పి.సి 120బి, 121ఎ, 124 సెక్షన్ల కింద (ప్రభుత్వాన్ని కూలదొయాలనే నేర పూరిత కుట్ర, రాజద్రోహం, తన మాటలు, చేతల ద్వారా చట్టబద్ధంగా ఎన్నికైన ప్రభుత్వంపై విద్వేషాన్ని ప్రేరేపించే ప్రయత్నం చేశాడని), చట్ట వ్యతిరేక కార్యకలాపాల నిరోధక చట్టం (UAPA - Unlawful Activities Prevention Act) సెక్షన్ 10, 18 కింద (నిషేధిత సంస్థలో సభ్యుడని, టెర్రరిస్టు చర్యలకు పూనుకున్నాడని) కేసు నమోదు చేశారు. పోలీసులు సృష్టించిన లేఖలతో పాటు మావోయిస్టు అనుబంధ పత్రికలుగా 'నడుస్తున్న తెలంగాణ' పత్రికలు చూపిస్తూ కుట్ర రచన చేశారు. ప్రభుత్వ గ్రంథాలయాలు, యూనివర్సిటీలు సహా తెలంగాణ రాష్ట్రంలో, బైటా ఎంతో మంది చదివే పత్రికను కూడా కుట్రలో చూపడం మరింత అన్యాయం.

గతంలో రెండు సార్లు కామ్రేడ్ కాశీంపై చట్టవ్యతిరేక కార్యకలాపాల నిరోధక చట్టం (ఏజుఆజు) కింద కేసు నమోదు చేసినప్పుడు విచిత్రంగా ఆయన్ను పరారీలో ఉన్న నిందుతుడిగా పేర్కొన్నారు. ఆయన ఉస్మానియా యూనివర్సిటీలో ప్రతిరోజూ విద్యార్థులకు పాఠాలు చెప్తాడని, బహిరంగ సామాజిక ఆచరణలో ఉంటాడని ప్రభుత్వానికి తెలియంది కాదు. ఇది ప్రజాస్వామిక స్వరంపై ప్రభుత్వ దాడి. భావప్రకటనపై మానసిక యుద్ధం. ఆయనపై నమోదైన కేసుల స్వభావమే అత్యంత అప్రజాస్వామికమైనది. బ్రిటీష్ కాలం నాటి రాజద్రోహం అనే చట్టంతో పాటు తీవ్రవాదాన్ని అరికట్టే సాకుతో వచ్చిన టాడా, పోటా కన్నా దుర్మార్గమైన ఊపా ఒక రచయిత మీద నమోదు చేయడంలోనే రాజ్య స్వభావం అర్థం అవున్నది. తెలంగాణలో ప్రజాస్వామిక హక్కులకు భరోసా ఇస్తూ అధికారంలోకి వచ్చిన ప్రభుత్వ స్వభావం కూడా అంతిమంగా సాధారణ పాలక వర్గ స్వభావమే అని ఏదైతే విరసం చెప్తూ వస్తున్నదో దాన్ని అడుగడుగునా రుజావు చేస్తూ చివరికి కవి మీద కుట్ర చేసేదాకా వచ్చింది. ఇప్పుడు దేశంలో పరమ అప్రజాస్వామిక చట్టాలతో ఒక రచయితను అరెస్టు చేయడానికి రంగం సిద్ధం చేశారు.

దేశ చరిత్రలో ప్రజలపై, ప్రజాస్వామికవాదులపై ఎంతో అణచివేతను ప్రయోగించిన టాడా, పోటా వంటి అప్రజాస్వామిక చట్టలు తీవ్ర నిరసనలతో వెనక్కి పోగా అంతకన్నా దుర్మార్గమైన ఊపా చట్టం రంగం మీదికొచ్చింది. సెప్టెంబర్ 21 దాడులను సాకుగా చేసుకొని వచ్చిన ఈ చట్టం దేశవ్యాప్తంగా ప్రజాస్వామిక ఉద్యమ గొంతుకలపై, విస్థాపన సమస్యపై పోరాడుతున్న ఆదివాసులపై రాజ్యం ప్రయోగిస్తూ వస్తున్నది. కేవలం అనుమానంతోనే అరెస్టు చేసే అధికారం ఈ చట్టం ద్వారా పోలీసులకు సంక్రమిస్తుది. నిర్దోషినని స్వయంగా నిరూపించుకునే దాకా ఈ కేసు మోపబడ్డ వ్యక్తి నేరస్తుడే. ఈ చట్టాన్ని ఉపయోగించుకుని ప్రభుత్వం వందలాది కేసులు నమోదు చేసింది. ఢిల్లీ యూనివర్సిటీ ప్రొఫెసర్ సాయిబాబాను, తొంబై శాతం అంగవైకల్యంతో తీవ్ర అనారోగ్యంతో ఉన్నప్పటికీ ఏడాదిన్నరగా అమానుష పద్ధతుల్లో నిర్బంధించి చిత్రహింసల పాలు చేస్తున్నది. కా.కాశీంపై కేసు ప్రజాస్వామిక గొంతుల్ని నొక్కివేసే చర్యల్లో భాగమే.

ఒక వైపు దేశమంతా ఆర్.ఎస్.ఎస్., బి.జె.పి. ఫాసిజం కరకు కోరల్లో చిక్కుకుపోతోంది. సందుసందునా హిందూ మతం పేరుతో అరాచక శక్తులు చెలరేగిపోతున్నారు. ముస్లింలను, దళితులను, రచయితలను, బుద్ధిజీవులను వెంటాడుతున్నారు. హైదరాబాద్ సెంట్రల్ యూనివర్సిటీ విద్యార్థి ఆత్మహత్యకు కారకులైన వారిపై చట్టపరమైన చర్యలు తీసుకోవాలని విద్యార్థిలోకం పోరాడుతోంది. ప్రభుత్వం మాత్రం ప్రజాస్వామికవాదులపై కేసులు నమోదు చేసి అరెస్టులు చేస్తోంది. తెలంగాణ వస్తే అక్రమ కేసులన్నీ ఎత్తేస్తామని హామీ ఇచ్చాడు చంద్రశేఖరరావు. ఇప్పుడు ఆయన ప్రభుత్వమే ఫాసిస్టు మూకల చర్యలకు నిశ్శబ్ద ఆమోదాన్ని తెలుపుతూ, ప్రజాసంఘాల కార్యకర్తలపై అక్రమ కేసులు పెడుతున్నది. కామ్రేడ్ కాశీంపై కేసు అప్రజాస్వామికం. నమోదు చేసిన UAPA అంతకన్నా అప్రజాస్వామికం. కా. కాశీంపై కేసును ఎత్తివేయాలని, అట్లాగే UAPAను రద్దు చేయాలని అందరం కలిసికట్టుగా డిమాండ్ చేద్దాం. ప్రభుత్వ అణచివేత విధానాన్ని నిరసించాల్సిందిగా రచయితలూ, ప్రజాసంఘాలూ, ప్రజాస్వామికవాదులకు విరసం విజ్ఞప్తి చేస్తున్నది.

విప్లవ రచయితల సంఘం

తేది : 28.01.2016

# ప్రజాకళాకారుడు కోవన్ ను వెంటనే విడుదల చేయాలి. రచయితలు కళాకారులపై రాజ్యహింసను ఖండించండి

దేశంలో భిన్నాభిప్రాయాన్ని, బహుళత్వాన్ని సహించలేని వాతావరణంపై రచయితలు, కళాకారులు, చరిత్రకారులు, శాస్త్రవేత్తలు ఒక్క గొంతుగా నిరసన తెలియజేస్తున్నారు. వివిధ రంగాల్లోని ఆలోచనాపరులు ప్రభుత్వాన్ని నిలదీస్తున్నారు. అంతర్జాతీయ రచయితల వేదికల నుండి ఇక్కడి రచయితలకు, కళాకారులకు సంఘీభావం వస్తున్నది. ఇదంతా ఒక పక్క జరుగుతుండగానే తమిళనాడులో ఒక ప్రజా కళాకారుడిపై రాజద్రోహం కేసు నమోదైంది. తమిళనాడులో ప్రసిద్ధ ప్రజాకళాకారుడు కోవన్ గత కొద్ది నెలలుగా జరుగున్న మద్యం వ్యతిరేక పోరాటంలో గొంతు కలిపాడు. పీపుల్స్ ఆర్ట్ అండ్ లిటరరీ అసోసియేషన్ (పాలా)లో బాధ్యుడాయన. ఈ సంస్థ గత 30 ఏళ్లుగా ప్రభుత్వ ప్రజా వ్యతిరేక విధానాలకు వ్యతిరేకంగా సాంస్కృతిక పోరాటం చేస్తున్నది. అఖిల భారత స్థాయిలో ఏర్పడిన ఆల్ ఇండియా లీగ్ ఫర్ రెవల్యూషనరీ కల్చర్ (ఏఐఎల్ ఆర్ సి)లో కూడా ఇది భాగస్వామ్య సంస్థ. స్వయంగా కోవన్ మూడు దశాబ్దాలుగా అసంఖ్యాకంగా పాటలు రాస్తూ, గానం చేస్తూ ఉన్నాడు. ఇప్పుడు ఆయన ప్రభుత్వ మద్యం వ్యాపారంపై రాసి, ట్యూన్ చేసి పాడిన రెండు పాటలు బహుళ ప్రచారంలోకి వచ్చాయి. ముఖ్యంగా యూ ట్యూబ్ లో పెట్టిన ఆ రెండు పాటల వీడియోలు ఇంటర్నెట్ మాధ్యమం చేర్చగలిగిన విస్తృత ప్రజానీకంలోకి వెళ్లిపోయాయి. ఇటీవలి కాలంలో మొదలై విస్తరిస్తున్న తమిళ ప్రజల మద్యం వ్యతిరేక పోరాటానికి ఈ పాటలు ఎంతో ఉత్తేజాన్నిస్తున్నాయి.

మద్యం రీటైల్ వ్యాపారం చేస్తున్న తమిళనాడు రాష్ట్ర మార్కెటింగ్ కార్పొరేషన్ ను, తాగుడు వ్యసనాన్ని ప్రోత్సహిస్తున్న ప్రభుత్వాన్ని, నేరుగా ముఖ్యమంత్రిని ఈ పాట టార్గెట్ చేయడం ప్రభుత్వానికి ఆగ్రహం కలిగించింది. అక్టోబర్ 29, 30 మధ్యరాత్రి 2 గంటల ప్రాంతంలో పోలీసులు విపరీతమైన ఉద్రిక్తతను సృష్టించి కోవన్ ను అరెస్టు చేయడానికి కారణం ఆయన ఈ పాటలు రాయటమే. పోలీసులు ఏ కారణమూ చెప్పకుండా ఆయన మీద పడి కొట్టి, బలవంతంగా వాహనంలోకి ఎక్కించుకొని పోయారు. అరెస్టు చేసింది సైబర్ పోలీసులని చెప్పారు. దాదాపు ఒక రోజంతా ఆయనను కలవడానికి లాయర్ ను అనుమతించలేదు. హెబియస్ కార్పస్ పిటిషన్ వేసిన తర్వాతనే 124 (ఏ) రాజద్రోహం సహా విద్వేషాలు రెచ్చగొట్టాడని 153 (ఏ), 505/1 సెక్షన్ల కింద కేసులు నమోదు చేసి కోర్టులో ప్రవేశపెట్టారు. పాటలో ప్రభుత్వం మీద తీవ్ర విమర్శలు, ముఖ్యమంత్రి మీద అవమానకరమైన వ్యాఖ్యలు ఉన్నాయని చెప్పి రాజద్రోహం ముద్ర వేసి ప్రజాకళాకారుడిని నిర్బంధించడాన్ని విరసం తీవ్రంగా ఖండిస్తున్నది. సమాజంలో పెచ్చరిల్లిపోతున్న అసహన వాతావరణం గురించి ఆందోళన వ్యక్తమవుతున్న తరుణంలో అల్లరి మూకల్ని అదుపు చేసి భావప్రకటనా స్వేచ్ఛకు హామీ పడాల్సిన ప్రభుత్వాలు దాని పట్ల మౌనం వహిస్తూ ఉండటమే గాక స్వయంగా అవే భావాల గొంతు నులుముతున్నాయి. దీనిని ప్రజాస్వామిక వాదులంతా నిరసించాలని, లౌకిక ప్రజాస్వామ్య పరిరక్షణ కోసం ఒక్కటైన రచయితల కళాకారుల నిరసన గొంతులు ప్రజాకళాకారుడు కోవన్ విడుదల కోసం కూడా గొంతువిప్పి అదే ఐక్యతా స్ఫూర్తిని చాటాలని విరసం విజ్ఞప్తి చేస్తున్నది. ప్రభుత్వం వెంటనే కోవన్ ను విడుదల చేయాలని ఆయనపై పెట్టిన అక్రమ కేసుల్ని వెనక్కితీసుకోవాలని డిమాండ్ చేస్తున్నది.

**పి.వరలక్ష్మి** (విరసం కార్యదర్శి),
**వరవరరావు** (విరసం సీనియర్ సభ్యులు)

04.11.2015

# ఆహారాన్ని శాంతి భద్రతల సమస్యగా మలచి మతోన్మాద ఫాసిజాన్ని అమలు చేస్తున్న ప్రభుత్వ కుట్రను ఖండిస్తున్నాం

బీఫ్ తింటామన్నందుకు ఉస్మానియా విద్యార్థులు సహా వారి సాంస్కృతిక నిరసనకు సంఘీభావం ప్రకటించిన ప్రజాసంఘాల కార్యకర్తలను ప్రపంచ మానవ హక్కుల దినం సాక్షిగా ఇటు హైదరాబాదులో, అటు విజయవాడలో అత్యంత అప్రజాస్వామికంగా అరెస్టు చేశారు. హైదారాబాదు మరోసారి పోలీసు క్యాంపు అయింది.

ఒక సాంస్కృతిక అంశాన్ని శాంతి భద్రతల సమస్యగా ఎట్లా మార్చవచ్చో రాజ్యానికి బాగా తెలుసు. బీఫ్ తింటే ప్రాణాలు పోవు. బీఫ్ తింటే ప్రభుత్వ, ప్రైవేట్ ఆస్తులు ధ్వంసం కావు. బీఫ్ తింటే పౌర స్వేచ్ఛకు భంగం కలగదు. బీఫ్ తింటే ఏ మెజారిటీ మనోభావాలూ గాయపడి రక్తమోడవు. ఈ దేశంలో ఎన్నో శతాబ్దాలుగా బీఫ్ తినడం ఉంది. బీఫ్ రాజకీయం ఎప్పుడయ్యింది? మత ఉద్రిక్తత ఎప్పుడయ్యింది? చేస్తున్న వాళ్ళెవారు? కత్తులు చూపిస్తున్నవాళ్ళెవారు? చట్టాన్ని చేతుల్లోకి తీసుకున్నవాళ్ళెవరు? దాడులు చేస్తున్నవాళ్ళెవరు? బీఫ్ రాజకీయాలు చేస్తున్న వాళ్ళు గాక ఆ రాజకీయాలను ప్రశ్నిస్తున్న వాళ్ళు శాంతి భద్రతల సమస్య ఎట్లా అయ్యారు?

దేశంలో చోటుచేసుకుంటున్న ప్రమాదకర పరిణామాల పట్ల ఉస్మానియా విద్యార్థులు వివిధ రూపాల ద్వారా నిరసన వ్యక్తం చేస్తున్నారు. చదువు మీద, మాట మీద, పాట మీద, కలల మీద అణచివేతను అమలు చేసిన బ్రాహ్మణీయ సంస్కృతి ఇప్పుడు

తిండి మీద దాడులు చేస్తున్నదని, విద్యార్థులు సూటిగానే కాదు, అత్యంత సృజనాత్మకంగా ప్రశ్నిస్తున్నారు. ప్రజాస్వామిక సాంస్కృతిక వేదికలో భాగమై చర్చలు, కవి సమ్మేళనాలు, పుస్తక ప్రచురణలు కూడా చేపట్టారు. డిసెంబర్ పదిన విందు ఏర్పాటు చేశారు. వంద మంది కూడి వాళ్లకిష్టమైన భోజనం చేయడం కోర్టు దాకా పోవలసిన విషయమైనప్పుడు మన సమాజంలో భావ సంఘర్షణ ఎంత అధమ స్థాయిలో ఉందో అర్థమవుతున్నది. ఈ విందును అడ్డుకోవడానికి పోలీసులు మోహరిస్తారు, గూండాలూ మోహరిస్తారు. న్యాయస్థానమూ ఆదేశాలిస్తుంది.

విద్యార్థులు రాజకీయాలు మాట్లాడకూడదు. సంస్కృతి గురించి మాట్లాడకూడదు. చరిత్ర గురించి మాట్లాడకూడదు. సైన్సు కూడా మాట్లాడకూడదు. సాధువులు మాట్లాడొచ్చు. ఖడ్గాలు మాట్లాడొచ్చు. బీఫ్ ద్వారా కనీసం మూడు నాలుగు సంవత్సరాలుగా విద్యార్థులు చర్చిస్తున్న ఈ అన్ని విషయాలు తరగతి గదుల గోడలు దాటి, కెరీయర్ సంకుచిత పరిధులు దాటి, విశాల సామాజిక ఆవరణను చేరుకున్నాయి. 'విశ్వ'విద్యాలయానికి అర్థం అదే కదా? మీ ఇంట్లో బీఫ్ తినండి, క్యాంపస్ లో కాదు అని చెప్తున్న వాళ్ళు ఎవరి ఇంట్లో వాళ్ళు తినే ఆహారం దేశ రాజకీయ రంగంపైకి ఎలా వచ్చిందో చెప్పాలి. మనసులోనో, పూజ గదిలోనో ఉండాల్సిన దేవుడు విద్యాలయాలను ఎందుకు ఆక్రమిస్తున్నాడో చెప్పాలి. ఒక్క ఉస్మానియా యూనివర్సిటీ క్యాంపస్ లోనే విద్యార్థులు ఎన్నెన్ని మూలల నిలబడి ఎన్నెన్ని మౌలిక ప్రశ్నలు అడుగుతున్నారో వాటన్నికి సమాధానం చెప్పాలి.

ఆహారం ప్రాణమెలా తీస్తోందో, వందలాది మందిని జైళ్ళలో ఎలా పెడుతోందో, అంతర్జాతీయ మానవ హక్కుల దినాన్ని హక్కుల అణచివేత దినంగా ఎలా మారుస్తోందో దేశ చరిత్రలో ఘనంగా నమోదవుతోంది. అదే సమయంలో అన్నీ సాంస్కృతిక ధిక్కారాలు కూడా. ఉస్మానియా విద్యార్థుల ఉద్యమ స్ఫూర్తికి అభినందనలు తెలుపుతూ, మోడీ, కేసీయార్, చంద్రబాబుల ఫాసిజాన్ని నిరసిస్తూ

పి.వరలక్ష్మి (విరసం కార్యదర్శి)

తేదీ: 10/12/2015

# అద్దేపల్లి రామ్మోహనరావు గారికి విరసం నివాళి

ప్రముఖ కవి, విమర్శకులు అద్దేపల్లి రామ్మోహనరావు ఈ మధ్యాహ్నం మరణించారని తెలిసింది. ఆయనకు విరసం నివాళి ప్రకటిస్తున్నది. అద్దేపల్లి రామ్మోహనరావు గారు ప్రజాస్వామిక సాహిత్యోద్యమానికి ఎంతగానో దోహదం చేసిన వారు. చివరి దాకా సామ్రాజ్యవాద వ్యతిరేక, భూస్వామ్య వ్యతిరేక సాహిత్యం పక్షాన నిలిచారు. విప్లవ సాహిత్యోద్యమానికి, విరసానికి ఆయన మిత్రుడు. అయిదు దశాబ్దాలపాటు ప్రగతిశీల, ప్రజాస్వామిక ఉద్యమాలతో కొనసాగినవారు. ఆయన కవి, విమర్శకులే కాక మంచి వక్త కూడా. ప్రజాస్వామిక రచయితల సంఘంలో కూడా ఆయన పనిచేశారు. అభ్యుదయ, విప్లవ సాహిత్యోద్యమ పత్రిక సృజనతో ఆయనకు అనుబంధం ఉంది. ఆయన కొడుకు అద్దేపల్లి ప్రభు చాలా కాలం విరసంలో ఉన్నాడు. ఆయనకు, ఆయన కుటుంబ సభ్యులకు, మిత్రులకు విరసం ప్రగాఢ సానుభూతి తెలియజేస్తూ అద్దేపల్లి రామ్మోహనరావు గారికి విప్లవ రచయితల సంఘం నివాళులర్పిస్తున్నది.

పి.వరలక్ష్మి (విరసం కార్యదర్శి),
వరవరరావు (విరసం సీనియర్ సభ్యులు)

తేదీ: 13/01/2016

# విశ్వవిద్యాలయాల్లో బ్రాహ్మణీయ ఆధిపత్యం రోహిత్ మృతికి కారకులను కఠినంగా శిక్షించాలి

దేశంలో విశ్వవిద్యాలయాలన్నీ మైనార్టీ, నిమ్న, దళిత విద్యార్థుల పాలిట కళేబాలుగా మారుతున్నాయి. హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయంలో పరిశోధక విద్యార్థి రోహిత్ వేముల ఆత్మహత్య దీన్ని రూఢీ చేస్తున్నది. విశ్వ విద్యాలయాలను మతరాజకీయాలకు కేంద్రంగా మలుచుకోదలుకున్న బి.జె.పి. చర్యలే రోహిత్ మృతికి కారణం. జ్ఞాన బండాగారాలుగా విలసిల్లాల్సిన విశ్వవిద్యాలయాలు బ్రాహ్మణీయ ఆధిపత్య శక్తుల కబంధ హస్తాల్లో నలిగిపోతుండడానికి నిదర్శనమే దళిత విద్యార్థుల సస్పెన్షన్, బలవన్మరణాలు. మద్రాస్ ఐఐటిలో అంబేద్కర్ పెరియార్ స్టడీ సెంటర్‌ని బ్యాన్ చేయడం మొదలు హెచ్‌సీయూలో ఐదుగురు విద్యార్థుల బహిష్కరణ దాకా బ్రాహ్మణీయ ఆధిపత్యమే కనిపిస్తుంది. భిన్న అభిప్రాయాల్ని సహించలేని మతోన్మాద రాజకీయాలు విద్యార్థుల జీవితాలతో చెలగాటమాడుతున్నాయి. ఇలాంటి పరిస్థితుల్లో విద్యార్థిలోకమంతా యూనివర్సిటీల స్వయం ప్రతిపత్తి కోసం పోరాడుతూనే యూనివర్సిటీల్లో పాలకుల జోక్యాన్ని నిరోధించే దాకా పోరాడాలి. గత కొంతకాలంగా యూనివర్సిటీల్లో సాగిన, సాగుతున్న అణచివేత విధానాలపై నిష్పాక్షిక విచారణ జరిపించి దోషులను కఠినంగా శిక్షించాలని విప్లవ రచయితల సంఘం డిమాండ్ చేస్తోంది. విద్యార్థులకు అన్ని విధాలా రక్షణ కల్పించాలి.

పి.వరలక్ష్మి (విరసం కార్యదర్శి),
వరవరరావు (విరసం సీనియర్ సభ్యులు)
పాణి, కాశీం, బాసిత్,
రాంకి, రివేరా (విరసం కార్యవర్గ సభ్యులు)

18.01.2016

# కా. కాశీంపై పెట్టిన అక్రమ కేసును వెనక్కి తీసుకోవాలి

కాశీం విరసం కార్యవర్గ సభ్యుడు. ఆయన రాసిన కవితా సంకలనం, తెలంగాణ సాహిత్య వ్యాసాల పుస్తకాలు హైదారాబాద్ బుక్ ఫెయిర్ లో, విరసం మహాసభల్లో ఇటీవలే విడులయ్యాయి. నడుస్తున్న తెలంగాణ పత్రిక సంపాదకుడిగా ఆయన తెలంగాణ అంతా తెలిసిన వ్యక్తి. తెలంగాణ రాష్ట్ర ఉద్యమంలో బలమైన గొంతుక. సాహిత్యాభిమానులు, ప్రజాసంఘాల కార్యకర్తలు తరచూ తెలుగు రాష్ట్రాల్లో ఎక్కడో ఒక చోట ఆయన ప్రసంగాలు వింటూ ఉంటారు. ఆయన ఉస్మానియా యూనివర్సిటీ తెలుగు శాఖలో ప్రొఫెసర్. క్రమం తప్పకుండా విద్యార్థులకు పాఠాలు చెప్తూ ఉంటాడు. గతంలో రెండు సార్లు ఆయనపై చట్టవ్యతిరేక కార్యకలాపాల నిరోధక చట్టం (UAPA) కింద కేసు నమోదు చేసినప్పుడు విచిత్రంగా ఆయన్ను పరారీలో ఉన్న నిందుతుడిగా పేర్కొన్నారు. ఇప్పుడు తాజాగా మెదక్ జిల్లా ములుగు పోలీస్ స్టేషన్ లో మావోయిస్టు కొరియర్ గా అనుమానిస్తున్న వ్యక్తితో పాటు కాశీంను రెండవ ముద్దాయిగా చూపుతూ ఎఫ్.ఐ.ఆర్ నమోదు చేశారు. మావోయిస్టులకు లేఖలు రాశాడనే అభియోగంతో ఆయనపై దేశంలో పరమ అప్రజాస్వామిక చట్టాల్లో ఒకటైన చట్టవ్యతిరేక కార్యకలాపాల నిరోధక చట్టం (UAPA) కింద కేసు పెట్టి అరెస్టు చేయడానికి రంగం సిద్ధం చేశారు. UAPA కేసులో నిందితులు తాము నిర్దోషులమని వారే నిరూపణ చేసుకోవాల్సి ఉంటుంది. దేశవ్యాప్తంగా ప్రజాస్వామిక ఉద్యమ గొంతుకలపై, విస్థాపన సమస్యపై పోరాడుతున్న ఆదివాసులపై ఈ దుర్మార్గమైన చట్టాన్ని రాజ్యం ప్రయోగిస్తూ వస్తున్నది. ఈ చట్టాన్ని ఉపయోగించుకుని వందలాది కేసులు నమోదు చేసింది. ఢిల్లీ యూనివర్సిటీ ప్రొఫెసర్ సాయిబాబాను, తొంబై శాతం అంగవైకల్యంతో తీవ్ర అనారోగ్యంతో ఉన్నప్పటికీ ఏడాదిన్నరగా అమానుష పద్ధతుల్లో నిర్బంధించి చిత్రహింసలపాలు చేస్తున్నది. కా.కాశీంపై కేసు ప్రజాస్వామిక గొంతుల్ని నొక్కివేసే చర్యల్లో భాగమే.

ఒక వైపు దేశమంతా ఆర్.ఎస్.ఎస్., బి.జె.పి. ఫాసిజంపై అట్టుడికి పోతోంది. సందుసందునా హిందూ మతం పేరుతో అరాచక శక్తులు చెలరేగిపోతున్నాయి. ముస్లింలను, దళితులను, రచయితలను, బుద్ధిజీవులను వెంటాడుతున్నారు. హైదారాబాద్ సెంట్రల్ యూనివర్సిటీ విద్యార్థి ఆత్మహత్యకు కారకులైన వారిపై చట్టపరమైన చర్యలు తీసుకోవాలని విద్యార్థిలోకం పోరాడుతోంది. ప్రభుత్వం మాత్రం ప్రజాస్వామికవాదులపై కేసులు నమోదు చేసి అరెస్టులు చేస్తోంది. తెలంగాణ వస్తే అక్రమ కేసులన్నీ ఎత్తేస్తామని హామీ ఇచ్చాడు చంద్రశేఖరరావు. ఇప్పుడు ఆయన ప్రభుత్వమే ఫాసిస్టు మూకల చర్యల పట్ల చేతులు ముడుచుకు కూర్చొని, ప్రజాసంఘాల కార్యకర్తలపై మాత్రం అక్రమ కేసులు పెడుతున్నది. ప్రజాస్వామిక హక్కులకు భరోసానిచ్చే తెలంగాణ కోసం దాదాపు నాలుగు వందల సంఘాలతో ఏర్పడిన తెలంగాణ డెమాక్రటిక్ ఫ్రంట్ వంటి బలమైన ప్రజాస్వామిక గొంతుకలు విన్నించినా ప్రభుత్వ వైఖరిలో ఏ మార్పూ లేదు. కా.కాశీంపై కేసు అప్రజాస్వామికం. నమోదు చేసిన UAPA అంతకన్నా అప్రజాస్వామికం. కాశీంపై కేసును ఎత్తివేయాలని, అట్లాగే UAPAను రద్దు చేయాలని అందరం కలిసికట్టుగా డిమాండ్ చేద్దాం. ప్రభుత్వ అణచివేత విధానాన్ని నిరసించాల్సిందిగా రచయితలూ, ప్రజాసంఘాలూ, ప్రజాస్వామికవాదులకు విరసం విజ్ఞప్తి చేస్తున్నది.

**పి.వరలక్ష్మి** (విరసం కార్యదర్శి),
**వరవరరావు** (విరసం సీనియర్ సభ్యులు)
**పాణి, రాంకి** (విరసం కార్యవర్గ సభ్యులు)

తేదీ: 22/01/2016

# ప్రస్తుతం మా వద్ద అందుబాటులో ఉన్న విరసం, ఇతర ప్రచురణలు, వాటి ధరలు

## కథ, నవల, కవిత్వం, సాహిత్య విమర్శ

| | | |
|---|---|---|
| 1. | కొడవటిగంటి కుటుంబరావు - 1 (కథలు) | 200-00 |
| 2. | కొడవటిగంటి కుటుంబరావు - 2 (కథలు) | 200-00 |
| 3. | కొడవటిగంటి కుటుంబరావు - 8 (నవలలు) | 250-00 |
| 4. | కొడవటిగంటి కుటుంబరావు - 9 (నవలలు, కథలు నాటికలు) | 250-00 |
| 5. | కొడవటిగంటి కుటుంబరావు - 10 (సైన్స్ వ్యాసాలు) | 300-00 |
| 6. | కొడవటిగంటి కుటుంబరావు - 11 (చరిత్ర వ్యాసాలు) | 150-00 |
| 7. | కొడవటిగంటి కుటుంబరావు - 12 (రాజకీయ వ్యాసాలు) | 400-00 |
| 8. | కొడవటిగంటి కుటుంబరావు - 13 (సంస్కృతి వ్యాసాలు) | 300-00 |
| 9. | కొడవటిగంటి కుటుంబరావు - 14 (సినిమా వ్యాసాలు) | 300-00 |
| 10. | కొడవటిగంటి కుటుంబరావు - 16 ఎ (సాహిత్య వ్యాసాలు) | 300-00 |
| 11. | కొడవటిగంటి కుటుంబరావు - 16 బి (సంస్కృతి వ్యాసాలు) | 300-00 |
| 12. | కొడవటిగంటి కుటుంబరావు - 17 (తాత్విక వ్యాసాలు) | 150-00 |
| 13. | కొడవటిగంటి కుటుంబరావు - 18 (లేఖలు) | 125-00 |
| 14. | కె.వి.ఆర్. సాహిత్య వ్యాసాలు (మొదటి భాగం) | 300-00 |
| 15. | కె.వి.ఆర్. సాహిత్య వ్యాసాలు (రెండవ భాగం) | 250-00 |
| 16. | కె.వి.ఆర్. సాహిత్య వ్యాసాలు (మూడవ భాగం) | 250-00 |
| 17. | కె.వి.ఆర్. సామాజిక వ్యాసాలు (నాల్గవ భాగం) | 250-00 |
| 18. | కె.వి.ఆర్. మహోదయం | 200-00 |
| 19. | వసంతగీతం (అల్లం రాజయ్య) | 250-00 |
| 20. | కొమురం భీం (అల్లం రాజయ్య) | 150-00 |
| 21. | సృష్టికర్తలు (అల్లం రాజయ్య) | 150-00 |
| 22. | సాహిత్య సమాలోచన (కృష్ణాబాయి) | 300-00 |
| 23. | భావవిప్లవకారుడు కొకు | 80-00 |
| 24. | కొకు సమకాలీనత - విశ్లేషణా వ్యాసాలు | 75-00 |
| 25. | అక్షరతుణీరం (కె.వి.ఆర్. సాహిత్య విమర్శ వ్యాసాలు) | 20-00 |
| 26. | సుబ్బారావు పాణిగ్రాహి కవిత్వం, పాటలు | 25-00 |
| 27. | అంతస్సూత్రం (వరవరరావు కవిత్వం) | 40-00 |
| 28. | బీజభూమి (వరవరరావు కవిత్వం) | 100-00 |
| 29. | గుమ్మెటమోత (పాణి నవల) | 100-00 |
| 30. | కలిసి పాడాల్సిన గీతమొక్కటే (పాణి కవిత్వం) | 10-00 |
| 31. | చలసాని ప్రసాద్ రచనలు | 100-00 |
| 32. | దండకారణ్య కథలు | 100-00 |
| 32. | తెలుగు భాష - కొన్ని సంగతులు (వి.చెంచయ్య) | 15-00 |
| 33. | సామాజికం (వి. చెంచయ్య) | 30-00 |
| 34. | సాహిత్యధోరణులు - విప్లవ దృక్పథం | 30-00 |
| 35. | కథల పంట-3 | 120-00 |
| 36. | కదిలే కథ | 80-00 |
| 37. | టీత్వాల్ కుక్క మరికొన్ని కథలు (సాదత్ హసన్ మంటో) | 60-00 |
| 38. | జాజిపూల పరిమళం (షహీదా కథలు) | 150-00 |
| 39. | ఒక మాట, ఒక సంభాషణ (షహీదా కవిత్వం) | 75-00 |
| 40. | సామాన్యుల సాహసం (నిత్య, మైనా, సుజాత కథలు) | 60-00 |
| 41. | ఫాల్గుణ (పద్మకుమారి నవలిక) | 30-00 |
| 42. | లాల్‌బనో గులామీ ఛోడో బోలో వందేమాతరం (ఎన్కె దీర్ఘ కవిత) | 25-00 |
| 43. | ముదిమనిషి (అరుణతార కథలు 1) | 30-00 |
| 44. | చేపలు (అరుణతార కథలు 2) | 30-00 |
| 45. | కథ అడ్డం తిరిగింది (అరుణతార కథలు 3) | 30-00 |
| 46. | కో...బలి (అరుణతార కథలు 4) | 30-00 |
| 47. | అడవిలోని వెన్నెల (అరుణతార కథలు 5) | 30-00 |
| 48. | నెలవు (అరుణతార కథలు 6) | 30-00 |
| 49. | ఒక వీరుడు మరణిస్తే (అరుణతార కథలు 7) | 30-00 |
| 50. | తెహెల్కా అద్దంలో సర్కారు బింబం మరికొంత కవిత్వం (బాసిత్) | 100-00 |
| 51. | ఆఖరి బిడ్డ (బాసిత్ నాటిక) | 10-00 |
| 52. | కిటికీ పిట్ట (పి. మోహన్ కవిత్వం) | 10-00 |
| 53. | మంజీరా మూడ్స్ (మంజీరా కవిత్వం) | 25-00 |
| 54. | కవితా ఝంకార్ (విరసం కవితా సంకలనం) | 75-00 |
| 55. | ఎర్రనక్షత్రం (చైనా నవల) | 50-00 |
| 56. | నెగడు (కథలు) | 90-00 |
| 57. | పరామర్శ (నల్లూరి రుక్మిణి) | 80-00 |
| 58. | ఒంట్రిమట్టి (నవల) | 170-00 |
| 59. | Wake of Telangana? - A docu-drama by basith | 10-00 |
| 60. | యంత్రాల మధ్య | 35-00 |
| 61. | అక్షర కిరణం (కె.వి.ఆర్.) | 50-00 |
| 62. | డావిన్సి (మోహన్) | 150-00 |
| 63. | మార్క్సిస్టు సాహిత్య విమర్శ (డా॥ శ్రీనివాస్) | 100-00 |
| 64. | అగ్నిశిఖ | 80-00 |
| 65. | కార్మిక వర్గ పుత్రుడు | 70-00 |
| 66. | బలహీనుడి బలం | 25-00 |
| 67. | పాలమూరు వలస బతుకు చిత్రాలు - గీతాంజలి | 150-00 |
| 68. | ఏది నేరం?! (హజారీబాగ్ జైలు గాథలు) - బి. అనూరాధ | 75-00 |
| 69. | వెలుగు రవ్వల జడి (ఆలూరి భుజంగరావు) | 70-00 |
| 70. | అరణ్య పర్వం | 120-00 |
| 71. | ప్రజలు అజేయులు | 25-00 |
| 72. | చైనా | 50-00 |
| 73. | గమ్యం దిశగా గమనం | 30-00 |
| 74. | దిక్కు మొక్కు లేని జనం | 30-00 |
| 75. | సాహిత్య వ్యాసాలు (చలసాని ప్రసాద్) | 100-00 |
| 76. | కలం యోధుడు చెరబండరాజు (వి. చెంచయ్య) | 20-00 |

## సంస్కృతి, చరిత్ర, రాజకీయార్థిక, సైద్ధాంతిక రచనలు

| | | |
|---|---|---|
| 1. | సామ్రాజ్యవాద సంస్కృతి (జేమ్స్ పెట్రాస్ వ్యాసాలు) | 125-00 |
| 2. | మావో రచనలు - 1 | 220-00 |
| 3. | మావో రచనలు - 2 | 220-00 |
| 4. | రివిజనిజం (మావో) | 75-00 |
| 5. | మార్క్సిజం, లెనినిజం, మావోయిజం | 125-00 |
| 6. | మార్క్సిస్టు తత్వశాస్త్రం | 80-00 |
| 7. | చారుమజుందార్ 8 డాక్యుమెంట్లు | 50-00 |
| 8. | మంద్రస్థాయి యుద్ధం | 100-00 |
| 9. | విద్యార్థి యువజనోద్యమాలు (లెనిన్) | 30-00 |
| 10. | రాజకీయ కృషి - మన కృషి అంతటికీ జీవనాడి (చైనా విప్లవోద్యమన పత్రిక హాంకీ వ్యాసాలు) | 35-00 |
| 11. | నక్సల్బరీ వెలుగులో (భారతదేశ నక్సలైట్ ఉద్యమ చరిత్ర) | 125-00 |
| 12. | జగిత్యాల జంగల్‌మహల్ (1) | 75-00 |
| 13. | జగిత్యాల జంగల్‌మహల్ (2) | 100-00 |
| 14. | స్టోలిపిన్ అభివృద్ధి నిరోధక కాలంలో | 15-00 |
| 15. | అంతర్జాతీయ విప్లవోద్యమాల్లోని ఆటుపోట్లు | 60-00 |
| 16. | భారతదేశంలో ఉత్పత్తి విధానం - ఉత్పత్తి సంబంధాలు | 20-00 |
| 17. | ఆంధ్రప్రదేశ్‌లో వ్యవసాయోత్పత్తి సంబంధాలు | 30-00 |
| 18. | నేటి రాయలసీమ | 100-00 |
| 19. | గతాన్ని సమీక్షించుకుందాం | 50-00 |
| 20. | చూటే పేరిన రచనలు | 125-00 |

| | | |
|---|---|---|
| 21. | మావో సే టుంగ్ | 80-00 |
| 22. | గెరిల్లా యుద్ధం | 60-00 |
| 23. | చైనా ప్రజా విముక్తి సైన్యం | 40-00 |
| 24. | భూమి సంస్కృతి నాగరికత | 15-00 |
| 25. | స్త్రీవాద ఉద్యమం (అనురాధ గాంధీ) | 25-00 |
| 26. | కొత్త చూపు (ఆర్.ఎస్. రావు) | 120-00 |
| 27. | అభివృద్ధిని ఇలా చూద్దాం (ముదునూరి భారతి) | 80-00 |
| 28. | In Search of Method (Mudunuri Bharati) | 200-00 |
| 29. | On Education (Mudunuri Bharati) | 180-00 |
| 30. | Crisis and Development in Marxian Frame Work (Mudunuri Bharati) | 80-00 |
| 31. | Individual, Sub-Groups, Groups and Freedom (Mudunuri Bharati) | 75-00 |
| 32. | Methodology of Social Enquiry (Mudunuri Bharati) | 150-00 |
| 33 | Fifty Years of Andhra Pradesh 1956-2006 | 300-00 |
| 34. | జనతన సర్కార్ కావాలి మేక్ ఇన్ ఇండియా కాదు | 15-00 |
| 35. | విద్యార్థి ఉద్యమాల్లో విప్లవ దిద్దుబాటు | 30-00 |
| 36. | జాతుల సమస్య రిజర్వేషన్లు కార్మిక వర్గ దృక్పథం | 25-00 |
| 37. | తత్వశాస్త్రం మాయాజాలం కాదు | 20-00 |
| 38. | వైరుధ్యాలు | 20-00 |
| 39. | చైనా తాత్విక రంగాన మూడు ప్రధాన పోరాటాలు 1949-64 | 20-00 |

### వర్తమాన సమాజం, ప్రజా ఉద్యమాలు

| | | |
|---|---|---|
| 1. | ముజఫర్‌నగర్ మరో మానని గాయం | 20-00 |
| 2. | ఆకాస ఉద్యమ అమరులు | 10-00 |
| 3. | దండకారణ్యంలో గ్రీన్‌హంట్ | 60-00 |
| 4. | ఉద్యమ ఆకాశంలో సగం | 15-00 |
| 5. | తూర్పు మధ్య భారతంలో విస్థాపన-ప్రజా ప్రతిఘటన | 20-00 |
| 6. | జనతన జైత్రయాత్ర | 20-00 |
| 7. | ఫిలిప్పినో ఉద్యమం | 15-00 |
| 8. | ఖైదీల సైరన్ | 60-00 |
| 9. | విముక్తిబాటలో నారాయణపట్నా | 20-00 |
| 10. | అంతర్యుద్ధంలో ఆదివాసులు | 30-00 |
| 11. | నిత్య జీవితంలో సోషలిజం (భూసారం శివన్న) | 100-00 |
| 12. | ఆకుల భూమయ్య రచనలు | 40-00 |
| 13. | అమలు కానీ హామీల చరిత్ర (శశికళ) | 100-00 |
| 14. | ది ఫ్లేమ్స్ ఆఫ్ నారాయణ పట్నా | 60-00 |
| 15. | దాక్షిణ్య వాదం నుంచి దండకారణ్యం దాకా (రత్నమాల) | 200-00 |
| 16. | నూతన సంభాషణ (రత్నమాల) | 80-00 |
| 17. | జర్నలిజం ప్రొఫెషన్ (రత్నమాల | 50-00 |
| 18. | సాహిత్య ధోరణులు విప్లవ ధోరణులు | 30-00 |

### స్మృతి సాహిత్యం

| | | |
|---|---|---|
| 1. | ఖాన్‌దాదా (ఎం.టి.ఖాన్ స్మృతి) | 10-00 |
| 2. | ఆదర్శజీవులు అమరులు | 30-00 |
| 3. | గంటి ప్రసాద్ రచనలు | 25-00 |
| 4. | సూర్యుడు మరణించడు | 60-00 |
| 5. | చిరునవ్వు సితార | 80-00 |
| 6. | గెరిల్లా డైరీ | 10-00 |
| 7. | మన్యం వెలుగులు | 15-00 |
| 8. | అక్షర కిరణం | 20-00 |
| 9. | అడవి పుత్రుడు మంగన్న | 10-00 |
| 10. | గజ్జెల సరోజ | 15-00 |
| 11. | మహిత | 10-00 |
| 12. | కోటి జ్ఞాపకాలు | 50-00 |
| 13. | అమరుల యాదిలో | 30-00 |
| 14. | అమరుల జీవిత చరిత్ర | 30-00 |
| 15. | వెగుచుక్కల వెలుతురులో | 10-00 |
| 16. | లంకపల్లి అమరులకు విప్లవ జోహార్లు | 10-00 |
| 17. | శారద స్మృతి శకలాలు | 30-00 |

### డివిడిలు

| | | |
|---|---|---|
| 1. | అరుణతార సాహిత్య సాంస్కృతిక మాసపత్రిక (1977-2013) | 125-00 |

### ప్రస్తుతం మా వద్ద అందుబాటులో లేని పుస్తకాలు

| | | |
|---|---|---|
| 1. | కొడవటిగంటి కుటుంబరావు - 3 (కథలు) | 200-00 |
| 2. | కొడవటిగంటి కుటుంబరావు - 4 (కథలు) | 200-00 |
| 3. | కొడవటిగంటి కుటుంబరావు - 5 (గొలుసు కథలు) | 200-00 |
| 4. | కొడవటిగంటి కుటుంబరావు - 6 (నవలలు) | 200-00 |
| 5. | కొడవటిగంటి కుటుంబరావు - 7 (నవలలు) | 250-00 |
| 6. | కొడవటిగంటి కుటుంబరావు - 15 (సినిమా వ్యాసాలు) | 250-00 |
| 7. | తరాల పల్లె (కౌముది రచనలు) | 50-00 |
| 8. | విరసం సాహిత్య విమర్శ | 150-00 |
| 9. | నల్లమల (పి. చంద్ నవల) | 225-00 |
| 10. | కాంత, పున్నం, వెన్నెల (పద్మకుమారి కథ) | 20-00 |
| 11. | రేపు (వెర్నన్ గొంజాల్వెజ్ కథ) | 20-00 |
| 12. | మిగిలెటోళ్లు (బాసిత్ కథలు) | 50-00 |
| 13. | రెండు పోరాట గాథలు (భారతి కథలు) | 50-00 |
| 14. | పిల్లనగ్రోవి తుఫాను (ఉదయభాను కవిత్వం) | 10-00 |
| 15. | సముద్రంతో సంభాషణ (పి. వరలక్ష్మి) | 20-00 |
| 16. | వాట్సప్ తరంలో యుద్ధగీతం | 30-00 |
| 17. | చైనా కమ్యూనిస్టు పార్టీ మౌలిక అవగాహన | 100-00 |
| 18. | ఐక్య సంఘటన సిద్ధాంత వ్యాసాలు | 35-00 |
| 19. | బాలగోపాల్ తాత్విక గందరగోళం | 70-00 |
| 20. | అంతర్యుద్ధంలో ఆదివాసులు | 30-00 |
| 21. | జ్ఞానం అందరిది | 30-00 |
| 22. | లక్ష్మింపేట | 25-00 |
| 23. | గ్రీన్‌హంట్ ఉత్పాతాలు | 25-00 |
| 24. | నేనున్నాను కామ్రేడ్ (గంటి ప్రసాదం స్మృతిలో) | 30-00 |
| 25. | పువర్తి అమరులు | 20-00 |
| 26. | అజ్ఞాత విప్లవ యోధుడు అమరుడు కొండన్న | 50-00 |

మరిన్ని వివరాలకు సంప్రదించండి : డి.వి. రామక్రిష్ణారావు, అరుణతార వర్కింగ్ ఎడిటర్,
ఫోన్ : 99891 89250 (ఉదయం 9 లోపు సాయంత్రం 8 తరువాత మాత్రమే) ఈమెయిల్ : arunatara1977@gmail.com
పుస్తకాల ధరకు సరిపడా డబ్బులతో పాటు, పోస్టింగ్ ఖర్చులను జతచేసి ఎం.ఓ. లేక డిడి ద్వారా పంపి పుస్తకాలను పొందవచ్చు.
ఆన్‌లైన్‌లో డి.వి.రామక్రిష్ణారావు, స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, లాలాగూడ బ్రాంచ్, హైదరాబాద్, ఎకౌంట్ నెం. 10243583773,
ఐఎఫ్ఎస్‌సి కోడ్ : ఎస్.బి.ఐ.ఎన్.0007112కి చెల్లించి పుస్తకాలను పొందవచ్చు.
పి. వరలక్ష్మి, విరసం కార్యదర్శి, 5-1820, గీతాశ్రమం వీధి, ప్రొద్దుటూరు. ఫోన్ : 81799 13123, ఈమెయిల్ : varalurwa@gmail.com

*మా ప్రచురణలు నవోదయ బుక్ హౌస్, ఆర్యసమాజ్ ఎదురుగా, కాచిగూడ చౌరస్తా, హైదరాబాద్‌లోనూ లభిస్తాయి. ఫోన్ నెం: 040-24652387*

## -: స్వీకారం

**సామ్రాజ్యవాద దోపిడీ మండళాలు**
యం. రత్నమాల
ప్రచురణ : నూతన ప్రచురణలు
వెల : రు. 50/-
పేజీలు : 56

**ప్రజలు-నిర్వాసిత సమస్య-పాలకులు**
యం. రత్నమాల
ప్రచురణ : నూతన ప్రచురణలు
వెల : రు. 20/-
పేజీలు : 32

**లెనిన్ ప్రసిద్ధ రచన వామపక్ష కమ్యూనిజం-ఒక బాలారిష్టం**
ఎస్.వి.ఎస్. నాగభూషణ్
ప్రచురణ : ఆలోచనా ప్రచురణలు
వెల : రు. 30/-
పేజీలు : 64

**యక్షగానం**
దేవులపల్లి కృష్ణమూర్తి కథలు
ప్రచురణ : డి.కె. ప్రచురణలు
వెల : రు. 120/-
పేజీలు : 152

**వీర తెలంగాణా విప్లవ పోరాటంలో కామ్రేడ్ పద్మ**
జంపా గౌతమ్ రావు
ప్రచురణ : జయంతి పబ్లికేషన్స్
వెల : రు. 75/-
పేజీలు : 144

**రేపటి బాల్యం కోసం**
ఎం. రాఘవాచారి కవిత్వం
ప్రచురణ : పాలమూరు ప్రచురణలు పాలమూరు అధ్యయన వేదిక
వెల : లేదు
పేజీలు : 28

**భిక్షాపాత్ర**
(దీర్ఘకవిత)
బరకు
వెల : రు. 25/-
పేజీలు : 28

**అక్షర సత్యామృతం**
బొమ్మిన వెంకటరమణ
వెల : రు. 99/-
పేజీలు : 126

**అనేక ఆకాశాలు**
స్త్రీల కథలు
పుట్ల హేమలత
కె.ఎన్. మల్లీశ్వరి
ప్రచురణ : ప్రరవే
వెల : రు. 150/-
పేజీలు : 160

**అరుణ కిరణాలు**
ప్రజల పాటలు
ప్రచురణ : అరుణోదయ సాంస్కృతిక సమాఖ్య
వెల : రు. 80/-
పేజీలు : 190

**పూవులు సమ్మె చేస్తాయి**
కవిత్వం
ఏటూరి నాగేంద్రబాబు
ప్రచురణ : పొట్టి శ్రీరాములు నెల్లూరు జిల్లా రచయితల సంఘం
వెల : రు. 70/-
పేజీలు : 80

**కాకిముద్ద**
కవిత్వం
ఈతకోట సుబ్బారావు
వెల : రు. 100/-
పేజీలు : 142

**అంతర్జాతీయ సమస్యలు**
కా. డి.వి. రచనలు - 4
కా. దేవులపల్లి వెంకటేశ్వరరావు
ప్రచురణ : పోరునేల ప్రచురణలు
వెల : రు. 120/-
పేజీలు : 213

**తెలంగాణ ప్రజల సాయుధ పోరాటం**
కా. డి.వి. రచనలు - 5
కా. దేవులపల్లి వెంకటేశ్వరరావు
ప్రచురణ : పోరునేల ప్రచురణలు
వెల : రు. 300/-
పేజీలు : 646

**విస్థాపన్ జన ఆందోళన్**
ప్రచురణ : విస్థాన్ విరోధి జనవికాస్ ఆందోళన్
వెల : రు. 225/-
పేజీలు : 352

ARUNATARA A Literary and Cultural Telugu Monthly Journal of Revolutionary Writers' Association (VIRASAM)
● RNI Regn.No.21152/72 ● Published on 26/2/2016 320 - Dec'2015 - Jan'2016










ఇన్ని సంవత్సరాలుగా అడగాల్సినంత అడగనేలేదు
మనం చాలా తక్కువ ప్రశ్నించాం
నాలుగు గోడల మధ్య గుసగుసలాడుకున్నాం
అందుకే వాడికి కొమ్ములు వచ్చాయి
నాలుగు రోడ్ల కూడలిలో జనం మధ్యకు వచ్చి నినదిద్దాం
అడగాల్సిందంతా అడిగేద్దాం
కడగాల్సిందంతా కడిగేద్దాం
ప్రశ్నల జడివాన కురిపిద్దాం
సమిష్టి బలం ముందు వీడికంటే కొమ్ములు మొలిచిన
వాళ్లు మట్టి కొట్టుకు పోయారు

Edited, printed, published and owned by Chalasani Prasad, H.No. 33-13-3, Seetharampuram, Vijayawada - 520 002
Printed at Nagendra Printing Press, Vijayawada - 520 002.
Editor : Chalasani Prasad

On behalf of Chalasani Prasad this issue is Published by D.V. Ramakrishna Rao, awaiting for Magistrate Order.



మనము ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA101M183 |
| పుస్తకం పేరు | అరుణతార |
| తారీఖు | 08 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 71 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | naima |
| పేజీలు విడదీసినది | Bhanu |
| స్కాన్ చేసినది | Naveeda |
| పరీక్ష చేసినది | sireesha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |